

శిశిరంపు బ్రతుకు
ఫొటో: వై. సావిత్రి (సికింద్రాబాదు)

మోహనాంగులు మోజుపడేవి

బిన్నీవారి

# అసలు పట్టు చీరలు

మెత్తటి పట్టు, జార్జెట్లలో లభించును.




**బెంగుళూరు ఉలెన్, కాటన్ & సిల్క్ మిల్స్**
**కంపెనీ లిమిటెడ్**
**అగ్రహారం రోడ్, బెంగుళూరు - 2**
**బిన్నీ & కంపెనీ (మద్రాసు) లిమిటెడ్ వారిది.**

# ఉత్తరాలు

## మాసెరా ష్ట్రం

కౌండిన్యగారు 'ఆయుర్వేద విద్యార్థుల'ను గూర్చి వ్రాసిన వ్యాసాన్ని విమర్శిస్తూ, శ్రీ ద్వి మూ మూర్తిగారు 18—10—61 సంచికలో వ్రాసిన ఉత్తరం అయోమయంగా ఉన్నది "ఆ కళాశాలలో ఉన్న పాఠ్య ప్రణాళికలో ఆయుర్వేదానికి ఎంతస్థానం ఉన్నదో అల్లోపతికి కూడా అంతస్థానం ఉన్నది" అంటూ ఉత్తరం ప్రారంభించి,చివరలో "శ్రీ కౌండిన్య గారు కోరినట్లుగా ఆ కళాశాల రెండు సంవత్సరాల క్రితమే శుద్ధ ఆయుర్వేద కళాశాలగా మారి. . ." అని వ్రాస్తే పాఠకులు ఏమని అర్థం చేసుకోవాలో బోధపడటంలేదు

ఉత్తరం సంగతి ఎలాఉన్నా, యదార్థ పరిస్థితి ఏమిటో పరిశీలిద్దాం ఈ కళాశాలలో ప్రస్తుతం ఆధునికవైద్యం, ఫార్మకాలజీ బోధిస్తున్నా, 'ఇండియన్ మెడిసిన్‌బోర్డు' ఆమోదించిన పాఠ్య ప్రణాళికలో ఆ విషయాలు లేవనీ, విద్యార్థుల కోరికపై నాలుగు సంవత్సరాల కోర్సు పూర్తిచేసింతరువాత, అదనంగా ఈ రెండు విషయాలు బోధించే ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం అంగీకరించిందనీ, కళాశాల ప్రిన్సిపాల్ తెల్పారు (డక్కన్ క్రానికల్ సెప్టెంబరు 20) అలాంటప్పుడు పాఠ్యప్రణాళికలో ఆయుర్వేదానికి ఎంతస్థానం ఉన్నదో అల్లోపతికి అంత స్థానం ఉన్నదని ఎలా అనగలం కాగా అల్లోపతిలో బహు పరిమితమైన పరిజ్ఞానంకల ఈ ఆయుర్వేద వైద్యులకు అల్లోపతి ప్రాక్టీసు చేసుకోనివ్వాలంటే అది వారి వ్యామోహంకాక మరేమిటి ?

ఎస్ వి రామమూర్తి (గుంటూరు)

## అగ్గిరాముడు

"అగ్గిరాముడు" బొమ్మలకథ చాలా ఆకర్షణీయంగా ఉంది కథ చాలా రసవత్తరంగా జరుగుతోంది. ఈ కథ తొందరలో ముగించి మమ్మలను నిరాశపరచరని నమ్ముతున్నాము

జి. సీతారామాంజనేయులు (చిలుకూరు)

## కార్టూన్‌లు

సుందర్‌గారు వేసిన కార్టూన్లను 'అనందర్భము'గా ఉన్నది ఎవరైనా డ్రింకులు త్రాగేటప్పుడు గ్లాసు ముందుపెట్టుకొని త్రాగుతారు. అందులో గడ్డము వెనుక పెట్టుకొని త్రాగినట్లు వేసినారు

ఆర్ ఎస్ రెడ్డి (గుంటూరు)

*    *    *

సుందర్‌గారి కుమ్మరి వెంకన్న కార్టూను బాగానే వుంది కాని కుమ్మరివాళ్ళు ఆవిధంగా "సైన్‌బోర్డు" పెట్టుకోగా ఎప్పుడూ చూడలేదు అది చిత్రకారుని పొరపాటో, లేకపోతే వట్నపు కుమ్మరివాళ్ళు ఆవిధంగ తగిలిస్తున్నారో తెలియదు

కందికుప్ప కృష్ణమూర్తి (వాల్తేరు)

## భూతలస్వర్గం

శ్రీ ...గారి "భూతలస్వర్గం" చాలాబాగుంది.

సావిత్రిగారు అక్కడి విషయాలను స్పష్టంగాను, చక్కగాను వివరించారు

బోయినపల్లి సుధాకర్‌రావు (కల్వెలపాలెం)

## గళ్ళ నుడి కట్టు

71 వ గళ్ళ నుడికట్టు (27—9—61) నందు 18 నిలువు "కరవీరము" అను అధారమునకు జవాబు "గన్నేరు"గా ప్రకటించారు. "కరవీరము"నకు "గన్నేరు"నకు ఏ విధమైన సంబంధము లేదని నా "అనుమానము". నా అనుమానమును తీర్చగలిగినచో కృతజ్ఞుణ్ణి.

"పరపోలు నాయుడు" (విజయనగరం)

## ఉత్తరాలు

నిఘంటువు చూడండి

## ధ్రువతార

ధ్రువతార ముగింపు మేమనుకొన్నట్లుగానే ఉన్నది. కాళిదాసు ఓర్పు వహిస్తూ, పిల్లవాడిని పెంచగలడని ఆశిస్తున్నాము. రచయితకు, పత్రిక ద్వారా మా అభినందనలు అందించగోర్తాము. మళ్లీ యిలాంటి నవల ఎన్నాళ్లకో!

కె. వి. యస్. యన్. మూర్తి (విశాఖపట్నం)

బుధవారం: 25-10-61

ప్లవ సం॥ ఆశ్వయుజ బ॥ విదియ

సంపుటము: 54 సంచిక: 7

స్థాపితము:

1908

*

ముఖ్యసంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు:

శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి: 25 న. పై

సంవత్సర చందా: 13-0-0 రు.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము

7, తంబుచెట్టివీధి, మద్రాసు-1

★

## లోకంపోకడ



'ఇలా వచ్చే పాపిష్టి డబ్బుతో ఏమి చేస్తారట!'

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు:

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: హిందీతార మాలాసిన్హా



### శ్రీశైల ఆలయ ఉద్ధరణ నిధి

'ఆంధ్రపత్రిక' సేకరిస్తున్న శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జున స్వామివారి ఆలయ ఉద్ధరణ నిధికి అక్టోబరు 14 వ తేదీనాటికి రు. 60,328-59 వసూలు అయింది. యథాశక్తి విరాళాలు ఇచ్చి, ఈ పవిత్రమైన కార్యక్రమాన్ని జయప్రదం చేయవలసిందని ప్రజలకు, ప్రజాసంస్థలకు విజ్ఞప్తి చేస్తున్నాము.


స్త్రీ పురుషుల మధ్య అసమానత రద్దు
చెయ్యటమే తమ లక్ష్యమని హామీ
ఇచ్చి, స్త్రీల ఓట్లు పొందవచ్చునని
పి ఎస్ పి
ఆశాభావం
స్త్రీల ఓట్లు
నెహ్రూ-లియాఖత్ ఒప్పందం
ముందు నీవేగా చింపావు
అన్యాయం! అక్రమం!
నెహ్రూ-లియాఖత్ ఒప్పందం
మరిగుజ్జు-
రాక్షసుడు
చైనా నేపాల్ ఒప్పందం



పోలెండ్ అధ్యక్షుడు శ్రీ జవాడ్స్కీ ఈ 11 వ తేదీన న్యూఢిల్లీ వచ్చినప్పుడు పాలం విమానాశ్రయంలో ఉపరాష్ట్రపతి డా|| రాధాకృష్ణన్, ప్రధాని శ్రీ నెహ్రూ ప్రభృతుల స్వాగతం.

## న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణ

# భారత ప్రజాస్వామ్యానికి లభించిన విజయం: జాతిసమైక్యతను నిరోధిస్తున్న మహామహులెవరు?

ఈ వారం చెప్పుకోతగినవి రెండు సంఘటనలు వత్తిడి చేసి రాజకీయ ప్రయోజనాలు సాధించే పద్ధతిపై ప్రజాస్వామ్యానికి లభించిన విజయం మొదటిది రెండవది జాతిసమైక్యతా మహాసభ ప్రథమ సమావేశం.

రెండవ సంఘటన గూర్చి ముందు పరిశీలిద్దాం. 1947, ఆగస్టు 15 వ తేదీ నుంచి నిరంతరాయంగా, అప్రతిహతంగా పరిపాలన సాగిస్తున్న అధికార పక్షం ఈ మహాసభను ఏర్పాటు చెయ్యటం అవసరంగానే కన్పిస్తుంది. వివిధ విధానాల్ని పునర్వ్యవస్థీకరించవలసిన అవశ్యకతను గూర్చి రాష్ట్రపతి మొదలుకొని ప్రతివ్యక్తి ఉపన్యాసాలకు దేశం అలవాటుపడింది. అయితే ఈ పునర్వ్యవస్థీకరణను అడ్డుకుంటున్నవా రెవరో మాత్రం బోధపడటంలేదు.

ఒకసారి కాంగ్రెసు చరిత్రను సింహావలోకనం చేద్దాం. భాష ప్రాతిపదికగా దేశాన్ని విభజించి ప్రదేశ్ కాంగ్రెసు సంఘాలు ఏర్పాటు చేసినవారు మహాత్మాగాంధి ఆయన మరో రెండు ఘన కార్యాలు కూడా చేశారు. వాటిలో ఒకటి జాతీయ పతాక సృష్టి. అదిలో ఈ జెండాలో మూడ రంగులు—హిందువులకు చిహ్నంగా ఎరుపు, ముస్లింలకు చిహ్నంగా ఆకుపచ్చ, మిగతా అల్పసంఖ్యాక వర్గాలకు చిహ్నంగా తెలుపు—ఉండేవి. సిక్కులు ఈ జెండాను బహిరంగంగా తగులబెట్టారు తమకు చిహ్నమైన కాషాయరంగు జాతీయ పతాకలో ఉండాలని పట్టుబట్టారు. వెంటనే మహాత్మా గాంధీ ఆ జెండాలో ఎరుపు రంగుకు బదులుగా కాషాయరంగుకు అవకాశం కల్పించారు అన్ని వర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నామని చెబుతూ జాతీయ సంస్థగా చెలామణి అవుతున్న కాంగ్రెసు కార్యవర్గంలో ఎప్పుడూ సిక్కు ప్రతినిధి ఒకరు ఉండనే ఉండేవారు. 1947 ఆగస్టు 15 వ తేదీన భారత ఆకాశవాణి ముగ్గురి ప్రసంగాలు ప్రసారం చేసింది వీటిలో ఒకటి ప్రధాని శ్రీ నెహ్రూ ఉపన్యాసం, రెండవది మహమ్మదాలీ జిన్నా ఉపన్యాసం, మూడవది సిక్కుల ప్రతినిధిగా సర్దార్ బల్దేవ్‌సింగ్ చేసిన ప్రసంగం. కనుక, అది నుంచి సిక్కులను సంతృప్తిపరచేందుకు నిర్దేశితంగా చేసిన ప్రయత్నాలే, ఈనాడు మాస్టర్ తారాసింగ్ నిరశనవ్రతం రూపంలో భారత ప్రజాస్వామ్యానికి పెద్ద సవాలుగా పరిణమించాయని స్పష్టం అవుతోంది ముస్లిం రాజకీయ నాయకులను త్రోసిపుచ్చి, మతోన్మాదులైన ముస్లిం మౌలానాలను గుర్తించటం గాంధిజీ చేసిన మూడవ ఘనకార్యం ముస్లిమ్‌లకు మతపిచ్చి ఎక్కువ కనుక మౌలానాలకు పలుకుబడి హెచ్చుగా ఉంటుందనే భావంతో ఆయన యిలా వ్యవహరించి ఉంటారని మనం అనుకోవాలి. ప్రతిపక్షాలతో కాంగ్రెసు ఆడిన నాటకమే ముస్లిమ్‌లీగ్ కూడా ఆడింది. మితవాదు లందరినీ బ్రిటిష్‌వారి తొత్తులుగా కాంగ్రెసు పరిగణించింది మౌలానాలకు కాంగ్రెసుపార్టీ "చూపుడు బాలురు" అని ముస్లింలీగ్ ముద్ర వేసింది ఈ మౌలానాలు శుక్రవారం ప్రార్థన సమావేశాలలో ప్రసంగించడానికి కూడా సాహసించలేకపోయేరు.

అఖిలభారత కాంగ్రెసు సంఘం తాలూకు 'ఎకనామిక్ రివ్యూ' పత్రికలో కేంద్ర ప్రభుత్వ సహాయ మంత్రి శ్రీ హుమయూన్ కబీర్ ఇటీవల వ్రాసిన వ్యాసంలో ఇలా, ఉన్నది : "ప్రభుత్వోద్యోగాలలోను, వాణిజ్యపరిశ్రమలలోను, తమకు తగిన వాటా లభించటంలేదని కొన్ని వర్గాలవారిలోను ముఖ్యంగా అల్పసంఖ్యాక వర్గాలలోనిస్పృహ కనిపిస్తోంది"

"ఉన్నత పదవులకు ముఖ్యంగా ప్రభుత్వంలో, పోటీ పరీక్షలు పెట్టి అభ్యర్థులను ఎన్నుకుంటున్న మాట వాస్తవమే ఈ కారణంచేత అందరికీ న్యాయం జరుగుతున్నట్లే అనిపిస్తుంది. కాని పరీక్షించే విషయాలు, పరీక్షాధికారులు ఒకే స్థాయిలో ఉన్నట్లు భావించటం అన్ని సందర్భాలలోను సాధ్యంకాదని పరీక్షల అనుభవం ఉన్నవా రందరికీ తెలుసు. ఇంటర్వ్యూలో ప్రధానంగా, వ్యక్తిగతమైన ఇష్టానిష్టాలకు తావు ఉండకపోదు. అంతేకాక చారిత్రక కారణాలవల్లే అనుకోండి, కొన్ని వర్గాల వారికి భాషా విషయకమైన సామర్థ్యం అధికంగా ఉండి, లిఖితపూర్వక పరీక్షలలో బాగా నెగ్గుతారు. పోటీ పరీక్షలలో ఉత్తీర్ణులై ఉద్యోగాలలో చేరిన ఏ యిద్దరిని పరిశీలించినా, పరీక్షలలో ఎక్కువ మార్కులు సంపాదించిన వ్యక్తే ఉద్యోగిగా కూడా ఎక్కువ సమర్థుడని చెప్పే అవకాశం కన్పించటం లేదు అందువల్ల ఉద్యోగులను ఎన్నుకొనడానికి ప్రస్తుతం అనుసరిస్తున్న పద్ధతిని సవరించరాదని అనలేం అయితే నిర్ణీత ప్రమాణాన్ని అందుకోలేని అభ్యర్థులను త్రోసిపుచ్చే సదుపాయం

(62—వ పేజీ చూడండి)



సత్యం గబగబా బయల్దేరి వెళ్లాడు.

బీచిలో సాయంకాలపు చల్లగాలిని అనుభవిస్తూ, ప్రియసఖితో కలిసివెళ్తున్న ఒక శిరీష కుసుమ కోమలిని, చంద్రవదనని, సన్నని నడుముగా, కలువల్లాంటి కళ్ళు—తుమ్మెదరెక్కలాంటి కురులూ గలిగి, నైలాన్‌సారీ, లిప్‌స్టిక్ పెదిమలూ, స్నో పౌడర్లతో వెలుగుతున్న ముఖకాంతి గలిగిన మోడరన్ ప్రణయ ప్రబంధసుందరిని, వెనక్కాలే వెళ్ళి సత్యం, "ఏమండీ!" అని పిల్చాడు

ఎవరీపురుగు! ఏమిటీ చెత్త! ఎక్కడిదీ దుమ్ము? అన్నట్టు చూసింది ఆ అమ్మాయి ఇతనికేసి.

ఆ చూపుకు సత్యం రక్తం గడ్డకట్టేసింది. నోట మాటరాలేదు. అయినా తను తలపెట్టింది మిత్రకార్యం కాబట్టి, తెగించి, నడుంబిగించి, గొంతుచించి, అడగదల్చుకుని చివరకు మెల్లిగా, "మీ రెవరో కాస్త—అంటే—ఎక్కువక్కరలేదు. కొంచెం చెబుతారా?" అని అన్నాడు, బతిమాల్తున్న ధోరణిలో.

నాయికను కోసం వచ్చింది. "యూ నెవర్ లెట్ మీ" అని కంపితాధరంతో అంటూ ప్రియసఖివేపు చూసింది "స్టుపిడ్!" అంది ప్రియసఖి

"హాఁ!" అనుకున్నాడు సత్యం గిరుక్కున వెనక్కి తిరిగాడు మిత్రబృందంవున్నచోటుకు వెళ్ళాడు అక్కడ ఎవరూలేరు తెల్లబోయి ఇటూ అటూ చూశాడు సత్యానికి దూరంగా రోడ్డుమీదవున్న కాఫీహోటలు బోర్డు కన్పించింది. దరిగొత్తి వెళ్ళి హోటలులోపల కలియజూశాడు. అంతా అక్కడ వున్నారు

సత్యాన్ని చూడగానే, "ఏమయిందిరా?" అని ప్రశ్నించారంతా కలిసి సత్యం టేబిలువేపు చూశాడు ఒక్కొక్కడిముందూ రెండేసి గులాబిజాంప్లేట్లూ, ఒక మసాలా దోసె ప్లేటూ కన్పించింది తనూ ఒక కుర్చీలో కూలబడి, "ఏమిట్రా ఇవి?" అన్నాడు

"అబ్బే! ఏంలేదురా. మన రవిగాడికి ఇందాక దిష్టి తగిలిందికదురా. అది పోవడానికీ, తరువాత మనం వాడికి తగిన సలహా ఇవ్వడానికీ. ఏయ్! సర్వర్. ఆయనకూ్కడా ఇవి పట్రా!" అని ఆర్డరిచ్చాడు సూర్యం

రవి ఒక చేతితో చెమ్చాతో గులాబ్‌జాంముక్క పైకెత్తుతూ, రెండోచేత్తో సత్యాన్ని తనవైపుకు తిప్పుకొని "ఏమయిందో చెప్పరా?" అన్నాడు. అని గులాబ్‌జాం ముక్క నోట్లో వేసుకున్నాడు. సత్యం నోరూరింది. రవి దగ్గరున్న రెండోప్లేటు లాక్కుని గబగబా తినేశాడు. కాసిని మంచినీళ్ళు త్రాగి, "ఏంలేదురా. ఆ అమ్మాయి చాలా పెంకిదానిలా కన్పిస్తోంది. జవాబేనా ఇవ్వకుండా వెళ్ళిపోయింది" అన్నాడు

రవి తెల్లబోయాడు మిత్రులంతా చాలా విచారించారు. "సూర్యం! నేను చెప్పలేదురా! అసలా తర హాయే కనిపిస్తోంది ఒట్టి పెంకిఘటం. మహా గర్విష్ఠి మగాడంటే లెక్కేలేదు" అన్నాడు కాఫీ చప్పరిస్తూ.

"మనవాడిమీద మత్తుమందు చల్లేసిందిరా!" అన్నాడు రహమాన్

"మనం ఇలా వూరుకుంటే లాభంలేదు మన వాడు, మనకోసం వెనుదీయకుండా ఎంత డబ్బైనా ఖర్చుపెట్టుతున్న మన మిత్రుడు రవి, ప్రేమలో పడ్డాడు వెంటనే మనం ఆ అమ్మాయి గురించి వివరాలన్నీ కనుక్కొని, మనవాడి మనోవ్యాధి పోగొట్టాలి. సోదరులారా. . . "

"ఒరేయ్! గిరీ, ఇది ప్లాట్‌ఫారమ్‌కాదు కాఫీ హోటలు. కాస్త ఐస్‌క్రీమ్ తిని చల్లబడు. రవీ! మనం వెంటనే రూముకి వెళ్ళి ముందు జరగవలసిన కార్యక్రమం నిర్ణయించాలి రహమాన్! నువ్వు ఎలాగైనా ఆ అమ్మాయి ఫోటో సంపాదించు" అన్నాడు సూర్యం

"ఎలాగరా ?" అన్నాడు రహమాన్ వెర్రి మొఖంవేసి

"స్టూడియోలన్నీ గాలించరా. ఫోటోగ్రాఫర్లంతా నీ స్నేహితులే కదరా!"

"రైట్. అయితే ఇప్పుడేవెళ్ళి, రాత్రి పదిలోపల రూముకి ఫోటో తెస్తాను"

రవి కొంచెం ప్రాణంవచ్చినవాడిలా లేచి, స్నేహితులతో కాఫీ హోటలు బయటకు వచ్చాడు. రవి, సత్యం, సూర్యం, గిరీ, రహమాన్ నలుగురూ ప్రాణ స్నేహితులు విశాఖపట్టణంలో చదువు పూర్తిచేసి ఉద్యోగాలవేటలో కాలం గడుపుతున్న బ్రహ్మచారులు గిరీ, రహమాన్ లా పాసయి అప్రెంటీస్‌లుగా పని చేస్తున్నారు. సత్యం, సూర్యం, ఎమ్. ఎస్‌సీ. పాసయ్యారు. వీరి నలుగురిది విశాఖపట్టణమే. రవి బి. కామ్ మూడోసారి తప్పాడు. అతనిది అనకాపల్లి. వాళ్ళనాన్న పెద్ద వ్యాపారస్తుడు.

ఈ అయిదుగురికి ఎలా కలిసిందో స్నేహం చెప్పలేము కాని, ఒకరంటే ఒకరికి గాఢమైన అభిమానం, ఇరవైనాలుగుగంటలూ రవి రూములోనే వుంటారు రవి తండ్రికి ఒక్కడే కొడుకవటం మూలానా, పెట్లో లక్షలకొద్దీ ధనం మూలుగుతూండడంవల్లా, తెగ ఖర్చుపెట్టేవాడు మిత్రబృందం ఖర్చులన్నీ అతనివే

హోటలు బయటికి రాగానే రవి "ఒరేయ్! సూర్యం. ఇంక లాభంలేదురా! ఎలాగైనా ఆ అమ్మాయి ఎవరో తెలుసుకోనిదే, నాకు తిండి సయించదు. నిద్రపట్టదు. ఏదైనా మార్గం చూడాలిరా" అన్నాడు నీరసంగా

"ముందర రూముకి పదరా. తరవాత ఆలోచిద్దాం" అన్నాడు సూర్యం, తనమీద ఆనుకున్న రవిని ఓదారుస్తూ.

"రూముకుకూడా వెళ్ళబుద్ధవడంలేదురా!"

"అయితే నడిరోడ్డుమీద కూచొని "అమ్మా, నాకా అమ్మాయి కావాలి—ఇ—ఇ—ఈ" అని ఏడు"

"నువ్వే, అలా అంటే ఎలారా?"

"అందుకే ముందర రూముకి దారితీయించు."

"ఒరేయ్! ఆగండి" అన్నాడు గిరి అంతా ఆగారు. "మనం సినిమాకెళ్తే. మన థియేటరులో కొత్త పిక్చరు అదృష్టం కలిసివస్తే. . . ."

"రైట్. నాకు తెలిసిపోయింది నీ అయిడియా. అద్భుతంగావుంది పదండి పిక్చరుకుపోదాం" అన్నాడు సత్యం

రవితోసహా అంతా ఈ సూచనను ఆమోదించారు. వెంటనే సైకిలురిక్షాలలోవెళ్ళి సరస్వతీ థియేటరుతో పడ్డారు. అప్పటికే సినిమా ప్రారంభమయి పావుగంటయింది. చీకటిలో బ్యాటరీలైటువేస్తూ, గేటుకీపరు సీటు చూపిస్తూంటే రిజర్వుడు క్లాసులో అంతా కూచున్నారు

ఉపాధ్యాయుడు:-ఓరేయి గోపీ! కంపస్ బాక్సులోని విభాగిని ఉపయోగ మేమిటిరా?

విద్యార్థి:-మన స్కూలులో బెంచీలకున్న నల్లులను చంపటానికి ఉపయోగిస్తుంది.

ద్వార అరుణచంద్ర కళ (పెద్దాపురం)

రవి కుడివైపున చివరలో ఇద్దరు ఆడవాళ్ళు మెల్లిగా చిత్రంగురించి ఏదో అనుకోడం విని, అటువేపు చీకట్లోనే చూశాడు. ఇద్దరమ్మాయిలు అస్పష్ట రూపురేఖలతో కన్పించారు. తన ఎడంవేపు మిత్రబృందం వున్నారు తన పక్కనున్న అమ్మాయిని ఎక్కడో చూసినట్లు వుంది. ఆమె అవతలివైపు ముఖంతిప్పివుండడంవల్ల సరిగా రవికి కన్పించలేదు.

రవికి సినిమాలంటే విపరీతమైన పిచ్చి. తనొక పెద్ద దర్శకుడిని కావాలనీ, హీరోవేషాలు వెయ్యాలనీ ఆదర్శం పెట్టుకున్నాడు. మిత్రబృందంఅంతా అదే ఆదర్శంతో ఉన్నారు. రహమాన్ కేమరామాన్ కాదల్చుకున్నాడు 'స్క్రిప్టు' గిరి రాయదల్చుకున్నాడు. మ్యూజిక్ సత్యం తీసుకోగల సమర్థుడూ, కృషి కూడా చేస్తున్నాడు. సూర్యం ప్రొడ్యూసరూ, మేకప్‌మాన్, అసిస్టెంట్ డైరక్టరూ వగైరా అన్నీమా. ఇహ మిగిలి యున్న బి యస్. (మిత్రబృందమ్) ప్రొడక్షన్సుకు కేపిటలొక్కటే లోటు. రవి చేతికి ఇనప్పెట్టె తాళంచేతులు రాగానే, అది కూడా తీరిపోతుందని రవి వాళ్ళకు హామీ యిచ్చాడు.

కాబోయే హీరో అయిన రవి, తెరమీద హీరో, హీరోయిన్‌తో పాడుతున్న డ్యూయెట్టు విని "ఓ ప్రియసఖీ!" అనుకొని విచారసాగరంలో మునిగిపోయాడు. రవి బాధ చూడలేక, సినీదేముడు, చీకట్లో ఆకాశమంతా లైట్లు వెలిగింపించాడు. విశ్రాంతి సమయం అయినందున రవి మిత్రబృందంవైపు చూశాడు. మిత్రబృందం రవివైపు చూశారు. వాళ్ళ మొహాల్లో లైట్లు వెలిగాయి. చిన్న కలకలం బయల్దేరింది. ఎందుకో రవికి బోధపడలేదు "రవీ, బెస్ట్ ఆఫ్ లక్!" అని ఒకరూ, "త్రీ చీర్స్ టు రవి!" అని ఇంకొకరూ అంటున్నారు.

సూర్యం, డ్రింకులమ్మే కుర్రాడికి అరడజను కూల్‌డ్రింక్సు తెమ్మని, రవిని "అటువైపు చూడరా" అని మెల్లిగా గిల్లాడు రవి కుడివేపు తిరిగాడు తన ప్రక్కన సాక్షాత్తూ తను సాయంకాలం చూసిన అమ్మాయి—తను ఇంతసేపూ, విరహం, ఏ హీరోయిన్‌కోసం అనుభవించాడో ఆ నాయిక, కూచొని వుంది. రవివేపు ఒకసారిచూసి మొహం తిప్పుకుంది.

రవి హృదయం పొంగిపోయింది ఆనందం ఎక్కువైపోయి నీరసం వచ్చింది ఏంచెయ్యాలో తెలియక సూర్యం వేపు చూశాడు సూర్యం "పలకరించరా" అన్నాడు మెల్లిగా రవి అంతకన్నా మెల్లిగా "ఏమనిరా?" అని అడిగాడు డ్రింక్సు తీసుకొని కుర్రవాడొచ్చాడు సూర్యం మెల్లిగా రవి చెవిలో "డ్రింక్సు తీసుకోమని అడగరా" అన్నాడు.

"ఏమండీ! ప్లీజ్, ఈ డ్రింక్సు తీసుకోండి"

"అరె! వద్దండి అక్కర్లేదు" అంటూ రవివేపు ఒక చక్కనిచూపు విసిరింది నాయిక

"పరవాలేదు తీసుకోండి"

నాయిక, ప్రియసఖివేపు చూసింది. సినీదేముడి దయవల్ల ప్రియసఖికి దాహం వేసింది. "తీసుకో పాపం, ఆయన మనకోసం చాలా శ్రమపడ్డారు" అంది నాయిక డ్రింకు తీసుకుంది. ప్రియసఖి కూడా తీసుకొంది. లైట్లు ఆరిపోయాయి ఆట ప్రారంభమైంది.

(55–వ పేజీ చూడండి)

# కథ కాని కథ

## పెళ్లి కానుక
### (మొదటి బహుమతి రు. 10 లు)

నాను పెళ్ళినాటి సంఘటన ఇది. పెళ్ళి మా వూరిలోనే అవడం వల్ల మిత్రులందరూ హాజరయ్యారు. మంగళసూత్రధారణ ముగిసింది. తరువాత కానుకలు చదివించడం మొదలుపెట్టారు. "చి. వాసుదేవరావుకు నరసింహం చదివించునది ఓ టేబుల్ ఫేన్" అని వినేసరికి మా మిత్రబృందంఅంతా నోళ్ళు వెళ్ళబెట్టేశారు. అవును మరి! ఫాను ఏమో ఎవళ్ళి, తొంభై రూపాయలకు తక్కువ ఉన్నట్టు లేదు. అటువంటప్పుడు ఎప్పుడూ కానీ ఖర్చుపెట్టని నరసింహం అంత డబ్బుపెట్టి ఓ టేబిల్ ఫేన్ ప్రెజంటు చేశాడంటే ఎట్లా నమ్మేది? పేరు పొరబాటున చదివారేమో అంటే అదిలేదు. రామం అడిగినప్పుడు పురోహితులవారు నరసింహాన్ని వేలుపెట్టి చూపించారేమో! నరసింహం మాత్రం చిరునవ్వులు చిందిస్తున్నాడు, మేం వస్తున్నామంటే. రామం మటుకు "అహా! నరసింహంగారికి ఇవ్వాళ ఈ ధారాళ బుద్ధి ఎట్లా కలిగిందోకదా" అని అన్నాడు. అందుకు నరసింహం "ఒరేయ్! మీకు కూడా చాలా బుద్ధి వుంటే మీరు తలా ఓ ఫాను ప్రజంటుచేసేవుందురు" అన్నాడు. దాంతో ఆ ప్రసంగం ముగిసింది.

పెళ్ళయి నెలరోజులు గడిచాయి. ఆరోజు ఆదివారం అవడంవల్ల (ఆఫీసుకు సెలవులెండి) స్నేహితులంతరూ పేకాటకు నాయింట్లో మకాం వేశాం. మధ్యాహ్నం ఒంటిగంటప్పుడు పోస్టుమేను వచ్చి నాకు పేర ఓ కవరిచ్చి వెళ్ళాడు. ఉత్తరం చదువుతుంటే నాడిమొహం ఆశ్చర్యంతోకూడి అదో విధంగా మారుతోంది. "ఇదేమిటి ఓరియంట్ ఫాన్ కంపెనీవాళ్ళు నాకు ఇన్‌స్టాల్‌మెంట్ నోటీస్ పంపిస్తారు" అంటూ ఇంకోసారి అర్థంకాక మళ్ళీ చూసుకొన్నాడు. అందరం ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నాం. ఇంతలో మార్కం పెద్దమిస్సరి విరగొట్టిన టిక్కెట్‌వాళ్ళపెట్టి, "ఒరేయ్ నరసింహం ప్రెజంటు చేసిన ఫాను కూడా ఓరియంట్ కదూ!" అన్నాడు. "అహా!" అన్నాడు రామం వెంటనే. తనే దాన్ని ఆదివారం బాగా పరిశీలించడంవల్ల. "ఇంకేం! ఆ నరసింహంగాడిపనే ఇది. వాడే మొదటి ఇన్‌స్టాల్‌మెంట్ ఇచ్చి, నాను ఆ ప్రతీచ్చి ఫాను చక్కా తీసుకొచ్చివుంటాడు వెధవ" అని వెలా విసిరేసాడు మార్కం అప్పుడుగాని మాకు నరసింహంగారి అనాటి మాటల అర్థం తెలిసిందికాదు. "హా! ఎవళ్ళి రూపాయల ప్రతిష్ఠ, పద్దెనిమిది రూపాయలతో సంపాదించాడుకదా నరసింహం" అని నాపోయాడు రామం.

కె. చంద్రమౌళి (హైదరాబాదు)

* * *

## పంతులుగారి చికాకు
### (రెండవ బహుమతి రు. 5 లు)

ఒకసారి మా నాన్నగారు కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాలని పంతులుగారిని పిలుచుకొని రమ్మన్నారు. నరేసని నేనూ, రమణ (మా తమ్ముడు) కలిసి వెళ్ళాం. మేం వెళ్లేసరికి పంతులుగారు అరుగు కుడిలి పడుకొన్నారు. అది చలికాలం కావడాన్ని ఆయన చలి వెయ్యకుండా ఒక దుప్పటి కప్పుకొని ఉన్నాడు. మేము పోయి ఆయన ప్రక్కనే నిల్చున్నాం. ఇంతలో దుప్పటి కొనజారి కుడితిలో పడింది. ఆయన దానినితీసి భుజంమీద వేసుకొన్నాడు. మళ్ళాజారి అది కుడితిలోనే పడింది. కాస్త చికాకుపడి మళ్ళా భుజంమీదే వేసుకొన్నాడు. మూడవసారి కూడా జారి అది కుడితిలోనే పడింది. కూర్చున్నవాడల్లా అమాంతంలేచి, దుప్పటిని ఉండలాచుట్టి పూర్తిగా కుడితిలో ముంచేసి "మునగవే... ఎంతమునుగుతావో" అన్నాడు కసితీరా. ప్రక్కనేవున్న మేం నవ్వాపుకోలేక... నవ్వితే మమ్మల్ని కూడా కుడితిలో ముంచేస్తాడేమోనని భయపడి, బయటకువచ్చిన తరువాత కడుపు చెక్కలయ్యేలా నవ్వుకొన్నాం.

రమేంద్ర (పాలకొండ)

* * * *

## చౌడయ్య
### (రెండవ బహుమతి రు. 5 లు)

నేను వేసంగి సెలవుల్లో మా అక్కయ్యగారి వూరికి వెళ్లాను. అది ఒక పల్లెటూరు. నాకు రేడియో అంటే మహా పిచ్చి. ఆ వూరిలో ఎలక్ట్రిసిటీ లేదు. కాని ఆ వూరిలో ఉండేదల్లా పంచాయితీబోర్డు రేడియో ఒక్కటే (అది బ్యాటరీదిలెండి). రోజూ రాత్రి భోజనమైన తరువాత ఆ రేడియో వినే వాళ్ళ (మా బావగారే ప్రెసిడెంట్!). వారితోపాటు నా స్నేహితులు, పల్లెప్రజలు కూడ వచ్చి వినే వాళ్ళు. ఒకసారి రేడియోలో చౌడయ్య వయొలిన్ వినవచ్చింది. అందరు చెవులు నిక్కబెట్టుకొని వింటున్నారు. కాని నాకు వాద్యసంగీతమంటే అంత గిట్టేది కాదు. ఒక్కొక్కరి మొహాలు దీక్షగా పరిశీలిస్తున్నా. అప్పుడే వచ్చిన ఒకాయన "ఎవరయ్యా ఇంత బాగా ఫిడేలు వాయిస్తున్నాడు?" అని ప్రశ్నించాడు. అంతసేపు శ్రద్ధగా రేడియో వింటున్న నా మిత్రుడు చిరాకుతో "చౌడయ్యా!" అన్నాడు. ఆ పల్లెమనిషి కాస్త కోపగించుకొని "నిని బదులు చెప్పినవాడివి, నీ కేమిటి చెవుడు?" అని అడిగాడు. వాళ్ల సంభాషణ విన్న వాళ్ళు నవ్వాగింతికాదు. నేను నవ్వింది చూసి నా మిత్రుడు నాతో ప్రతి కలిపాడు.

బి. రామచంద్రరావు (బెంగుళూరు)

* * *

## పాప ఉత్తరం
### (రెండవ బహుమతి రు. 5 లు)

మా చిన్నమ్మాయిని ఫస్టుఫారం పరీక్షలకో కూర్చోపెట్టాలని సెలవల్లో ప్రైవేటు చెప్పించాము. మొదటి రోజున పాప పరీక్షకు వెళ్ళిపోయేముందు ప్రశ్నలన్నీ పూర్తిగా చదివి అర్థంచేసుకొని వ్రాయాలని చెబుతూ, "పాపా! ఈరోజు ఎవరికైనా ఉత్తరము వ్రాయమని అడగచ్చు. బాగా రాసిరా!" అని చెప్పి పరీక్షకు పంపాము. పాప పరీక్షనుండి వచ్చిన తరువాత ప్రశ్నపత్రము చూస్తూ, "ఇదుగో పాపా! యిందులో నీ స్నేహితురాలికి సెలవల్లో నీవేమి చేశావో వ్రాయమని అడిగారు ఎలా వ్రాశావు?" అని అడిగాము. అపుడు మా పాప "నేను ఆ ఉత్తరం వ్రాద్దామనే అనుకున్నానుఅమ్మా. కాని అక్కడి మాస్టారు వూరికినే అటూ యిటూ తిరుగుతాడు కాని, నాకు ఎంతకూ ఉత్తరము వ్రాయటానికి కార్డుగాని, కవరుగాని యివ్వలేదు. నేనే అడుగుదామని అనుకునేటంతలోనే గంట కొట్టేశారు. అందుకు నేనేమి చేయునమ్మా" అంది.

భూపతిరాజు సరస్వతి (గురజాల)



మెదక్ జిల్లాలో పర్యటించిన సందర్భంలో గవర్నర్ శ్రీ భీమసేన్ సచార్
ఏర్పాటైన బహిరంగ సభలో ప్రసంగించారు

మనమూ - మన ప్రపంచం

కౌండిన్య

# నాయకత్రయం సఫార్సులపై రేగిన దుమారం: అమ్మకం పన్ను చట్టం పట్ల వర్తకుల వైఖరి

నాయకత్రయంవారు ఏకగ్రీవంగా జాబితా తయారు చేయడంతో, ఇక ఏవో స్వల్పమైన మార్పులుతప్ప, అభ్యర్థుల నిర్ణయంఅంతా ఖరారై పోయినవని, ఎన్నికల సంఘం లాంచనంగా ఆమోద ముద్రవేయడమే తరువాయి అని అంతా అనుకున్నారు. ఇంకా అనేక రాష్ట్రాలలో అభ్యర్థుల్ని నిర్ణయించే కర్మకాండకు శ్రీకారం చుట్టకముందే ఇక్కడ యావత్తూ సాఫీగా జరిగిపోయిన ఘనత ఆంధ్రకు దక్కిందని హర్షించారు కాని ఎన్నికల సంఘంలోపలా, బయటా రేగిన దుమారంచూస్తే ఇది పొరపాటు అంచనా అని బుజువైంది.

అల్లూరి, బ్రహ్మానందరెడ్డిగారలు ఎంతో కష్టపడి ఏకగ్రీవంగా చేసిన సిఫార్సులపై ఇంత దుమారం ఎందుకు లేచింది అని ప్రశ్నిస్తే సహేతుకమైన సమాధానం దొరకదు బ్రహ్మానందరెడ్డి అల్లూరి ఇచ్చి పుచ్చుకునే ధోరణిలో వ్యవహరించి అర్హులు యోగ్యులు అయిన వారిని కొందరిని ప్రక్కకునెట్టారన్నది ప్రధానమైన విమర్శ రెండువర్గాలకు నాయకులైనవారు అభ్యర్థులను నిర్ణయించాల్సినప్పుడు ఇచ్చిపుచ్చుకునే ధోరణిలో పోకపోతే ఏకగ్రీవత అన్నది ఎట్లాసాధ్యమవుతుంది ఇకయోగ్యత, అర్హత అంటారా ఎంచుకోబడిన అభ్యర్థులూ యోగ్యులే వదలివేయబడిన వారూ యోగ్యులే.అయినా-నేటికాంగ్రెస్‌లోయోగ్యతా యోగ్యతలకు కొలతబద్ద ఎక్కడ. మరో ముఖ్యమైన విమర్శ పరిశీలకుల విచారణలో ఎవరికి ఎక్కువవోట్లు వస్తే వారిని అభ్యర్థులుగా నిర్ణయిస్తామని ఒక ధర్మ సూత్రాన్ని ప్రవచించి, ఆ సూత్రానికి కట్టుబడి ఉండలేదని, కొన్ని సందర్భాలలో వోట్లు తక్కువ వచ్చిన వారిని అభ్యర్థులుగా నిర్ణయించారని. ఇందులో కొంత నిజం లేకపోలేదు కాని ఏసూత్రానికైనా కొన్ని మినహాయింపులుండటం సహజం కనుక, దీనికి కూడా అటువంటి మినహాయింపులు చూపడం జరిగింది అట్లాకాక తు చ. తప్పకుండా ఈ సూత్రాన్ని పాటించి ఉన్నట్లయితే, ముఖ్యమంత్రిసహా అనేకమంది ప్రముఖులకు అభ్యర్థిత్వం లభించేదికాదు అదిగాక ఈ వోట్లపద్ధతిపై కాంగ్రెస్ నాయకులలోనే భిన్నాభిప్రాయం ఉన్నది. కొందరు పంచాయతీ అధ్యక్షుల వోట్లను లెక్కలోకి తీసుకోవాలంటే, మరికొందరు మండల సంఘాలు, జిల్లా సంఘాలుచేసే సిఫార్సులను శిరసావహించాలని వాదించారు. మరికొందరు పరిశీలకులు పక్షపాతంగా వ్యవహరించారని వారి ఓట్లకు విలువ ఇవ్వరాదని విమర్శించారు. ఇటువంటి పరిస్థితులలో పంచాయతీ అధ్యక్షుల, కాంగ్రెస్ సంఘాల అభిప్రాయం భేదించినప్పుడు తమకు యుక్తమనితోచిన నిర్ణయంచేసే అవకాశం అధికారం నాయకత్రయానికి ఉండాలా లేదా. ఇంకో విమర్శ, ఒక నియోజకవర్గంలో దరఖాస్తు చేసిన వ్యక్తికి, మరో నియోజకవర్గం కేటాయించి, ఇష్టంవచ్చినట్లు నియోజకవర్గాలు మార్చారని. ఏ అభ్యర్థికైనా పార్టీ బలమే ప్రధానమైన బలం. అందువల్ల ఇటువంటి మార్పు జరిగినా పెద్దప్రమాదం ఏమీ ఉండదు. పైగా అభిప్రాయవర్గంతోనూ విశ్లేషించేంతవరకూ, అభ్యర్థుల్ని స్వస్థలంలో పోటీకి నిలపరాదని, అట్లా చేసినట్లయితే కుల, మతాభిమానాలతో వోట్లకోసం ప్రచారంచేసే అవకాశం ఉండదని అభిప్రాయపడుతోంది బహుశ ఈ పద్ధతి వచ్చే ఎన్నికలలో అమలులోకి వస్తుందేమో చెప్పలేం. ఇప్పుడే మనం ప్రయోగంచేసి చూస్తే తప్పులేదు.

అయితే నాయకత్రయం సిఫార్సులలో దోషాలేమీలేవంటారా అని అడగవచ్చు లేవని ఎవరూ అనరు. గ్రూపులు మాసిపోయినవంటూనే గ్రూపు మనస్తత్వంతోచేసే నిర్ణయాలెప్పుడూ దోషభూయిష్ఠంగానే ఉంటవి. ప్రదేశ్ సంస్థలో ప్రాంతీయ శాఖలు, మళ్లీ ఆ ప్రాంతీయ శాఖలలో గ్రూపులు ఉన్నప్పుడు ఇంతకన్నా ఉత్తమ నిర్ణయాలు ఆశించి ప్రయోజనంలేదు. అసలు రాష్ట్ర ఎన్నికల సంఘమే గ్రూపు పద్ధతిన ఏర్పాటైన సంఘం. దరఖాస్తులన్నింటినీ, ఆ సంఘమే పరిశీలించిఉన్నా ఇందుకు భిన్నంగా ఉండేదికాదు పైగా తగాదాలు హెచ్చుపెరిగి ఏకగ్రీవతకు అసలు ఆస్కారం ఉండేది కాదు కాబట్టే పళ్ళంరాజు మధ్యవర్తిగా ఈ బాధ్యత నాయకత్రయానికి ఒప్పగింతపెట్టడం జరిగింది. ఈ సమయంలో మళ్ళీ రభసచేసుకుంటే గ్రూపు తగాదాలు పునఃవిజృంభించడం తప్ప ఫలితం మరొకటి ఉండదు.

పోతే ముఖ్యమంత్రి ఆక్షేపణల సంగతేమిటి? ఈయన ఇలా ఆక్షేపిస్తారని ఇన్నిస్థానాలకు

(52-వ పేజీ చూడండి)

# చదువుల్రావు


రైలు ఈ వేళ ఏమైనా లేటుగా వస్తుందేమిటోయ్?
లేదు బాబూ
శెలవులయ్యాకా కాలేజీ తెరిచేవారు కనుక హైద్రాబాద్ బయలుదేరాడు థర్డ్‌క్లాస్ టిక్కెట్టు కొనుక్కొని


♡♡?!!!♡♡
SEE INDIA
అదే సమయానికి ప్లాట్‌ఫారం మీద ఒక అమ్మాయి, ముసలి దంపతులు కూడ రైలు కోసం నిరీక్షిస్తున్నారు


WOW! ఆ అమ్మాయ్ ఎక్కే కంపార్ట్‌మెంట్‌లోకే ఎక్కి, ఆ అమ్మాయి ఎదురుగుండా కూర్చోవాలి...


ఇంతలోకి రైలు వచ్చి ఆగింది ఆ అమ్మాయి ఆ దంపతులు ఫస్ట్‌క్లాస్ పెట్టెలోకి ఎక్కారు


బాబ్బాం, వీళ్ళు ఫస్ట్‌క్లాస్ లోకెక్కేరేమిటి? పోనీ నా దగ్గర కాలేజీ జీతంకి 40 రూపాయిలున్నాయిగా దాంతో ఫస్ట్‌క్లాస్ టికెట్ కొనేస్తా—


టికెట్ కొనుక్కుని, వచ్చి సరిగ్గా, ఆ అమ్మాయి ఎదురుగా కూర్చుంటాడు


ఇంతలోకి రైలు కదలడానికి గంట కొట్టారు.
రైలు కదలడానికి గంట కొట్టారు నువ్వు, ఇంక దిగమ్మా పాపం చాలా సేపు కూర్చున్నావ్


అయితే జాగ్రత్తగా వెళ్ళిరండి తాతయ్యా. వెళ్ళొస్తాను బామ్మా టాటా.
టీ గారం మంచినీళ్ళు మంచినీళ్ళు




# జ ఠ రా శ య ము

నోటిదగ్గర నుండి, మూలస్థానము వరకూ వ్యాపించివున్న జీర్ణకోశము ఒక పెద్దగొట్టము. ఆ గొట్టములో కొన్ని ప్రదేశములు పెద్దవిగానూ మరికొన్ని ప్రదేశములు చిన్నవిగానూ ఉంటవి ఫేరింగ్సు క్రిందనుంచి ఆరంభించిన ఈసొఫెగస్ ట్రాకియాకు వెనుకప్రక్కన క్రిందికి దిగి దయాఫ్రమును చీల్చి దానిక్రింద జఠరాశయములో అంతమవుతుంది ఈసొఫెగస్ ఒక పొడుగైన గొట్టము దాని గతిలో గాని నిర్మితిలో గాని, పరిమాణంలోగాని పెద్దమార్పు లేమీ లేవు అందులో ఆహారం భౌతికంగా గాని, రసాయనికంగా గాని ఏవిధమయిన మార్పులు చెందదు అది నోటిలో ప్రవేశించి ముద్దగా మారిన ఆహారం జఠరాశయంలోకి పోవడానికి ఒక సాధనం మాత్రమే. దాని నిర్మితిని గురించీ ధర్మములను గురించీ దానితో ఏర్పడే వ్యాధులను గురించీ యిదివరకే సమగ్రంగా తెలుసుకున్నము. ఇప్పుడు జీర్ణకోశంలో ప్రధాన భాగమైన జఠరాశయము గురించీ, దాని నిర్మితి, ధర్మములు, అక్కడ ఏర్పడే వ్యాధులూ వీటిని గురించి సమగ్రంగా తెలుసుకుందాము జఠరాశయ వ్యాధులు అతి సాధారణములు జననం నుంచి మరణం వరకు, ప్రతి జీవికీ అత్యవసరమయిన ఆహారం, ముడి స్థితినుండి శరీరానికి పనికివచ్చేటట్టుగా పొందవలసిన భౌతిక, రసాయనిక వికృతులలో ముఖ్యములయిన మార్పులు జఠరాశయంలోనే జరుగుతవి అందుకని ఆ ఉపాంగమును గురించి అతి సమగ్రమయిన పరిజ్ఞానం ప్రతి వ్యక్తికీ అవసరం

జీర్ణకోశం నోటినుండి ఆరంభించినా, జీర్ణక్రమం ముఖ్యంగా జఠరాశయంలోనే ఆరంభిస్తుంది జీర్ణకోశంలో యీ భాగానికి మాత్రమే విశిష్టమైన పేరు పాశ్చాత్య భాషలలోనే లేదు. మనవారు మొత్తం కోశానికి, వారి దృష్టిలో అవసరమయిన రసాదులకూ పేరులు కల్పించుకున్నారు గాని కోశములలో ఉపాంగములనూ ఆ ఉపాంగములలో, సూక్ష్మభాగములనూ అభివర్ణించే పేరులు కల్పించినట్లు కనబడదు. మైక్రోస్కోప్ వచ్చిన తరువాత శవ ఖండనం, శరీరశాస్త్ర పరిశీలనలో ముఖ్య కార్యక్రమం అయిన తరువాత పాశ్చాత్యదేశాల్లో ఆయా శాస్త్రజ్ఞులు ఆయా భాగములకు పేర్లు పెట్టేరు. అవి సముచితము అయినప్పుడు ఆ పేర్లే మిగిలిపోయినవి

కాండమును దయాఫ్రముపైన వక్షభాగంగానూ, క్రింద ఉదరభాగంగానూ విభజిస్తుందని యిదివరకే తెలుసుకున్నాము. ఉదరంలో చాలా అవయవము లున్నవి చాలా కోశములకు సంబంధించిన అంగములు, ఉపాంగములు ఉన్నవి ఇందులో 'గేస్టర్' ( Gaster ) అనే గ్రీకు శబ్దం జఠరాశయమును వర్ణించడానికి నిర్దిష్టమైనది గేస్టర్ అంటే ఉబ్బెత్తుభాగము అని మాత్రమే అర్థము పొట్ట ఉబ్బి ఉంటుంది గనుక మొదట్లో ఆ పేరు వచ్చింది గేస్టర్ నుంచి గేస్ట్రిక్ అనే విశేషణం వచ్చింది. "గేస్ట్రిక్ ట్రబుల్" అని అజీర్ణవ్యాధిని ఉద్దేశిస్తూ చాలామంది వాడడం అలవాటయింది. అందువల్ల ఆ శబ్దోత్పత్తిని గురించి చెప్పడం అవసరమని తోచింది. ఈ 'గేస్టర్' అనే మూల పదానికి అనేక ఉపసర్గలు చేర్పగా ఏర్పడిన వృద్యభివృద్ధులు వైద్య పరిభాషలో వస్తవి. 'ఎపిగేస్ట్రియా, హైపోగేస్ట్రియా, గేస్ట్రిజెనాస్టమీ" యిటువంటివి.

మనవారు జీర్ణక్రమాన్ని ఒక వంటగా వూహించారు. జీర్ణాశయంలో జఠరాగ్ని ఉంటుందనీ, అక్కడ ఆహారం పచనమై మార్పులు చెందుతుందనీ ఆయుర్వేద నిర్మాతలు భావించారు ప్రాచీన సంస్కృత నాడీగ్రంథాలలో, రోగకాండను వర్ణిస్తూ 'జీర్ణాశయము, జఠరాశయము" అని యీ భాగాన్ని వర్ణించారు. ఈ ఉపాంగంలో కండరములు ఎక్కువగా ఉన్నవి ఈసొఫెగస్‌లో లాగానే జఠరాశయం గోడలోనూ పైన సీరస్ పొర, మధ్య కండరముల పొర, లోపల మ్యూకస్ పొర ఉన్నవి. ఈ కండరములవల్ల జఠరాశయం తీసుకున్న ఆహారం పరిమాణాన్నిబట్టీ, తీసుకున్న ఆహారం కొన్ని రసాయనిక వికృతులవల్ల విపరీతంగా వాయువును ఉత్పత్తి చేసినప్పుడూ, మామూలు సైజుకంటె అనేకరెట్లు పెద్దది కాగల శక్తి కలిగిఉంటుంది. కడుపులో ఆహారం, దానిని అంటివున్న డువోడినం అనే పేగు మొదటి భాగంలోకి పోయిన తరువాత, లేక ఏ కారణంచేత నయినా వాంతి, త్రేపు అయిన తరువాత గాలిపోయిన రబ్బరు బుడగలాగా చిన్నదై పోతోంది.

జఠరాశయం ఆకృతి ఎప్పుడూ ఒకలాగే ఉండదు. అందులో ఉన్న ఘన, ద్రవ వాయు పదార్థముల పరిమాణమునుబట్టి శరీర 'సంస్థితి' ని బట్టి (శరీరం నిలబడి ఉన్నప్పుడు, పడుకొని ఉన్నప్పుడు) దాని ఆకారం మారుతుంది. కాని మొత్తంమీద అది ఇంగ్లీషు భాషలో 'J' అనే అక్షరం ఆకారమును పోలిఉంటుంది. ఈ J పైభాగము ఈసొఫెగస్‌తో కలిసి ఉంటుంది. పైన ఉండే దయాఫ్రం నుండి ఇది వ్రేలాడుతున్నందున, శరీర సంస్థితి ( Posture ) ని బట్టి దీని స్థితి అంతగా మారదు. కాని జఠరాశయంలో పైభాగము స్వరూపము తేలికగా మారుతూ ఉంటుంది. ఉచ్ఛ్వాస నిశ్వాసములలో దయాఫ్రం స్వరూపం మారుతూ ఉండాలిగదా అందువల్ల దానిని అంటి ఉన్న జఠరాశయం స్వరూపమూ మారవలసిందే. పరిమితిని దాటి ఆహారం తీసుకున్నప్పుడు కడుపులో విపరీతంగా వాయువు చేరి ఉబ్బినప్పుడూ దయాఫ్రం చలనం నిరాటంకంగా సాగదు అప్పుడు ఆయాసం ఏర్పడుతుంది జఠరాశయం క్రింది




(52-వ పేజీ చూడండి)





AMRUTANJAN
Pain Balm
Amrutanjan Limited





GRIPE WATER






# సాందీపనిపర్వం - 32

మరియు వేదము గాయత్రినిగూర్చి ఇట్లు చెప్పు చున్నది గాయత్రిచతుష్పద.అందులో మొదటిపాదము ఎనిమిది అక్షరములు గలది ఆ ఎనిమిది అక్షరములు వేమి? భూమిరన్తరిక్షం ద్యౌరిత్యష్టావక్షరాణ్యష్టాక్షరగ్ం హవా ఏకం గాయత్ర్యై పదం. 'భూమిః' భూమియు, "అంతరిక్షం" అంతరిక్షము లేక ఆకాశమును 'ద్యౌ'లేక స్వర్గమును—అనగా—"భూమి రంతరిక్షంద్యౌః' అను అక్షరములు గాయత్రియొక్క ఎనిమిది అక్షరములు గల మొదటిపాదము భూమిః అనుపదమునందలి భూ అను అక్షరము మొదలు ద్యౌః అను పదమునందలి దకారయకారములతో ఈ ఎనిమిదియగు అక్షరము లగుచున్నవి. ఈ ఎనిమిది అక్షరములును గాయత్రి ప్రథమ పాదమునందలి ఎనిమిది అక్షరములు మరి ఈ మొదటి పాదమేమి? అది త్రిలోక స్వరూపము. గాయత్రియందలి తొలి మూడు వ్యాహృతులు ఏ లోకములను చెప్పుచున్నవో ఆ మూడు లోకములను ఈ ప్రథమపాదమువలన తెలియబడుచున్నవి ఈ విషయమునే వేదము ఏ తదుహైవా అస్యాఏతత్ — అని చెప్పుచున్నది. ఈ త్రిలోక స్వరూపమే గాయత్రియొక్క ఈ ఎనిమిది అక్షరములుగల ప్రథమ పాదము.

ఇట్లు గాయత్రియొక్క ప్రథమపాదమును ఎవరు తెలిసికొనుచున్నారో వారికి మూడు లోకముల యందును జయించరానిది యనిలేదు వారికి మూడు లోకములయందును జయించతగినది యంతయు లభించుచున్నది. ఆ జయించతగినదానినంతయును వారు జయించుచున్నారు. ఈ విషయమునే వేదము— స యావదేషు త్రిషు లోకేషు తావద్ధ జయతి యోస్యా ఏతదేవం పదం వేద అన్న వాక్యముచేత చెప్పుచున్నది.

మరియు గాయత్రి ద్వితీయ పాదమును గూర్చి వేదమిట్లు చెప్పుచున్నది. ఋచోయ జాగ్ంషి సామానీత్యష్టావక్షరాణ్యష్టాక్షరగ్ం హవా ఏకం గాయత్ర్యై పదంయుతః ఋగ్వేద మంత్రములును, యజూగ్ంషి. యజుర్వేద మంత్రములును, సామాని సామవేదమంత్రములును, ఇతి ఈ వేదత్రయము యొక్క నామాక్షరములైన అష్టౌ ఎనిమిదియైన, అక్షరాణి అక్షరములు లేక వర్ణములు, గాయత్ర్యై గాయత్రియొక్క అష్టాక్షరంహవై ఎనిమిది అక్షరములే గల ఏకం ఒకటియైన పదం రెండవపాదము. అనగా ఈ మంత్రమునందు చెప్పబడిన ఋగ్యజు స్సామరూపమైన వేదత్రయముయొక్క నామాక్షర ములు ఎనినిమిదియు గాయత్రియొక్క ఎనిమిది అక్షరములుగల రెండవ పాదమని అర్థము అననేమి? ఏ తదుహైవ అస్యాః ఏతత్. వేదత్రయమే గాయత్రి యొక్క రెండవ పాదము. దీనినిట్లులుగా తెలిసికొని ఉపాసించువానికి ఋగ్యజుస్సామరూపమైన వేదవిద్య ఎంతటి ఫలసముదాయము కలదో అంతయు అతని చేత, ఆ ఉపాసకునిచేత జయింపబడుచున్నది. అనగా పొందబడుచున్నది. వేదమునందలి — సయావతీయం త్రయీ విద్యా తావద్ధ జయతి యోస్యా ఏతదేవం పదంవేద—అన్న వాక్యము చెప్పుచున్నది.

ప్రాణము, అపానము, వ్యానము అను శబ్దముల యందలి ఎనిమిది వర్ణములును గాయత్రియొక్క ఎనిమిది అక్షరములుగల మూడవపాద మగుచున్నది. ఇందు ప్రాణః అన్న పదమునందలి రెండక్షరములు అపానః అనుపదమునందలి మూడు అక్షరములు, వ్యానం అను శబ్దమునందు గలవి, ఆ న అను మూడు అక్షరములును కలిసి ఎనిమిది అక్షరము లయినవి. ఎనిమిదియగు ఈ అక్షరములు గాయత్రియొక్క ఎనిమిది అక్షరములే గల మూడవపాద మైనవి ఈ విషయమును వేదమిట్లు చెప్పినది "ప్రాణోఽపాన వ్యాన ఇత్యష్టావక్షరాణ్యష్టాక్షరగ్ం హవా ఏకం గాయత్ర్యైపదం అనగా నేమి? ప్రాణము, అపానము, వ్యానము అను మూడు ప్రాణములును గాయత్రి యొక్క మూడవ పాదమని అర్థము దీనినే వేదము—ఏ తదు హైవ అస్యాః—ఏతత్ —అన్నది. దీనిని ఇట్లులు తెలుసుకొని ఉపాసించినవాడు ప్రాణి సమూహము ఎంతయో దానినంతయు జయించు చున్నాడు

ఏ గాయత్రి త్రిచరణమో, ఆ గాయత్రిని ఋషులు త్రిపదా గాయత్రి అనినారు. ఆ గాయత్రిని త్రిమూర్తి స్వరూపిణిగా ఉపాసించినారు. విశ్వామిత్రుడు త్రిపదా గాయత్రినే దర్శించెను. ఋషులు ఈ త్రిపదా గాయత్రిని స్థూల గాయత్రి అనిరి. ఇరువదినాలుగక్షరముల గాయత్రి ఇదియే. దీనిని గూర్చి వేదము చెప్పినది. మరియు వేదము గాయత్రి యొక్క తురీయ పాదమునుగూర్చి గూడ చెప్పినది. ఆతురీయపాదమును ఎనిమిది అక్షరములు కలది. చతుష్పదయయిన గాయత్రిని ఋషులు సూక్ష్మ గాయత్రిఅనిరి. వేదము ఆతురీయపాదమును పరోరజా అనినది. అథాస్యా ఏతదేవ తురీయం దర్శతం పదం పరోరజా య ఏష తపతి. ప్రత్యక్షమగుసూర్య మండలము, పరోరజాయనునట్టి పదము, శ్రేష్ఠమైన రజస్సు గండై ప్రకాశించుచున్నది. అదియే గాయత్రి యొక్క తురీయమైనట్టి దర్శితము అనుపాదము. ఈ మంత్రమున పరోరజా, తురీయం, దర్శితపదం అను శబ్దములు వున్నవి వీని అర్థమేమి? వేదము ఆ శబ్దముల అర్థమును ఇట్లులుగా వివరించుచున్నది. యద్వై చతుర్థం తత్తురీయం చతుర్థం నాలవది యత్ ఏదియో, తత్ అదియే తురీయం తురీయము దర్శతం పద మితి దదృశ ఇవహి. దర్శితం పదం అనునది కనపడుచున్నట్టిదివలెనే యుండు నట్టి ఈ సూర్యమండలాంతర్గత పురుషుడు. ఏష పరోరజా ఇతి ఈ సూర్యమండలాంతర్గత పురుషుడే పరోరజా అనునది మరి ఈ పురుషుడు ఎట్టివాడు? ఈ పురుషుడు సమస్తమైన రజస్సునుగూర్చి మీదు మీదుగా ప్రకాశించుచున్నాడు ప్రత్యక్షముగా కన పడునట్టివానివలెనే వున్నాడు. పూర్ణ్యముగా సమస్త లోకములను ప్రకాశింపజేయుచున్నాడు. ఈ సూర్య మండలాంతర్గత పురుషుడే గాయత్రియొక్క చతుర్థ పాదముగు పరోరజా అనబడుచున్నాడు. ఇట్లులు గాయత్రి చతుర్థ పాదమును తెలిపి ఉపాసించువాడు సూర్యునివలెనే సర్వాధిపత్య లక్షణమైన సంపదతో, కాంతితో ప్రకాశించుచున్నాడు ఈ విషయమును వేదమిట్లు చెప్పుచున్నది "సర్వము హ్యేవైష రజ ఉపర్యుపరి తపతి. ఏవగ్ం హైవ శ్రియా యశసా తపతి యోస్యా ఏతదేవం పదం వేద."

మరియు గాయత్రిని గురించి వేద మిట్లులు చెప్పుచున్నది భూలోక భువర్లోక సువర్లోకములు, ఋగ్యజుస్సామవేదములు, ప్రాణాపాన వ్యానములు, క్రమముగా ఎనిమిది ఎనిమిది అక్షరములు గల గాయత్రి యొక్క ప్రథమ ద్వితీయ తృతీయ పాదములు ఇట్లు మూడు పాదములు గల గాయత్రి పరోరజసి యని చెప్పబడుచున్నదియు, చూడబడు నదివలె నుండునదియు నగు సూర్యమండలాంతర్గత పురుషరూపమైన గాయత్రియొక్క నాలవపాదమం దుంచబడియున్నది ప్రసిద్ధమగు సూర్యమండలాంత ర్గతమైన పురుషరూపమగు గాయత్రి చతుర్థ పాదము సత్యమునం దుంచబడి యున్నది. ఆ సత్యము ప్రసిద్ధమైన నేత్రమై యున్నది ఇది యెట్లు? లోకమునందు ఒక వస్తువును గూర్చి కన్నానని యొకడును, విన్నానని యొకడును చెప్పు చున్నారు. ఈ ఇరువురిలో మనము కనినవానిని, ఆ వస్తువును చూచినవానిని మాత్రమే నమ్ము చున్నాము. కనుక ఈ సత్యము గాయత్రీ చతుర్థ పాద

(53-వ పేజీ చూడండి)





## పూసపాటి కృష్ణంరాజు

ఝూమ్మని వర్షం వస్తున్న శబ్దం వినిపించింది. పాతికేళ్ల సైలావచ్చిన శంకరం పంచరు పడ్డ సైకిలు భుజాన్ని వేసుకొని గబగబ నాలుగడుగులు వేసి ఏటిగట్టున చివ్విచెట్టుకింద నెలవు చేసుకొని నిలుచొన్నాడు.

రాజాగా వచ్చిన వానజల్లు టపటప నాలుగు చినుకులు రాల్చి వెళ్లిపోయింది.

చీకటి కన్నుచించుకొన్నా దారి కానరావటం లేదు ఆకాశం నల్లని మేఘాలతో ముసి పూసుకొంది. జాన్వాకు మీదనుండి నీటిబొట్లు నెత్తి మీద పడుతోన్నాయి. ధణు తెగిరిపోయేలా ఉరిమిన శబ్దానికి శంకరం గుండెలు చేత్తో గట్టిగా అదిమి పట్టుకొన్నాడు.

“నాపాలిట టొంపలా యీ సైకిలొకటి దాపరించింది. గాలున్నంతవరకూ విమానంలా మోసుకొచ్చింది. యిప్పుడు దీన్ని మొయ్యలేక చస్తున్నాను” అనుకొన్నాడు.

దారీ తెన్నూ తెలియని అడవిలో చిక్కుకొన్నాడు. కొన్ని చుట్టుదారి అయితే మట్టుకు రోడ్డు—

కాలిబాట సైకిలు నున్నగా జారుకొంటూ వరు గెత్తవలసిన మార్గం ఒదులుకొన్నాడు. అగచాట్లు పడవలసిన అగత్యం ఉండగా బుద్ధి గడ్డి తినకేం చేస్తుంది ?

ఏటిదిక్కున మెరిసింది.

“నిరళ్టేలేదు ఏరుదాటి వెళ్ళిపోవచ్చు అవతలి గట్టు చేరుకొని ప్రయత్నిస్తే ఏదేనా వూరు కనిపించదా ! కనీసం పశువులపాక దొరికినా తల దాచుకోవచ్చునే ! ఉప్పెన నుండి బయటపడితే తరువాత చూసుకొందాం ఇక్కడ నిలుచుంటే ఏం లాభం !” అని శంకరం సైకిలు యీడ్చుకొంటూ ఏటిగట్టు దిగేడు.

సైకిలు బరువుకి కాళ్ళు యిసుకలో కూరుకుపోతున్నాయి ఉరుములు, మెరుపులు, గంభీరంగా అల్లుకొన్న పొదలు, చెట్లు, అలసిన శంకరం ప్రాణానికి భయాన్ని ముడివేస్తున్నాయి

కట్టుకొన్న భార్య కాళ్ళా వేళ్ళా పడి బతిమాలింది పిల్లనిచ్చిన మామ ఒక్కరోజు ఉండి వెళ్లమన్నాడు ఎలా ఉంటాడు ! తను వెళదా మనుకొన్నాడు—వెళదా మనుకొన్నప్పుడు ఉండమనడానికి వాళ్లకేం హక్కుంది ?

“ముసలాయన అంత మరీ నీచంగా గడ్డం పట్టుకొని ఆగమంటాడేం! నేను వెళతానంటే సరే వెళ్లిరా నాయనా ! అనవలసింది పోయి ఏమిటా అపశకునం ! పచ్చి ‘బ్రూట్స్’—వీళ్ల ఉసురే తగిలింది లేకపోతే యీ ఉపద్రవం ఏమిటి ? దారి తప్పిపోవటం ఏమిటి ? దీన్ని మోసుకొని ఎక్కడికి తగులణ్ణు ? ఉరుములకు పొద్దూ పద్దూ లేదు పిడుగులు పడి ఎందరు చావలేదు ఎన్ని కథలు వినలేదు కొంపదీసి ఒక పిడుగు నామీద పడితే ' మసే ! ఒక్క షాక్‌తో మాడి బొగ్గయిపోతాను'! శంకరం ఒళ్ళు జలదరించింది.

ప్రాణాలను అరచేతిలో పెట్టుకొని పరుగు వడకగా ఆ చీకట్లో దారికోసం తడుముకొంటూ ఒక ఫర్లాంగు దూరం వెళ్లాడు.

ఈసారి పెద్ద జల్లే వచ్చింది. వూపిరి తీసుకోనివ్వకుండా నాలుగు దెసలనుండీ వర్షం దిమ్మదిరగా బాత్తోంది బట్టలన్నీ తడిసిపోయి నీరు గారుతోన్నా ఖాతరు చెయ్యడంలేదు ఒకవంక చలి రెండోవంక భయం. రెండూ కలసి శంకరం గుండెల్ని దొలిచేస్తున్నాయి.

ఆకాశంలో జిగేలున మెరుపు మెరిసింది శంకరం కళ్ళు గట్టిగా మూసుకొన్నాడు—మేఘాల గర్జన తప్ప ఎక్కడా పిడుగు పడినట్టు లేదు. కళ్లు విప్పి చూసేడు జల్లు కాస్త తెరపిచ్చింది. ఎదురుగ్గా చిన్న గుడ్డిదీపం కంటికానింది.

చెట్ల మధ్యనుండి మసక మసకగా కనిపిస్తోంది అంత స్పష్టంగా లేకపోయినా శంకరానికి ఆ దివ్వె వైకుంఠమై తోచింది వెల్తూరు వస్తోన్న దిక్కుగా గాలి వలిపిరిలో యీడుకొంటూ అవస్థ పడుతూ వెళ్లాడు. కొంతదూరం వెళ్లింతరువాత ఆ దీపం విడిపోతూ రెండు మూడు దీపాల్లా కనిపించింది. ఆరిపోయి మళ్లా వెలిగింది. శంకరం నిలుచొని నిదానంగా పరిశీలించేడు. అనుమానంగానే ఉంది అయినా ధైర్యం చిక్కబట్టుకొని ముందుకే వెళ్లాడు. వెళుతోన్నకొద్దీ దీపం అత నను కొన్నట్టూ మరీ చిన్నదైపోలేదు. కాస్త కాస్తంత పెరిగి పెద్దదైన ఎలక్ట్రిక్‌లైటు కాంతి కిరణాలను విరజిమ్ముతూ కనిపించింది

ఈ అడవిలో కూడా ప్రభుత్వం విద్యుత్తు నన్నయి చేసినందుకు కాస్త గర్వపడ్డాడు గేటు దగ్గరకు చేరుకొన్నాడు అడపాదడపా ఆకాశం మెరుస్తోన్నా, వానజల్లు కొట్టడంలేదు. గేటుదాటి ఆవరణలో ప్రవేశించడంతోనే మనసు కుదుటపడింది నవీన పద్ధతిలో కట్టుకొన్న బంగళా, బంగళా చుట్టూ మూడడుగులు ఎత్తున ప్రహరి గోడ, ఆవరణలో చక్కని పూలమొక్కలు, పోర్టికోకి ఆనుకొని ఒకవంక మాలతీ లత — రెండోవంక నైట్ క్వీన్. రెండూ విరబూసినట్టున్నాయి. గుమ్మని పరిమళాలు విరజిమ్ముతూ, శంకరాన్ని ఆహ్వానిస్తున్నాయి సైకిలు పోర్టికో స్తంభానికి ఆనించి తడచిన బట్టలు పిండుకొంటూ వరండావైపు వెళ్లాడు గుమ్మానికి కట్టిన అందమైన లతలతో కూడుకొన్న సిల్కు కర్టెన్ గాలికి విలవిల్లాడుతోంది అక్కడ సన్నని ట్యూబులైటు వెన్నెలలా కాంతిని వెదజల్లుతోంది లేత గులాబీరంగు ఫ్రాక్ తొడుక్కొని గులాబీలూ, మల్లెలు, నింపుకొన్న చిన్న పూలసజ్జతో చిరునవ్వు నవ్వుతూ ఆరేడేళ్ల పాప వరండాలో తనను పిలుస్తోన్నట్టుగా కనిపించింది.

“పాపా” అని పిలిచేడు శంకరం.

పాప పలుకలేదు, నవ్వడం తప్ప నవ్వుతోన్నప్పుడు పలువరుస ముత్యాల్లా వెలుగుతోంది బుగ్గలు టమోటా పండులా సొట్టలు పడి ముద్దొస్తున్నాయి.

“పాపా—మీ నాన్నగారు లేరూ ?” పాప ముసి ముసి నవ్వులు నవ్వుకొంటూ గుమ్మానికి ఉండే సిల్కు కర్టెన్‌లో నుండి గదిలోకి అదృశ్యం అయిపోయింది

“వెళ్లి వాళ్ల నాన్నను పిలుచుకొస్తుంది చిన్నపిల్ల సిగ్గుపడుతోంది” అనుకొన్నాడు శంకరం.

“ఇలాంటి ప్రదేశంలో ఇల్లు కట్టుకొని ఏకాంతంగా ఉంటూ వీళ్ళు కుక్కను పెంచుకోకపోవడం ఆశ్చర్యంగా ఉంది ఈవాళ కాస్త తనను తలదాచుకోనిస్తే వీళ్ళకు ఎక్కడైనా సంపాదించి మంచి డాగ్‌ని ప్రజంటు చేయాలి. బెంగుళూరు నుంచి ఆల్సేషియన్ని ప్రకాశరావు పంపిస్తానన్నాడు. ఇంటికి వెళ్లగానే ఉత్తరం రాసి రప్పించాలి ....

పాప చెప్పినట్టు లేదు . . ఎవరూ మాట్లాడుతోన్న అలికిడి వినిపించడంలేదు వీళ్లెంత ప్రశాంతంగా ఉన్నారు ! ....

పాప చెప్పడం మరిచిపోయిందా ? ... చిన్నపిల్లకు మాటలు రావేమో ? లేక వాళ్ల నాన్న యింట్లో లేరా అడవాళ్లు భయపడుతోన్నారా ? ఛ—ఛ—యింత ధైర్యంగా తలుపులన్నీ తెరచుకొని కూర్చునేవాళ్లకు భయమేమిటి ? రైంమని వీస్తోన్న గాలికి తడచిన బట్టలు మంచు ముక్కలా ఒంటిని కరచేస్తున్నాయి సిల్కు కర్టెన్ వద్దకు వెళ్లి లోనకు తొంగిచూసేడు. అందమైన ఫర్నిచర్‌తో డ్రాయింగ్‌రూము ఫేషనబుల్‌గా అమర్చబడి కన్నుల కింపుగా ఉంది. సోఫాలో ఒకాయన కళ్లజోడు పెట్టుకొని పుస్తకం చదువుకొంటున్నాడు. జుత్తు నెరసిపోయి తెల్లగా పట్టులా ఉంది. శంకరం నిశ్శబ్దాన్ని భరించలేకపోయాడు. చలికి ఒణుకుతోన్న గొంతుకతో,

“ఏమండీ !” అని మెల్లిగా పిలిచేడు. జవాబు లేదు. కొంచం రెట్టించిన గొంతుకతో,

“ఏమండీ !”

ఆయన చదువుతోన్న పుస్తకంలో నుండి తలెత్తి శంకరంవైపు చూసేరు పుస్తకం ముడిచి కళ్లజోడు చేత్తో పట్టుకొని శంకరం వద్దకు వచ్చి,

“ఎవరు కావాలి ?” శంకరానికి జవాబు తోచలేదు గుడ్లప్పగించి ఆయనవైపు చూసేడు

“అయ్యో తడిచిపోయినట్టున్నారే ! రండి, రండి’ అని తన జవాబుకోసం ఎదురు చూడకుండానే గబగబా ప్రక్క గదిలోకి వెళ్లి యిస్త్రీ చేసిన పంచ, తువ్వాలు తీసుకొచ్చారు

“ముందా తువ్వాలుతో శుభ్రంగా ఒళ్ళు తుడుచుకొని ఆ పొడిపంచ లుంగీ వేసుకోండి లేక లేకపోతే జలుబు చేస్తుంది” అని శంకరం బుజం తడుతూ చేతిలో పెట్టేరు

శంకరం అనుమానించలేదు వెంటనే వరండాలోకి వెళ్లి, తువ్వాలుతో చక్కగా తలంతా తుడుచుకొని పంచ లుంగీ పోసుకుని, తడిబట్టలు పిండి, మాలతీ లత చెంతను వేలాడుతోన్న దండెం మీద ఆరబెట్టుకొని తిరిగి గదిలో అడుగు పెట్టేసరికి ముసలాయన వంకీకి తగిలించిన స్లేక్ షర్టుతో సిద్ధంగా నిలుచొని తనకోసం ఎదురు చూస్తున్నారు.

“అబ్బే అక్కర్లేదండీ ! ఎందుకూ ... ” అని శంకరం మొగమాట పడ్డాడు

“తొడుక్కోండిసార్ ! లేకపోతే చలితో చస్తారు” అని చనువుగా స్లేక్‌షర్టు తీసి మీదకు విసిరేడు. శంకరం సిగ్గుతో తల వంచకొని తొడుక్కున్నాడు తనకోసం ప్రత్యేకం ఆర్డరిచ్చి కుట్టించినట్టు సరిగ్గా సరిపోయి లైటుగా ఒంటిని పట్టి కాస్త వెచ్చదనాన్నిచ్చింది

“దారి తప్పిపోయాను పైగా సైకిలు పంచరైపోయింది. గాలివానలా యీ ఉప్పెన మీరు దేవుళ్లా నన్ను రక్షించారు తిరిగి వెళ్లిపోదా మనుకున్నాను అమ్మాయి వరండాలో కనిపించింది .... పాప బలే తమాషా చేసింది. అట్టే కనిపించి అలా తుర్రుమని తుర్రుపిట్టలా ఉడాయించింది. మీ చిన్నమ్మాయా ?”

“మా చిన్నమ్మాయిని మీ రెప్పుడు చూసేరు ! అసలదీ వేళప్పుడు వరండాలో నిలుచోదే ! అదిగో ! అమ్మాయ్ ! అద్దం, దువ్వెనా తీసుకొచ్చానా ?” అన్నాడు

శంకరం వెనుకపక్క గది తెర తొలగించుకొంటూ ఒక చక్కని, పదహారేళ్ల పడుచు కళ్ళు మెరిసిపోయేలా జిగేల్‌మంటూ అద్దం దువ్వెన తీసుకొచ్చి శంకరానికి ఎదురుగ్గా నిలుచొంది. ఆ లావణ్యం, ముట్టుకొంటే పాలు గారిపోయే ఆమె బుగ్గలు, విశాలమైన కళ్ళూ, నాజూకైన

(45-వ పేజీ చూడండి)





## సంస్కారం - సహృదయం

లలితాదత్తుగారివ్యాసం చదువుతుంటే మా యింట్లో గురించి వ్రాసినట్లే ఉంది మా అక్కయ్య బి. ఎ పాసైంది కాని అంత చదువు చదివిందా అనిపిస్తుంది చాల నిరాడంబరంగా ఉంటుంది నేతచీరెలు కడుతుంది తెలిసినా తెలియకపోయినా ఎవరన్నావస్తేమాత్రం వాళ్ళతో మాట్లాడుతుంది ఆమె అలా మాట్లాడుతుంటే ఈమే బి ఎ పాసైందా అనుకొంటారు ఇక నా సంగతి నేను మెట్రిక్ చదివాను. నేను ఎక్కువగా మాట్లాడను నా తత్వంవేరు. మా అక్కయ్యకన్నా నేనే కొంచెం టిప్‌టాప్‌గా ఉంటాను ఇద్దరికీ చాల వ్యత్యాసం

లలితాదత్తుగారు మద్రాస్ పెళ్ళివారిగురించి వ్రాసింది కూడ చాల బాగుంది అలాంటివారు చాలమంది ఉంటారు వాళ్ళకి వాళ్ళ గొప్పతనాన్ని చాటుకోవటంతప్పితే ఇంకేమీపనిలేదు మా చుట్టాలింట్లో వివాహమయింది పెళ్ళికొడుకువాళ్ళు హైద్రాబాద్ నుండి వచ్చారు పెళ్ళికూతురివాళ్ళు విడిదికి ప్రక్కనే ఒక మేడ చూపారు లగ్నానికిముందు భోజనాలవటంవల్ల పెళ్ళివారిని తీసుకురావటానికి మనిషిని పంపించారు ప్రక్క మేడగదా అని వీళ్లు కారుపంపలేదు కారు తీసుకొస్తేగాని మేము రామని పెళ్లివారు భీష్మించుకు కూర్చున్నారు పాపం వీళ్లంచేస్తారు హడావిడిగా ఒక కారు తెప్పించి వాళ్ళకి పంపారు అప్పుడు వాళ్ళు మేడదిగి కారెక్కి వచ్చారు ఇలాంటి పట్టింపులతో పెళ్లిళ్లల్లో నానా రభసాచేసి అందరిచేతా మాట లనిపించుకొంటారు

మెండు పార్వతి (విజయవాడ)

* * *

లలితాదత్తుగారు వ్రాసిన వ్యాసంలో వారి అనుభవాలనే వ్రాశారా? అని అనుమానంగావుంది అంతా చదివాక అవన్నీ విషయ సమీకరణకోసం కల్పించి వ్రాసినవేగాని, యధార్థమైన సంఘటనలు కావని అనుమానం కలుగుతోంది నా విమర్శన కాదుగాని, ఆ పెళ్లివారు గ్లాసులకోసం పేచీపెట్టటం, ఆ గ్లాసులను ఆవిధంగా పొడి పొడిచేయటంముఖ్యంగా నమ్మతగని విషయాలు దానివలన ఏ ఉపయోగం, ఎవరికీ లేదని తెలిసిన ప్రస్తుత కాలంలో ఆవిధంగా చేయరని నా అనుమానం సామాన్యంగా పెండ్లిళ్లలో జరిగే ఇలాంటి గొడవలకు ఇరుపక్షాలవారు బాధ్యులయిఉంటారు. ఏ ఒక్కరు ఓర్పు, సహనాన్ని చూపించినా గొడవలు జరుగవు

కొప్పు ప్రభావతి (ఖమ్మం)

లలితాదత్తుగారు వ్రాసిన వ్యాసం ప్రతివారిని ఆకర్షించేలా ఉన్నది కాని రచయిత్రిగారు ఒకచోట పప్పులో అడుగువేసినంత పనిచేశారు కళాశాలకు వెళ్ళేవారు పూర్వ స్నేహితులతో బంధువులతో మాట్లాడరని సందేహించకుండా వ్రాశాసేరు సభ్యతా సంస్కారంగూర్చి ఇంత క్లుప్తంగా వ్రాసి మాబోటివారిని ఆనందపరవశుల చేసిన రచయిత్రిగారికి నా కృతజ్ఞతాభివందనములు

సుజాతాదేవి (ముల్కనూరు)

* * *

కొండముది లలితాదత్తుగారివ్యాసం నా కెంతో నచ్చినది ఈ రోజుల్లో చాలామంది చదువులు రాకపోయినా ఫాషన్లు నేర్చుకుని డిగ్రీలు తీసుకున్నట్లుగా వాళ్ళకు వాళ్లే భావించుకుంటున్నారు మొన్నీమధ్య మా స్నేహితురాలు నన్ను చూడటానికి వచ్చింది ఎండలోవచ్చిందికదాఅని లైమ్‌జ్యూస్ చేసిచ్చాను 'ఇలా ఉందేమిటి' అని గ్లాసు జ్యూస్ క్రిందపారపోసింది. నాకు చాలా కోపం వచ్చింది చదువురాకపోయినా ఇట్లాంటివన్నీ నేర్చుకుంటారు ఆమెగారు జ్యూస్ పారపోయటంవల్ల మా యిల్లు అసహ్యంగా తయారయింది తనకిష్టంలేకపోతే వద్దంటే సరిపోతుందిగా ఆమెకు తగినశాస్తి చేశానులెండి ఈ వ్యాసం చదివినతర్వాతనయినా ఇటువంటివారు "సంస్కారము"అంటే ఏమిటో తెల్సుకొని బాగుపడుతారనుకుంటాను.

కె. అమృతవల్లి (చీరాల)

* * *

నేటి సమాజంలో మనకు ప్రతిదినం గోచరించే విషయాల్ని లలితాదత్తుగారు విపులీకరించి చూపారు. 'సహృదయం' మాట అటుంచి "సంస్కారులం" అంటూ తిరుగుతున్నవారి 'సభ్యత' చూస్తుంటే ఒక్కొసారి నవ్వుతోబాటు బాధ కూడా కలుగుతుంది. లలితాదత్తుగారు వ్రాసిన మెట్రిక్ పరీక్షకు మూడు మార్కు హాజరైన అమ్మాయి విషయం నాకంత ఆశ్చర్యాన్ని తెప్పించలేకపోయింది ఎందుకంటే నాకు తెలిసినావిడ ఒకామెకు ఒక అక్షరంముక్క రాకపోయినా "నేను ఒక ఉద్యోగస్తుని భార్యను" అనే గర్వం శృతిమించడంవల్ల ఆమె ప్రవర్తనలోని "డంబం,దర్పం"చివరకు అసభ్యంగా మారిపోయాయి

ఇకపోతే ఆవిడ భర్తగారు (తన భార్యకు చదువు రానందువల్లనేమో) విద్యావతులయిన గృహిణులను చూస్తే ఒక విధమైన వ్యంగ్యంభావంవచ్చేట్లు మాట్లాడేవారు. అతని మాటలవల్ల ఇతర కుటుంబాలు బాధపడతాయనే విచక్షణాజ్ఞానం లేదా 'కుసంస్కారి'కి. ఇల్లాలి 'సభ్యత' శృతిమించితే, యజమాని "సంస్కారం" పరాకాష్ఠ నందుకున్నట్టుండికదూ ? కాని ఏం చేస్తాం? వారికి ఇలాంటివారు వ్రాసిన వ్యాసాలు చదివి తమను తాము సరిదిద్దుకోగల ఉత్సాహము అవకాశము లేనందుకు మనం చాలా విచారించాల్సిన విషయం

లక్ష్మీరామకృష్ణ (తనకల్లు)

* * *

వ్యాసంపోకడ చక్కగాలేదు సంస్కారం, సహృదయం అంటే ఏమిటో విపులంగా వివరించి, ఉదాహరణ లిచ్చినట్లయితే చాల బాగుండేది. రచయిత్రి చెప్పదలచిన విషయం (సారాంశం) హృదయానికి హత్తుకొనేలావుంది. సభ్యత, సంస్కారం, శ్రమపడి నేర్చుకొంటే వచ్చేవి కాని సహృదయం జన్మతః రావలసిందే! ఇది చాలవరకు యధార్థమే. పురుషులలోకంటే స్త్రీలలో సహృదయత తక్కువగా కన్పిస్తుంది కారణం బహుశా కృత్రిమ సంస్కారం, అజ్ఞానం కావచ్చు సహృదయత లేనివారు వాసనలేని పూవుతో సమానమే

కె అంజిరెడ్డి (కొత్తరెడ్డిపాలెం)

* * *

## నా గ ర కు లు

శ్రీమతి రాధారాఘవ్ వ్రాసిన "నాగరికులు" వ్యాసము నన్నెంతో ఆకర్షించింది ఆమె వెలిబుచ్చిన అభిప్రాయములతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను నాగరికత అనేది విద్యతోను, ధనంతోనూ, కాకుండా వ్యక్తియొక్క సంస్కారంమీద చాలవరకు ఆధారపడివుంటుందని నా నమ్మకం. మాకో స్నేహితురాలుంది ఆమె కూడా క్రమం తప్పకుండా అన్ని పేపర్లు చదివి తీరుతుంది "నాగరికులు"లో వ్రాసిన విమర్శ చాలవరకు సూటిగా ఆమెకు వర్తిస్తుంది ఈ వారం పత్రిక చదివారా అని అడిగా. ఆ—చాల బాగుంది "ప్రేమ సితారా" కథ అన్నిటికంటె బాగుందిసుమా అంటుందేగాని,అసలు విషయం ఏమీ బయటపెట్టదు చదివినంతమాత్రాన ఏమీ మేలు చేకూరదని కోపంతోగాక, నిదానంగా ఆలోచించి, విమర్శించుకొని, లోటుపాట్లు సరిచేసికొని నిజమైన నాగరికులుగా మసలుతారని ఆశిద్దాం. సంఘంలోని ఒకరకమైన దురలవాటును వెలుగులోనికి తీసికొనివచ్చి సహేతుకంగా విమర్శించిన శ్రీమతి రాధారాఘవ్‌గారికి నా ధన్యవాదాలు

వి. నాగమణి (ఏలూరు)

* * *

నలుగురిలోను తమ నాగరికతనుచాటుకోవాలని చూసేవారి తాపత్రయానికి జాలివేస్తుంది. నాగరికత అన్నది ఒక్క వేష భాషల్లోనేకాదు, వాళ్లచేసే పనుల లోను, మాట్లాడే తీరులోను, ప్రవర్తనలోనూ కూడా చూపించాలి. అంతేకాని వాళ్ళు ధరించిన దుస్తులలో కాదు అయినవాళ్ళతో మాట్లాడటం కూడా నాగరికతకుభంగమని అనుకొంటే అది తనని తాను మోసం చేసుకొన్నట్లే.

విశాల (కాగజునగర్)

* * *

కొందరు స్త్రీలు పైకి నాగరికంగా తయారావుతారు కాని ఇంటిలోమాత్రం అధ్వాన్నంగాఉంటారు. భోజనం చేయగానే కంచంలో చేయికడిగేవారు,

క్రాంక్రడించి వుమ్మేసేవారు అంతటా వుంటారను కుంటాను.

పి శాంతాబాయి (భువనగిరి)

* * *

రచయిత్రిగా రుదహరించినటువంటి నాగరికు' లుండడము చాల అరుదు

పొదిలి శ్రీవల్లి, ఆదిలక్ష్మి, (జమ్ము—కాశ్మీర్)

* * *

కొందరు శుచి, శుభ్రముగలవాళ్లమనిఅంటారు వారుచేసేపనులుచూస్తే అసహ్యమేస్తుంది ఈ వ్యాసం చదివాక అటువంటివారు తాము చేసిన పనులు తెలుసుకొనెదరని ఆశిస్తున్నాను

కుమారి (మల్లవరం)

* * *

శ్రీమతి రాధారాఘవ్‌గారివ్యాసం సాకల్యంగా చదివాను చాల బాగా వ్రాశారు చదువుకున్నది—అహంకారం పెచ్చుపెరగటానికికాదు—సంస్కృతి అభివృద్ధి పొందటానికి అనే విషయాన్ని విశదీకరించివ్రాశారు

నాగరికత అనే పదానికి అర్థం యధార్థంగా చిత్రీకరించారు. రచయిత్రికి నా ధన్యవాదములు.

ఎం కనకదుర్గ (బూరుగుపల్లి)

* * *

శ్రీమతి రాధారాఘవ్‌గారివ్యాసం చదివాను చదువుకున్నంతమాత్రాన విద్యావంతులందరికీ సభ్యత, సంస్కారం అలవడతాయని అనుకోవడం మనల్ని మనం వంచించుకోవడమే అవుతుంది. చదువుకున్నవారందర్నీ నాగరికులని అనలేము ఈ విషయంలో రాధారాఘవ్‌గారితో నేను ఏకీభవిస్తున్నాను

పామిరెడ్డి వెంకమ్మ (కర్నూలు)

* * *

శ్రీమతి రాధారాఘవ్‌గారివ్యాసం చాలా బాగుంది. నిత్యజీవితంలో తరుచూ తటస్థపడే సంఘటనలతో అతి నేర్పుగానూ, వోర్పుగానూ వ్యాసంరూపంలో వనితాలోకానికి అందించిన రచయిత్రి అభినందనీయులు.

నేను చదువుకొనేటప్పుడు మా కాలేజీలో ఒక లెక్చరర్ వుండేది ఆవిడ వేషంలో ఎంతో ఆడంబరంగానూ, నడకలో హుందాగానూవుండి ఆకర్షించేది కాని ఆమె ప్రవర్తన భిన్నంగా వుండేది మాటలు వెకిలిగానూ, పెడరసంగానూ వుండేవి. చేసేపనులన్నీ సభ్యతారహితంగానూ, అసహ్యంగానూ వుండేవి. పైపెచ్చు "నాకంటే ఫేషన్‌బుల్ లేడీ మరి లేద"నీ "నాగరికతకు మారుపేరు నేనే" అనీ ఎప్పుడూ ఏదోవిధంగా అందరివద్దా సొంత డబ్బా వాయించుకునేది ఆమెకంటబడితే, ఎక్కడ మాటలతోనూ చేతలతోనూ మమ్మల్ని బాధపెడుతుందోనని విద్యార్థినులంతా తప్పుకుని తిరిగేవాళ్ళం ఆమె పీరియడ్‌లో ముళ్లమీద కూర్చున్నట్టు కూర్చుని, ఆమె వెళ్లిపోగానే సముద్రపు చల్లని గాలులు అనుభవిస్తూ బీచ్‌లో కూర్చున్నట్టు ఫీలయేవాళ్ళం ఎదురుగా ఏమీ అనలేకపోయినా చాటుగా మిగతా లెక్చరర్స్‌తోసహా అంతాతిట్టేవా రామెను

ఈ వ్యాసం చదివాక మరుపురాని సినిమా వాంప్‌లా ఆమె ఒక్కసారి నా బుర్రలో తళుక్కుమంది.

వెంటనే కార్డుమీద "టింగురంగా" అని ఎక్కించూచుంది

సీతామణి (ఖుర్దారోడ్)

* * *

ఇప్పుడు చాలామంది నాగరికంగా అలంకరించుకుంటారుకాని వారి మాటలు కూడా ఆ నాగరికతకి తగ్గట్టుగాఉంటే బాగుంటుంది! రచయిత్రి రాధారాఘవ్‌గారు బాగా వ్రాశారు వారికి నా అభివందనములు

నంగులూరి సూర్యదమయంతి (ఏలూరు)

* * *

శ్రీమతి రాధారాఘవ్‌గారు వ్రాసిన వ్యాసము చదివాను నా తోటిమిత్రులకు కూడా చూపించాను వ్యాసము చాలా బాగుంది ఈ వ్యాసము చదివాక ఇటువంటి అనాగరికులకు బుద్ధివస్తుందనుకొంటాను

వి. ప్రమీల (వెందోడు)

* * *

నాగరికతగాని, నడవడిక, వినయ విధేయతలుగాని విద్యవల్ల అబ్బవు మనిషి పెరిగిన పరిసరాలు, పొందిన శిక్షణబట్టి అబ్బుతాయేగాని డిగ్రీలవల్లగాని, విదేశాలు తిరిగిరావటంవల్లగాని అబ్బవు నేడు విద్య నభ్యసించడం కేవలం ఫాషన్ అయిపోయింది. దాటివల్ల నాగరికత నడవడిక యేం అబ్బటంలేదు వేషాలనుబట్టి మనిషి నాగరికుడని అనుకోవడం తెల్లని వన్నీ పాలనుకున్నట్టే.

టి. సరోజ, ఎస్ నాగలక్ష్మి (అనంతపురం)

* * *

నాగరికతఅంటే ఏమిటో తెలియని మన నాగరికులకు యీ వ్యాసము బాగా బుద్ధిచెప్పును ఉదాహరణగా యిచ్చిన కొన్ని విషయములు మమ్మును కడుపుబ్బ నవ్వించాయి అటువంటివారు చాలమందిని నేను చూశాను వారి కీ వ్యాసము బాగా బుద్ధిచెప్పును.

జోయల్ విజయరాజు (గిద్దలూరు)

★

ఎప్పుడూ ఇంతే - **104** శంకర్



# అమూల్య



## యద్దనపూడి సులోచనారాణి

(గతసంచికతరువాయి)

తననికాదని అసలు యిలా చేసుకుంటుందో, కోపంతో—అవమానంతో నరనరం కాలిపోతున్న శేఖరం అమూల్యమీద ప్రతీకారం తీర్చుకోవటానికి ప్రసాద్‌తో పెళ్ళి విఫలం కావటానికి ప్రయత్నాలు చెయ్యసాగాడు. దాదాపు ఒకనెల పోయింతర్వాత అనుకోకుండా అమూల్యదగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. అందులో తనమానాన తనని పోనివ్వమని, ఒకవేళ తిరిగివచ్చినా తనతో శేఖరం సుఖపడలేడని—కనీసం యిలా మంచిగా విడిపోనైనా విడిపోతే మళ్లీ యెప్పుడన్నా కలుసుకున్నప్పుడు స్నేహితులుగా పలకరించుకోవచ్చని రాసింది. దానికి శేఖరం జవాబు రాయలేదు. జవాబు రాయలేదని అమూల్య వూరుకోలేదు. వెంటవెంట అతనికి ఉత్తరాలు రాయటం మొదలు పెట్టింది. వాటిల్లో జీవితంపట్ల తనకున్న అభిలాష, కోర్కెలు, అన్నీ వివరిస్తూ శేఖరంలో తనకు కావలసిన వాటిల్లో యేంవున్నాయో, యేంలేవో వివరిస్తూ రాసేది. ఉత్తరాలు చాలా సహజంగా—వ్యాయంగా ప్లెయిన్‌గా వుండేవి. వాటిల్లో వేటినీ శేఖరం కాదనలేకపోయేవాడు. ఆఖరి ఉత్తరంలో రాసింది అమూల్య. 'నీలో నేను మొదట చూసినవి యిప్పటికీ యెప్పటికీ వున్నాయి. వాటిని నేను యెక్కడున్నా యే సమయంలో గూడ గౌరవించి అభిమానిస్తాను. కానీ నాకు ముఖ్యంగా కావాల్సినవి నీలోలేవు. అవి వున్నాయని నన్ను నేను మోసపుచ్చుకోలేను. ఒకవేళ అలా మోసపుచ్చుకుందామని అనుకుంటే జరిగే ఫలితం నాకు తెలుసు. అందుకే వేనటువైపు వెళ్లటంలేదు. నాలోలేనివి యేవో నీకు గూడ తెలుసు. నాకు కావాల్సిన విధంగా మారమని నిన్నెలా అడగనో — అలాగే నీకు కావాల్సిన విధంగా నేనూ మారలేను. యిలాగయితే ప్రపంచంలో యెన్ని వివాహాలు జయప్రదం అవుతాయీ అని నువ్వడిగితే నేను జవాబు చెప్పలేను. మనలో నూటికి 90 జీవితాలు త్యాగమనే చక్రంలో ఆకుల్లా తిరిగిపోతున్నాయి. చాలామందికి అసలు జీవితం అంటే యేమిటి, దాన్నెలా అనుభవించాలి అన్న ప్రశ్న లేకుండా బ్రతుకుతున్నారు. అలాటి వాళ్ళకి చెయ్యెత్తి నమస్కరించవచ్చు. వాళ్ళకే బాధలూ వుండవు. కానీ నేనలాటిదాన్ని కాను. నాకు ప్రత్యేకంగా కావాల్సినవి కొన్నివున్నాయి. అవి అందకపోతే పోయినాయి. కాని వాటికోసం నేను ప్రయత్నం చెయ్యకుండా వుండలేను. ప్రసాద్‌ని నేను చేసుకుంటున్నానంటే అతనేదో మహా పొడిచేశాడని—ధీరుడని—అందరికీ అతీతుడనిగాదు. ఒకవిధంగా అతను నీకంటే చాలా తక్కువే. కానీ నీలా అతను జీవితాన్ని నా యిష్టంవచ్చినట్లు అనుభవించటానికి అడ్డురాడు నేనంటే పిచ్చియిష్టం. అంతవరకే తెలుసు అతనికి అదెంత హాయి. నీలా అతను తన ప్రేమతో బంధించాలనిగాని — ఆ ప్రవాహంలో ముంచాలనిగాని చూడడు. శుక్రవారం మేం యిద్దరం న్యూయార్క్‌కి బైలుదేరుతున్నాం నాకు తెలియని లోకాలకు యెగరటానికి ప్రసాద్ నాకు రెక్కలు యిస్తున్నాడు. అంతే. అక్కడన్నుంచి తిరిగి వస్తానని నమ్మకంలేదు. ఒకవేళ తిరిగి వచ్చినా మనిద్దరం కలుసుకుంటాం అనే ప్రసక్తి లేదు. జీవితంలో మన పరిచయానికి గతమేగాని భవిష్యత్ లేకపోవచ్చు. నన్ను క్షమించు నాకు తెలుసు నువ్వు కోరుకున్న విధంగా నేనుండలేకపోయానని. అందుకు నేను దిగులుపడటంలేదు. శలవు" చాలా వివరంగా రాసిన ఆ ఉత్తరాన్ని చాలాకాలం దగ్గర పెట్టుకున్నాడు శేఖరం. అమూల్య అమెరికా వెళ్ళిపోయింది. తనకు ఉద్యోగం దొరికింది. ఆంధ్రప్రదేశ్ రాకముందే హైదరాబాద్ వచ్చేసాడు. తన సంస్కృతికి తన స్వజనానికి సంబంధంలేని నగరం. అనవసరంగా సానుభూతి చూపేవాళ్ళుగాని, జీవితంలో వోడిపోయానని వెక్కిరించేవాళ్ళుగాని, అమూల్యముందు చాతకానివాడవైనావని గుర్తుచేసేవాళ్ళుగాని లేరు. మనసు, మనసుతోపాటు జీవిత విధానాన్ని గూడ మార్చుకుని హైదరాబాద్‌లో సెటిల్ అయ్యాడు శేఖరం. ఇక్కడెవ్వరికీ అతనికి పెళ్ళయినట్లు తెలియదు. మళ్లిపెళ్ళి చేసుకోమని సలహాయిస్తున్న మిత్రుల్ని తిరస్కరించేవాడు. ఇన్ని విధాలావున్న అతనికి ఆడవాళ్ళంటే విముఖత్వం యెందుకో యెవరికీ అర్థంఅయేదిగాదు. మళ్ళీ ఆడవాళ్ళతో అతని ప్రవర్తన చాలా మృదువుగా ఆకర్షణీయంగా వుండేది. మళ్ళీ పెళ్ళిచేసుకోగలడని శేఖరం కల్లో గూడా అనుకోలేదు.

తర్వాత చాలా కాలానికి వోసారి వో స్నేహితుడు పెళ్లిచూపులకు తోడు రమ్మనమని బందరు దగ్గర ఓ పల్లెటూరికి తీసుకెళ్లాడు ఆ పెళ్ళికూతురే వాసంతి. చాలా శ్రోత్రియ కుటుంబంలో పుట్టిన వాసంతికి పుట్టిన వూరుతప్ప ప్రపంచం తెలియదు. పుట్టుకతో వచ్చిన విజ్ఞానంతప్ప పుస్తకాల ప్రభావం లేదు. అడవిమల్లెలావున్న వాసంతి అమాయకపు మొహంతో—పసిపిల్ల మనస్తత్వాన్ని ప్రతిబింబింపచేసే పెద్ద పెద్ద కళ్లతో, తలయెత్తలేని సిగ్గుతో శేఖరాన్ని మొదటి చూపులోనే ఆకర్షించింది. 'పేరేమిటని', అడుగుతున్న శేఖరమే పెళ్ళికొడుకనుకున్న వాసంతి కళ్ళల్లో మెరుపులు కురిపిస్తూ 'వాసంతి' అంది. ఆ అమ్మాయి యేం చదువుకోలేదని, పైనుంచి వాళ్లు తన హోదాకి తగినవారుకాదని ఆ సంబంధాన్ని తోసిపారేశాడు శేఖరం మిత్రుడు. తర్వాత తనే స్వయంగా యీ సంగతి తెలియపరుస్తూ తనకున్నవి తెలియపరుస్తూ మీకేమీ అభ్యంతరంలేకపోతే మీ అమ్మాయిని నేను చేసుకుంటానని వుత్తరం రాసాడు.

తిరుగుటపాలో వుత్తరానికిబదులు పిల్లతండ్రి పరుగెత్తుకొచ్చాడు తన మొదటి వివాహాన్ని గురించి స్థూలంగా వివరిస్తూ, ఆ అమ్మాయి పోయిందని మళ్ళీ తనకు పెళ్లి చేసుకోవాలనిపించలేదని యింతకాలానికి వాసంతి తన మనసులో ఆ కోర్కెని కదిపిందని చెప్పాడు. శేఖరం స్థితిగతులు తెలుసుకున్న ఆయన మొహం విప్పారింది పెళ్ళిచూపులుకు రావటం కేవలం అమ్మాయి అదృష్టం అని పదే పదే చెప్పి కళ్లల్లో నీళ్లు తిరిగినంత సంతోషంపొంది ఆయన తిరుగు మొహంపట్టాడు. మరుసటినెలలో వాసంతితో శేఖరం వివాహం జరిగిపోయింది.

వాసంతిరాకతో శేఖరం జీవితమే మారిపోయింది. చాలాకాలంనుంచి ఆధారంలేక అడ్డ

(42–వ పేజీ చూడండి)

మందరపు పద్మ




అగ్గిపుల్లా, సబ్బుబిళ్ళా ఏదీ కవిత్వానికి అనర్హం కాదుట. అందుచేత గొడుకు గొప్పకేం తక్కువ లేదు! పూర్వు లేదో పిచ్చిపుల్లాయిలు! వాళ్ళకీ అగ్గిపుల్లలూ, సబ్బుబిళ్ళలూ తెలియవు మరి! అందుచేతవా రెవరూ గొడుగుమీద గ్రంథాలు రాయలేదంటే, తప్పుగా చెప్పుకోవలసిన మాటకాదు. అణువుమొదలు ఆటంబాంబువరకు అన్నీ తెలిసిన ఆధునికు లెందు కీ విషయమ్మై ఉపేక్ష చేశారో అర్థంకావడంలేదు! కేవలం మమ్మల్ని ధన్యుల్ని చెయ్యడానికే కాబోలు! గొడుగుమీద గొప్పగా గ్రంథాలు రాయలేకపోయినా, ఏదో ఉడతాభక్తిగా వ్యాసాన్నయినా వ్రాద్దామని మనస్సు ఘోష పెడుతున్నది

తీరా వ్రాద్దామని కూర్చునేసరికి పక్కింటి పేరిశాస్త్రులగారి మాటలు జ్ఞప్తికొచ్చాయి ఆయన వంటారు—"అమ్మాయ్! మన పురాణాల్లోలేని గొప్ప రహస్యాలు, అందులో కెక్కని వస్తువా లేదు! వీటిని పట్టుకుపోయే ఆ తెలవాళ్ళు విమానాలు రైళ్ళు ఒకటేమిటి సమస్తమూ కనిపెట్టేస్తున్నారు. మన శ్రీరాములవారు పుష్పక విమానం ఎక్కలేదూ—మనకు విమానం కొత్తా ఏమిటి?" దేశంలో యిలా వాదించేవాళ్ళుకొంతమంది వుంటున్నారు ఆయన మాటలు కొట్టిపారెయ్యడమెందుకూ పురాణాల్లో గొడుగుపైన ఎక్కడైనావుందేమోనని అనుమానం తోచింది.

మొదట భారతం తిరగేస్తుండగా, అనుశాసనికపర్వం, తృతీయాశ్వాసంలో, సూర్య జమదగ్ని సంవాదంలో ఈ గొడుకు జన్మగాథ కనిపించింది. ధర్మరాజు శంతన పుత్రుణ్ణి "పితృకార్యాల్లో గొడుగులు, చెప్పులు యివ్వడం ఉత్తమమని చెపుతారు దాని విశేషం ఎరిగింపవే మహాత్మా!" అని ప్రార్థించాడట. దానికాయన సూర్య జమదగ్ని సంవాదమనే యీ క్రిందికథవలన నీ సందేహం తీరిపోతుందంటూ కథ ప్రారంభించాడు

జమదగ్నిమహాముని క్రీడార్థం, శరాసనంబులు ధరించి, వెనుక భార్య రేణుకాదేవి బాణంబులకట్ట తీసుకొని వస్తుండగా ఆరుబయట, తన విలువిద్యా చాతుర్యాన్ని చూపిస్తున్నాడు అతడు బాణాలను దూరంగా ప్రయోగించడం, ఆవిడ అవి ఏరి తిరి తీసుకురావడం—ఇలా వినోదిస్తుండగా మిట్ట మధ్యాహ్నమయింది. ఆ మిట్ట మధ్యాహ్నపుటెండకా కుసుమకోమలి తాళలేక బాణాలను ఏరి కాస్త ఆలస్యంగా పట్టుకువెళ్ళింది మహర్షి చిరునవ్వుతో "ఎందుకింతాలస్యమయిందని" ప్రశ్నించాడు. రేణుక, ఎండ ఎక్కువగా వుండడంవల్ల, ఒక చెట్టు నీడను విశ్రమించిగాని రాలేకపోయినట్టు చెప్పింది.

దాంతో మహర్షిగారికి వళ్ళమండిపోయింది. "ఆ! ఏమిది! సూర్యుడు నిన్ను బాధించాడా! చూడు వీడిని! ఏం చేస్తానో! ఈ బాణంతో నేల కూలుస్తాను!" అని బాణం తీశాడు. మహర్షిగారి కోపాగ్నికి గడగడలాడుతూ సూర్యుడొక బ్రాహ్మణ వేషంతోవచ్చి, ఆయనకు నమస్కరించి "ఏమయ్యా! మహర్షీ! నీ కోపంతో సూర్యుణ్ణి నేలకూలుస్తానన్నావు గాని, సూర్యుడులేనిదే లోకం ఎలా నడుస్తుంది? లోకం అంధకారబంధురం అయిపోదా ? నీరెలా వస్తుంది? సూర్యరశ్మిలేనిదే చెట్లెలా పెరుగుతాయి. లోకపు నడక ఆగిపోదా!" అని ప్రశ్నించాడు. దాంతో ముని కొంత శాంతపడ్డాడు. అంత భగ్గున మండే సూర్యుడు, చల్లబడ్డ మునినిచూచి, యిదే అదనని "మహర్షీ! నేనే ఆ సూర్యభగవానుడని! నావల్ల తప్పు జరిగింది. క్షమించవయ్యా! ఇదిగో ఇంక నా ఎండవల్ల ఎల్ల ప్రజలకు ఎలాంటి బాధ లేకుండా వుండగలందుకు నీకు రెండు వస్తువులను యిస్తున్నాను. చెప్పులు—ఇవి కాళ్ళకు తొడుక్కుంటే కాళ్ళు కాలవు. గొడుగు—ఇది నెత్తిన వేసుకుంటే బుర్రమాడదు!" అంటూ దివ్యమైన యీ రెండు వస్తువులను తన మానసవృత్తిచేత తెచ్చియిచ్చాడట.

మనదేమో "మోడరన్ జనరేషన్". ఈ మానస సృష్టి ఏమిటో మన కంతుబట్టదు. అందుచేత యిదేదో కట్టుకథలా తోస్తుందేతప్ప నమ్మ బుద్ధి పుట్టదు.

ఇంతలో బామ్మ గదిలోకి వచ్చింది. ఎప్పుడూలేంది గొడుగును అటూ యిటూ పట్టుకుని చూస్తుండడం చూసింది. చూసి "గొడుగుమీద ఏదో వ్రాయ బుద్ధిపుట్టినట్టుంది. మీ తాతయ్య దీనిమీద చక్కటి కథ చెప్తుండేవారు. విను" అంటూ మొదలేసింది. ఇది కనిపెట్టినవాళ్ళ మనవాళ్ళేనట! మనవాళ్ళ అంటే హిందూదేశస్థులనా, లేక మన కులపువాళ్ళనా? ఏమిటో అంతుబట్టలేదు. అమాటే బామ్మ నడగ్గానే 'గయ్యి'మని లేచింది. "అందుకేనమ్మా! ఈ కాలపు పిల్లలకు ఏ సంగతీ చెప్పలేం, నోరెత్తితే నూరు ప్రశ్నలువేస్తే యిక కథ ఎలా సాగుతుంది! మానాడిలా ప్రశ్నలువేసి ఎరగమమ్మా! చెప్పిందల్లా వినడమే" అంటూ దండకం ప్రారంభించింది

సరే! కథ ఎక్కడ చెప్పడం మానేస్తుందోనని, నోరు మూసుక్కూచున్నాను. ఆవిడ చెప్పుకుపోసాగింది ఒకాయన మిట్టమధ్యాహ్నం వరండాలో వాలుకుర్చీలో కూర్చొని ఉబుసుపోకకు పచ్చిక బైలువైపు చూస్తున్నాడు. ఆ పచ్చికబైలులో అక్కడక్కడా కొన్ని పుట్ట గొడుగులున్నాయి. ఇంతలో ఆ ఎండలో ఎక్కడనుండో వో చీమవచ్చి ఆ గొడుగు నీడను కాస్సేపు సేద తీర్చుకొని వెళ్ళిపోయింది. ఇంతలో కొద్దిగా టపాటపామంటూ వాల్గు చినుకులు పడ్డాయి. దాంతో ఏదో చీమవచ్చి గొడుగు క్రింద చేరింది. ఇదంతా కుర్చీలో కూర్చుని చూస్తున్న ఆ ఆసామికి చటుక్కున ఓ ఆలోచన తోచింది. ఆపుట్టగొడుగు ఆకారంలో తానూ ఒక వస్తువును నిర్మిస్తే, ఎండనుండి తన్ను తాను కాపాడుకోవచ్చునే! పై వూహతో గొడుగు నిర్మాణానికి పూనుకున్నాడట. ఈ కథా కట్టుకథలాగేవున్నా, పుట్టగొడుగునుండి గొడుగు తయారయిందనడం సబబుగానే వున్నట్టు తోస్తుంది.

మాకు తెలిసినవి నాలు రకాల గొడుగులు. (1) తాటాకుల గొడుగు, (2) నల్లటిగుడ్డ గొడుగు, (3) అడవి గొడుగు (ఏజెన్సీ ప్రాంతాల్లో విరివిగా దొరుకుతాయి) (4) జపాను గొడుగులు.

పాతకాలపునాటిదైనా, తరతరాలనాటి తాటాకుల గొడుగు శ్రేష్ఠమైనది. పట్టుకోవడానికి బరువుగావున్నమాట వాస్తవం! మామూలు గొడుగులా ముడుచుకోవడానికి, తెరుచుకోవడానికి వీలుండదొకటి! అయినా పాతకాలపునాటిది కనుక మనకు పూజనీయం! తాటాకుల గొడుగు మా తాతగారి ప్రాణాలు కాపాడిన సందర్భమొకటివుంది! తాతగారు తునిలో వుండేవారు. తునిదగ్గర దట్టమైన అడవి ఒకటున్నది. అడవికి అవతలవేపునున్న వూరి కేదో పనిమీదకెళ్ళి, తాటాకుల గొడుగు తమాషాగా తికప్పుకుంటూ చీకటిపడకుండా యింటికి తిరిగి వస్తున్నారు. నట్టడివిలో కొచ్చేసరికి "గాండ్రు, గ్రాండు" మంటూ పెద్దపులి ఎదురుపడింది. తాతయ్యగారు స్తంభించిపోయారు. చలనంలేని తాతగారినిచూసి, పెద్దపులికేంపాలుపోలేదు. అది అంతకంటె పటంలా ఆయన కెదురుగా కూర్చుంది. తాతగారికి తటాలున చక్కటి ఉపాయం తట్టింది. గొడుగు అడ్డం పెట్టుకుని మెల్లిగా క్రింద చతికిలబడి కూర్చున్నారు. ఆ గొడుగేమో క్రిందపెట్టారు. తన కండువాతీసి దానిమీదవేసి, మెల్లిగా డేకుకుంటూ కొంతదూరంపోయి అక్కడినుంచి పరుగు లంకించుకున్నారు. పెద్దపులి పాపం! ఆ గొడుగే మనిషనుకుని చూస్తూ కూర్చుండిపోయింది! తాతగారీకథచెప్తూ అక్కడినుంచి ఎల్లవేళలా తాటాకు గొడుగును వదలకుండా వేసుకుపోతుండేవారు

ఏం! ఇంక రెండోది గుడ్డ గొడుగు. ఇది నల్లటి గుడ్డతో తయారు చేస్తారు కొందరా గుడ్డకు రక్షగా తెల్లటిగుడ్డ తొడుగు వేయిస్తారు. చూడ్డానికి అందవికారంగావున్నా, తెల్లటిగుడ్డే మంచిది. చల్లగా వుంటుంది! ఎండవేళలా, వానవేళలు గొడుగు వేసుకోవడానికే అడ్డమూలేదు. కాని కొందరు, వాతావరణం ఎంత బాగున్నా, గుడ్డల్లా గొడుగును కూడా ధరించి కాని గుమ్మం కదలరు. అప్పు డీ గొడుగు ఆ వ్యక్తులకొక గుర్తుయి కూర్చుంటుంది. చిన్నప్పుడు రవీంద్రుడికి చదువంటే చెడ్డ చికాకుగా వుండేది! ఆయన ప్రయివేటు మేష్టారు ఎల్లవేళలా నల్లటిగొడుగు వేసుకుని ప్రత్యక్షమవుతుండేవారు గురువుగారూ ఆరోగ్యవంతుడే! శిష్యుడూ ఆరోగ్యవంతుడే! అనారోగ్యం వంకన పాఠం ఎగెయ్యడానికి వీల్లేకపోయేది ఒకనాడు కుంభపోతగా వర్షం కురుస్తున్నది. మేష్టారు వచ్చేవేళ యించు

(42-వ పేజీ చూడండి)

# పుష్పమువంటి తాజాదనము రోజల్లా, వొళ్లంతటా...

గోద్రెజ్ వారి సింథాల్ టాయిలెట్ పౌడరులోని కటుక—ఇతర టాయిలెట్ పౌడరులన్నిటిమంచి దీనిని ప్రత్యేక మొనరించునట్టిది—లోకప్రసిద్ధయిన జి-11* ఇది చర్మ పొడలను, చెమట దుర్గంధమును గలిగించే క్రిములను నిర్మూలించును.

రోజల్లా, వొళ్లంతటా హాయిగొలిపే పరిశుభ్రతకు మనోహర సువాసనను దోహదమొనర్చును. టాయిలెట్ పౌడర్లలో కల్లా సింథాల్ టాయిలెట్ పౌడరు ఒక్కటే వీటిని సమకూర్చును.

## ...జి-11 గలిగియున్న ఈ ఒక్కటే పౌడరుతో

ఉక్కపోతనుండి నిలకడైన శీఘ్ర విముక్తి గలిగించి చెమట వల్ల చర్మము రేగుటను పోగొట్టును. ఇది పసిబిడ్డలకు వరప్రసాదము!

సంపూర్ణ రక్షణకు సింథాల్‌తో స్నానము చేసిన పిదప వాడండి.






## Godrej గోద్రెజ్ సింథాల్ టాయిలెట్ పౌడరు

*"జి-11 ఏమిటి?" అనే ఉచిత సచిత్ర పుస్తకము కోసం గోద్రెజ్ బొంబాయి 12కు వ్రాయండి.)



# ప్రమాణాలు ప్రతిజ్ఞాలు

సింగరాజు లింగమూర్తి

### జరిగిన కథ

పోలయ్య అంటే ఆ ఊళ్ళో చాలా మందికి అభిమానం, గౌరవం. కొంతమందికి అతనిపై అయిష్టం కలగడానికి కూడా కారణం లేక పోలేదు. నరసింహప్ప చలమయ్య ఒకరినొకరు సాధించుకోవాలని ఎత్తులు వేస్తూ ఉంటారు. నరసింహప్ప పోలయ్యను తన పక్షంలో చేర్పించటానికి ప్రయత్నిస్తాడు. ఇందిర చెల్లెలు లలిత రాజారావును ప్రేమిస్తుంది. రాజారావును మంచిచేసుకునేందుకు చలమయ్య అలివేణిని నియోగిస్తాడు. ఎన్నికలలో పోటీ చెయ్యమని పోలయ్యను రాజారావు ప్రోత్సహిస్తాడు. చలమయ్య ఏర్పాటు చేయించిన మిల్లు కార్మికుల సభ పోలయ్య ప్రసంగంతో అభాసు అవుతుంది. అలివేణి రాజారావును ప్రేమిస్తుంది. మిల్లు కార్మికులలో రెండు వర్గాలు ఏర్పడుతాయి. ఇందిర, లలితలనుగూర్చి చలమయ్య చేస్తున్న ప్రచారాన్ని మునసబు నరసింహప్పకు తెల్పుతాడు. మెట్రిక్ పరీక్షకు హాజరయ్యేందుకు ఇందిర, పోలయ్య విజయవాడ వెడతారు. అక్కడ పోలయ్యకు శారదతో పరిచయం అవుతుంది. ఒకరినొకరు ప్రేమించుకుంటారు. విజయవాడనుంచి తిరిగివచ్చిన తరువాత రాజారావు ప్రోద్బలంతో పోలయ్య ఎన్నికలకు అభ్యర్థిగా నిలుస్తాడు. చలమయ్య మిల్లు కార్మికులలో ఒకవర్గం చేత సమ్మె చేయిస్తాడు. పోలయ్య నిరశనవ్రతం చేసి సమ్మె చేసిన కార్మికులకు మళ్ళీ పనులు ఇప్పిస్తాడు.

---

ఆ రోజు ఉదయం ఎనిమిదిగంటలకల్లా పోలింగు ప్రారంభమైంది ఒకగంటసేపు చాలా మందకొడిగా సాగింది పోలింగు పోలయ్యకు మొదటి వోటు రాజారావు వేశాడు ఆ తరువాతినుంచీ పోలింగు చురుకుగా సాగింది పోలింగుబూతుకు కొంతదూరంలో ప్రచారం సాగుతూనేఉంది ప్రక్కగ్రామాలనుంచి వోటర్లు గుంపులు గుంపులుగా వస్తున్నారు. చంద్రిగాడు, రంగపాండు తమ పార్టీ గుర్తును వోటర్లకు జ్ఞాపకం చేస్తున్నారు. రహస్యంగా ఏవో మంతనాలు సాగిస్తున్నారు. ఇంటింటికీవెళ్ళి కొందరు వోటర్లను వచ్చి తమ పెట్టెలోనే వోటు వెయ్యమని ప్రాధేయపడుతున్నారు

నరసింహప్పవర్గంకూడా ప్రచారం బాగానే చేసుకుంటున్నారు. అటునుంచి నరసింహప్ప, ఇటునుంచి చలమయ్య వోటర్లకు డబ్బు గుప్పుతున్నారు. ఏవేవో వాగ్దానాలు చేస్తున్నారు.

"మనకు వోటు వెయ్యమని డబ్బిచ్చారు. వాళ్ళకు వోటువేయక పోలయ్యకువేస్తే ఏం బాగుంటుంది?" అని కొందరు మథనపడుతున్నారు

"మోసాన్ని మోసంతోనే ఎదుర్కోవాలి. మనకు డబ్బు వద్దన్నకొద్దీ యిచ్చారు . . మనమేం ఇవ్వమని ప్రాధేయపడ్డామా" అని సమాధానం చెప్పుకున్నారు కొందరు

"మీకు ఊరి పరిస్థితులు తెలుసు ఎన్నికలలో నిలబడిన వ్యక్తులు ఎటువంటివారో కూడా తెలుసు. మీ హృదయపూర్వకంగా ఎవరికి వోటు చెయ్యాలని ఉంటే వారికి చేయండి" అని బోధించాడు రాజారావు

కార్మికులు బిలబిలాడుతూ కొంతమంది వోటు చెయ్యడానికి వచ్చారు వాళ్లను ఆకట్టడానికి ప్రయత్నించాడు రంగపాండు. అక్కడ పల్లెత్తుమాట మాట్లాడటానికి వీలులేదనీ, హద్దుమీరితే తగిన చర్య తీసుకోబడుతుందనీ ప్రిసైడింగ్ ఆఫీసర్ అనడంతో రంగపాండు ఇక నోరెత్తలేకపోయాడు

"మాకు తెలుసులేవయ్యా—నీ సలహా ఏం అక్కరలేదు" అని కార్మికులు నవ్వుకుంటూ వోటు వెయ్యడానికి వెళ్ళారు

భోజనాల సమయానికి పోలింగ్ ఆపారు.

(39 వ పేజీ చూడండి)


మధుమధురమైన శ్రీనివాయిస్ తేటపాట
మృదుమధురమైన స్వరాలు హాయిగా
తిరిగా నోటు బాట
అయినా, కన్నడం కన్నా మళయాళంకన్నా
తమిళం కన్నా
తెలుగులో ఎక్కువ పాడక పోవడాని
క్కారణం ఏన్నా?

# దేవయ్య



## జరిగిన కథ

పూర్వం ఒకానొక దేశంలో ఒక రైతు ఉండేవాడు. అతనికి వాకయ్యా, రామయ్యా, దేవయ్యా అనే ముగ్గురు కొడుకులు; మారమ్మ అనే కూతురు ఉండేవారు. దేవయ్య తెలివి తక్కువవాడు; మారమ్మ మూగదీ, చెవిటిదీ. వాకయ్య సైన్యంలో చేరి జాగీరు సంపాదించాడు. రామయ్య వ్యాపారంలో ఆరితేరాడు. దేవయ్య వ్యవసాయం చేసుకుంటూ తండ్రిని చెల్లెలిని కనిపెట్టుకొని ఉన్నాడు. కొంత కాలం తరవాత వాకయ్యా, రామయ్యా వచ్చి తమ భాగాలు పంచుకుపోయారు. అన్నదమ్ములు తగవులాడుకోకుండా ఇలా కాలం గడపటం ఆ ఊరి పొలిమేరలో ఉన్న దెయ్యానికి నచ్చలేదు. వారిలో వారికి పడకుండా చెయ్యమని తన ముగ్గురు పిల్లల్ని ప్రోత్సహిస్తుంది. అవి మూడూ ఆ అన్నదమ్ముల పనులు పాడుచేయడానికి ప్రయత్నిస్తాయి. దేవయ్య మాత్రం లొంగిపోడు. వాకయ్యా, రామయ్య ఆస్తులు పోగొట్టుకొని, తండ్రి పంచను చేరుతారు. దేవయ్య సహాయంతో వాళ్ళిద్దరూ జాగీర్దారులు అవుతారు. రాజుగారు దేవయ్యకు తన కూతుర్నిచ్చి పెళ్ళి చేస్తాడు. ముగ్గురన్నదమ్ములూ హాయిగా ఉన్నారని తెలుసుకున్న పెద్ద దెయ్యం వాళ్ళని భ్రష్టుల్ని చెయ్యడానికి తనే బయలుదేరుతుంది. వాకయ్య, రామయ్య దాని వలలో చిక్కుకుని, మళ్ళీ బికారులవుతారు. దేవయ్య మాత్రం సుఖంగానే ఉంటాడు.

---

కాని ఫలితం శూన్యం. ఎవడూ పనిలోకి రాలేదు, ఏ వస్తువూ తీసుకురాలేదు. అప్పుడప్పుడు ఓ కుర్రవాడో, పిల్లో ఒకటో రెండో కోడిగుడ్లు తెచ్చి కాసులు తీసుకుపోయేవారు ఆడుకోడానికి. అంతే! మళ్ళీ ఎవరూ వచ్చేవారు కాదు. అంతకుముందు నిల్వచేసిన ఆహార పదార్థాలు అయిపోవడం మొదలుపెట్టాయి. చివరికి ఒక బియ్యపుగింజ

లేకుండాపోయింది. అయినా ఎవరూ రాలేదు. పెద్దమనిషి ఆఖరికి తాళలేకపోయాడు. రెండు మెతుకులు దొరుకుతాయేమోనని తానే స్వయంగా బయలుదేరాడు. ఇల్లిల్లూ తిరిగాడు. ఒక యింటావిడిని అడిగాడు. "కోడిపెట్ట యిస్తావా కాసులు యిస్తాను" అని. ఆమె "నాకెందుకు నాయనా! కాసులు? ఇప్పటికే బోలెడున్నాయి. ఇంకేం చేసుకోను?" అంది.

ఇంకో ముసలమ్మ యింటికి వెళ్ళి నూకలిస్తే కాసులిస్తానన్నాడు. దానిమీద ఆ ముసలమ్మ "నా కెవరున్నారు నాయనా! పిల్లలా మనవలా ఆ కాసులతో ఆడుకోడానికి? నా కాలక్షేపానికి యేవో రెండో మూడో ఉన్నాయనుకో. ఆ కాసులు. అవే చాలు" అంది.

చివరకి ఒక రైతుయింటికి వెళ్ళి కాసులు తీసుకుని తిండి పెట్టమన్నాడు. అప్పుడు ఆ రైతు "నాకు కాసులు అక్కరలేదు. ఇంక నోరు తెరిచి అడిగావు కనక ఆ దేవుడిచ్చిన దానిలోనే యింత పెట్టిస్తా ఉండు" అన్నాడు. అంతే దేవుడిపేరు యెత్తేసరికే ఆ ముసలిదెయ్యం పారిపోయింది.

ఆ విధంగా ఎక్కడా ఒక్క మెతుకు పుట్టలేదు. ప్రతివాడికీ కాసులు ఉండడంవల్ల ఈ పెద్దమనిషి ఎంత యిస్తానన్నా వాళ్లు ఒక్క పిసరుకూడా యిచ్చేవారు కాదు. పైగా "ఇంక కాసులు లాభం లేదయ్యా! ఇంకేమన్నా క్రొత్త వస్తువు తీసుకురా. అప్పుడిస్తాం నీకు కావలసింది" అనేవారు. "లేదా దేవుడిపేరు చెప్పుకుని యింటింటికీ పోయి అడుక్కో. ఎవరికితోచింది వారు వేస్తారు."

కాని ముసలిదెయ్యం దగ్గర క్రొత్తవేం ఉన్నాయి కాసులుతప్ప? పనిచేద్దామంటే ఒళ్లువంగదు. దేవుడిపేరు చెప్పుకుని ముష్టియెత్తడంఅంటే అతనికి పడదు. ఛ! ఛ! ఒళ్ళు మండిపోయింది.

"కావలసినన్ని కాసులు యిస్తానంటే ఇంకేం కావాల్రా? తెలివితక్కువ మొద్దుల్లారా! కాసులుంటే యేంకావాలంటే అది చేసుకోవచ్చు కద్రా!" అని కేకలేశాడు.

వాళ్లేమన్నా లెక్కచేస్తేగా? "మాకేం అక్కరలేదు లేవయ్యా! మేం తీర్చవలసిన బాకీలుగాని, చెల్లించవలసిన పన్నులుగాని యేం లేవులే. ఇంకా కాసులుతీసుకుని ఏం చేసుకుంటాం?" అని అడిగారు.

అందుకని ముసలిదెయ్యం ముడుచుకొని పడుకోవలసివచ్చింది. తిండితిప్పలు ఏంలేవుగామరి?

## 13

ఈ విషయం క్రమంగా దేవయ్య మహారాజుకి తెలిసింది. ప్రజలే వెళ్లి చెప్పారు. "ఇప్పుడు మేం యేం చేయాలి మహారాజా! ఎవరో పెద్ద మనిషి వచ్చాడు. ఆయన పని పాటలు చేయడటగాని పంచభక్ష్య పరమాన్నాలతో విందులు చేయగలడట! మంచిమంచి బట్టలు వేసుకుని, తిరగగలడట! దేవుడిపేరుతో యాచించను కూడా యాచించడట! బుల్లిబుల్లి బిళ్ళలాంటివి మాత్రం యివ్వడానికి సిద్ధపడుతున్నాడు. మొదట్లో ఆ కాసుల కోసం ప్రజలు తమ వస్తువులన్నీ తీసుకువెళ్ళి యిచ్చారు. కావలసిన కాసులు దొరికేటప్పటికి యింక వస్తువులివ్వడం మానేశారు. ఆఖరికి

(37-వ పేజీ చూడండి)

# చిట్టికోరిక

ఎ. వి. రంగయ్య

చిట్టికి చీరకట్టి
గిట్టియంచు రవికతొడిగి
ఆడవే ఆటంటే,
అమ్మకావాలంటుంది.

* * *

పట్టికి పావడాకట్టి
బంగారపు సొమ్ములెట్టి
పాడవే పాటంటే;
అమ్మ కావాలంటుంది.

* * *

పొట్టికి బొట్టుపెట్టి
పూవులన్నీ జడకుచుట్టి
పలకవే చిలకా అంటే
అమ్మ కావాలంటుంది.

* * *

కళ్లకి కాటుకెట్టి
కాళ్లకి పారాణి పూసి
కులుకవే కలికీయంటే;
అమ్మ కావాలంటుంది.

* * *

అమ్మయేలనే పాపా!
అందగాణ్ని నేనుండగ
అని మేనమామంటే—
అమ్మ కావాలంటుంది పాప!




**25-10-1961 బుధవారము మొదలు**
**31-10-1961 మంగళవారము వరకు**

### మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

హోదా, హంగులు బాగుంటవి. వాటున ఎవరు ఏమనుకున్నా ప్రత్యక్షంగా మీ మాటను కాదనేవారు ఉండరు. అయితే పనులు చురుకుగా జరగలేదని అనుకోదగిన సమయంకాదు. వివరంలేని ఖర్చులు చేస్తారు. వృత్తి వ్యాపారాలలో అసంతృప్తికరమైన స్థితి తొలగిపోయి మనశ్శాంతి లభిస్తుంది. తక్కువ శ్రమతో విశేషంగా ఫలితం పొందగల సమయం. కుటుంబంలోనివారితో ఏకీభవించలేకపోతారు. ముందు జాగ్రత్తతో ఉందామని ఎంత ప్రయత్నించినా, ముఖ్యమైన పనులలో శ్రమపడకతప్పదు విలువగల వస్తువులు కొనవలసివస్తుంది. క్రొత్తవారితో కలిసి ఏపనీ చేయతగిన సమయంకాదు. 30, 31 తేదులలో బంధుగౌరవం, పుణ్యకార్యాలు, వినోదాలు.

* * *

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

మీ మనస్సుకు తృప్తిలేకపోయినా ఇతరుల ఇష్టానికి భారం పైన వేసుకొనవలసి వస్తుంది అయితే గొప్ప కోసం అప్పుచేయటం మంచిదికాదు. బంధుమిత్రుల వల్ల, నిష్ఠురాలు రాగలవు. గొప్పవారి ఆదరణ ఉన్నదనే సంతృప్తి కనిపిస్తుంది. కాని ప్రస్తుతం మరి ఏ విధంగానూ ఉపయోగం పొందలేకపోతారు. యధార్థంకన్నా, యుక్తితో వ్యవహరించవలసిన అవసరం కలుగుతుంది. ఎప్పటికప్పుడు ముందు ముందు విశేషంగా ఫలించేటట్లు తోస్తూఉంటుంది. కాని, కాలంమాత్రం గడిచిపోతూవుంటుంది. అత్యుష్ణం వల్లను, అతిశ్రమవల్లను, అనారోగ్యం చేస్తుంది. ఈ సమయంలో సూర్యపూజ, రుద్రాభిషేకము జరుపుకొనటం మంచిది. 25, 26, 27 తేదులలో గౌరవప్రాప్తి, శుభవార్తలు, వృత్తిలో సాటివారివల్ల అనుకూలత.

> **గ్రహస్థితి**
>
> సింహంలో రాహువు, కన్యలో శుక్రుడు, తులలో సూర్య, అంగారక, బుధులు, మకరంలో గురు, శనులు, కుంభంలో కేతువు, మేష, వృషభ, మిధున, కటకాలలో చంద్రుడు.

* * *

### మిధునం :

**(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ప్రస్తుతం మీరు కొంతవరకు దర్పంతో వ్యవహారాలు పరిచేసుకోగలుగుతారు. క్రొత్తవారితో మాట్లాడే సమయాలలో నిదానము, చాకచక్యము అవసరం. వృత్తిలో మీరు అనుకుంటున్నమాదిరి చిక్కులు ఏమీ ఉండవు అన్ని విధాలా గౌరవం లభిస్తుంది. మిమ్ములను గురించి పదిమందికీ మంచి అభిప్రాయం కలుగుతుంది ఆదాయం చేతికి రాకముందే ఖర్చులుమాత్రం తరుముకునివస్తూ ఉంటవి. బంధువులవద్దనుంచి అనుకూలవార్తలు తెలుస్తవి. ఇతరుల పనులలో పెద్దరికం వహించవలసి వస్తుంది. కాని, ఈ సమయంలో అందుకు తగినట్లు ఉత్సాహం చూపలేకపోతారు. లాభకరమైన పనులను గురించి ఆలోచనలు చేస్తారు. అయితే నెరవేరటానికి ఆలస్యం అవుతుంది. 28, 29 తేదులలో కార్యసిద్ధి, పిల్లలమూలంగా ఆనందము, వృత్తిలో దేహశ్రమ.

* * *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)**

ఈ వారం గ్రహస్థితి అనుకూలంగా ఉన్నది. మీరు కోరకుండానే స్నేహితులు సహాయం చేస్తారు. లోగడ మీరు పెట్టుబడిపెట్టి చేసిన పనులు సంతృప్తికరంగా నెరవేరుతవి. మిమ్ములను మోసగిద్దామనుకునేవారికి తగినట్లు సమాధానం చెప్పగలుగుతారు. ఆదాయం సామాన్యంగా ఉంటుంది వ్యవహార విషయాలలో ముందు జాగ్రత్తతో సాధించగలుగుతారు. ప్రయాణాలు చేస్తారు. ఇతరులను నమ్ముకుండా అన్ని పనులలోనూ మీరే జోక్యం పెట్టుకొనటంవల్ల అధికంగా శ్రమపడతారు వారాంతంలో ఇతరులవద్దనుంచి రావలసిన ధనం వస్తుంది. 25, 26 తేదులలో సంఘకార్యాలు, గొప్పవారితో పరిచయం, విందులు.

* * *

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

తటస్థంగాఉంటూ, సమయంలో ఒకమాట రాకుండా చూచుకొనటం అవసరం. ఇటు కుటుంబంలోను, అటు వృత్తి, ఉద్యోగాలలోను మీ మాటను అవతలివారు నిర్లక్ష్యం చేస్తూఉంటారు అందువల్ల ఏ పనీ చురుకుగా చేయలేకపోతారు ముందుగా ఆరంభించిన పనులకు డబ్బు ఇబ్బందివల్ల తాత్కాలికంగా ఆటంకం ఏర్పడుతుంది మీ సంగతులు ఇతరుల వద్దకు చేరవేయటానికి ప్రయత్నించేవారు ఉంటారు. జాగ్రత్తగా ఉండండి. ఈ సమయంలో ఇతరులచేతికి పోయిన డబ్బు తిరిగిరావటం కష్టం. ప్రయోజనం ఉన్నా, లేకపోయినా ఆడంబరము, ఉన్నతస్థితియందున్నవారితో స్నేహ సంబంధాలుమాత్రం ఉంటవి. 27, 28 తేదులలో శుభకార్యాలకై ఖర్చులు, కార్యసిద్ధి, శుభవార్త.

* * *

### కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

ఏ సందర్భంలోనూ ఆరంభంలో అనుకూల వాతావరణం కనుపించదు. కాని, దైవికంగా చివర సమయంలో జయం పొందగలుగుతారు కలహాలు, వస్తు నష్టము, మధ్య మధ్య కనుపిస్తూఉంటవి. మీ ఆలో

గ్యం ఇంతకుముందుకన్నా మేలుగా ఉంటుంది. మీకు సంబంధంలేకపోయినా ఎదటివారి పొరపాట్లను సర్దుబాటుచేసి సహాయం చేస్తారు. విలువగల వస్తువులుకొంటారు. వృత్తిలో క్రొత్త బాధ్యతలను పైన వేసుకొని నిర్వహించవలసివస్తుంది. పుణ్యకాలక్షేపాలు, సంఘకార్యాలు మొదలయినవాటితో విశ్రాంతి తగ్గుతుంది కాని, మానసికంగా సుఖం లభిస్తుంది. బంధువర్గంలో గౌరవం లభిస్తుంది. చిన్న చిన్న విషయాలలో పొరపాట్లు వస్తవి.

* * *

## తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

అసాధ్యంగా తోచిన పనులన్నీ మీ స్నేహితులు పైనవేసుకొని సహాయం చేస్తారు. కాని, చాలా సులభంగా చేయగలమనుకున్న పనులుమాత్రం ముందుకు పొగకుండా నిలచిఉంటవి. మీ శ్రమకు తగినంత ఫలితం చేతికిరాదు. సంఘంలో పేరు, ప్రతిష్ఠలు మాత్రం ఘనంగా ఉంటవి. దూరమందున్న మిత్రుల వద్దనుంచి శుభవార్తలు తెలుస్తవి. వ్యవహారాలు అనుకూలంగా పరిష్కారం అవుతవి. తరచు ఉద్రేకం వస్తూఉంటుంది. కాని, బయటపడకుండా నిగ్రహించుకోగలుగుతారు. స్థిరాస్తులు కొనటం మొదలయిన పనులు అనుకూలిస్తవి. వృత్తి, వ్యాపారాలలో విశేషంగా డబ్బు వినియోగించవలసిన అవసరం కలుగవచ్చు. అనుకున్న ప్రయాణాలు నిలుపుకోవలసివస్తుంది. 28, 29 తేదులలో ధనలాభం, పుణ్యకార్యాలు, గౌరవం.

* * *

## వృశ్చికం :

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

గ్రహబలం తక్కువ. అవసరానికి అయినవారు కూడా ముఖం తప్పించటానికి చూస్తారు వ్యవహారరంగంలో ఆలస్యము, వ్యతిరేక సూచనలు కనిపిస్తవి. ఆరోగ్యం మామూలుగానేఉన్నా అకస్మాత్తుగా బాధ కలిగే అవకాశాలున్నవి. వారం రెండవభాగంలో పరిస్థితులు కొంత అనుకూలంగా ఉంటవి. తలపెట్టిన పనులు క్రమంగా ఒక స్థితికి వస్తవి. అయితే భిన్నాభిప్రాయాలుగల వ్యక్తులమీద ఆధారపడిన పనులలో శ్రమపడి చివరకు సాధించగలుగుతారు. మీరు ఎంత జాగ్రత్తగాయున్నా, దుబారా ఖర్చులు పెరుగుతవి. 30, 31 తేదులలో సంఘంలో గౌరవం, కుటుంబంలో శుభకార్యాలు.

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)**

ఇంతకుముందు ప్రతికూలంగా మాట్లాడేవారు కూడా ప్రస్తుతం మీ మాటను బలపర్చుస్తారు. అన్నివిధాలా ప్రోత్సాహం లభిస్తుంది. ధనాదాయం పెద్దగా పెరగదుకాని, ఏ పని తలపెట్టినా చురుకుగా పూర్తి చెయ్యగలుగుతారు. ప్రసంగాలలో అవతలివారు తొందరపడినా నిగ్రహంతో ప్రయోజనం సాధించుకుంటారు. మామూలుకన్నా ఖర్చులు పెరిగే అవకాశాలున్నవి. వినోద కార్యక్రమాలకు ఆటంకాలు రాగలవు. వారం రెండవ భాగంలో సంతోషవార్తలు తెలుస్తవి. వస్త్రాలు, ఆభరణాలు మొదలయినవి కొనే ప్రయత్నాలు అనుకూలిస్తవి. 28, 29 తేదులలో అధికారులతో సంప్రదింపులు, ఇతరుల నిమిత్తం కార్యభారం, ప్రయాణాలు.

* * *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

మీరు మాట్లాడే పద్ధతి పదిమందికీ సంతృప్తికరంగా ఉంటుంది. వృత్తిలో ఇతరులమీద ఆధారపడవలసిన అవసరం తగ్గుతుంది. దూరమందున్న స్నేహితులు ఈ సమయంలో అనుకూలిస్తారు. మిమ్ములను భయపెట్టేవారుంటారు. గాలివార్తలను నమ్మవద్దు. రావలసిన డబ్బు ఒకసారిగా అందకపోవటం వల్ల శ్రమ తోస్తుంది. కాని, మొత్తంమీద ఆదాయం బాగానే ఉంటుంది. అనుకోకుండా బంధువుల వద్దనుంచి కష్టవార్తలు తెలుస్తవి. మిమ్ములను మాటలలోదింపి, చివరకు హాస్యం చేయటానికి ప్రయత్నించేవా రుంటారు. జాగ్రత్తగా ఉండండి. ప్రయాణాలు జరుగవు. చేయవలసిన పనులు చురుకుగా నెరవేర్చుకుని భారం తగ్గించుకుంటారు. 26, 27 తేదులలో బంధుదర్శనం, వృత్తిలో అభివృద్ధి.

* *

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

ముఖ్యంగా చేదామనుకున్నవీ, చేయవలసిన పనులూ అలాగే నిలచిఉంటవి. అనుకోకుండా క్రొత్త వ్యవహారాలలో ప్రవేశించవలసి వస్తుంది. బుద్ధిబలము, మాటనేర్పు ఈ సమయంలో బాగా ఉపయోగిస్తవి. కుటుంబంలో కూడా సుఖ సంతోషాలు లభిస్తవి. కార్య నిర్వహణలో పదిమంది ఆదరము లభిస్తుంది. తూర్పు ఉత్తర దిక్కులనుంచి లాభవార్తలు వస్తవి. కొన్ని సమయాలలో జ్ఞాపకశక్తి లోపించటంవల్ల పొరపాట్లుచేసి (శ్రమపడతారు) అందువల్ల ఇతరులకు ఏవిధంగాను బాధ కలుగదు. క్రొత్త మనుష్యులతోచేరి చేయు పనులు నిదానంగా కలసి వస్తవి. 25, 26 తేదులలో పనులలో శ్రమ వస్తున్నమ్ము, విసుగుదల.

* * *

## మీనం :

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

శక్తికిమించిన పనులు, పంచారము ఎక్కువ, పట్టుదలలు పెంచుకొనటంవల్ల మనశ్శాంతి లోపిస్తుంది. ఎవరివల్ల ఏలోపం జరిగినా మాట మాత్రం మీ మీదకే రాగల సమయం. ఉపయోగంలేని ఖర్చులు, మీవల్ల పని జరుపుకునేవరకు అంతా మంచిగానే మాట్లాడుతూ ఉంటారు. వృత్తి వ్యాపారాలలో క్రొత్త చిక్కులు ఏమీ ఉండవు. పెట్టుబడులు అధికం అవుతవి. వారం రెండవభాగంలో కుటుంబంలో శుభకార్యాలు జరుగుతవి. నౌకరులవల్ల కార్యసిద్ధి పొందగలుగుతారు. పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి. 28, 29 తేదులలో మిత్రులతో కలహాలు, స్వల్పలాభం, శ్రమతోకూడిన పనులు. ★

## ఈవారము ధరలు

బంగారు ధర బాగా పెరగగల అవకాశాలున్నవి. వారాంతంలో మందీసూచన, వెండి ధరలో మందీ కనుపిస్తుంది. నూలుధర మందీ వస్తుంది. పసుపుధర తేజీ వస్తుంది. గోధుములధర కొద్దిగా పెరుగుతుంది. మినుములధర తగ్గి 29 నుంచి పెరగవచ్చు. పట్టు, ఉన్ని రకాల బట్టలకు గిరాకీవస్తుంది. శనగనూనె, నూవులనూనెల ధరలు మామూలుగా ఉంటవి. తేజీ ఆరంభంఅయి తిరిగి యథాస్థితిలో నిలుస్తవి. వెన్న, నేయి ఈ వస్తువుల ధర ఇంకా పెరగగల అవకాశాలున్నవి.




ఏగ్గోని మదనమోహన్ (గుత్తి)

# అగ్గిరాముడు బొమ్మల కథ సత్యమూర్తి 7

కారుప్రమాదం తప్పించడానికి. బ్రేకు వేయడానికి కంగారులో అవకాశం లేక కారుని ఫుట్‌పాత్ మీదకి........ ప్రమాద పరిస్థితిని గ్రహించిన రాము ఒక్క ఉరుకులో ఫుట్‌పాత్ చివర నడుస్తున్న యన్.సి.సి యూనిఫారమ్ లోని వ్యక్తిని చటుక్కున మెరుపులా ఇవతలకి తప్పించాడు.




రాము ఉదయం చూసిన అమ్మాయే ఈ అమ్మాయి అని గ్రహించి—

అరె మీరా కంగారుపడకండి మీకేం భయంలేదు మీరు కాస్సేపు ఈ పార్కులో గాభరా పడకుండా విశ్రాంతి తీసుకోండి.

అని ఆ అమ్మాయిని ప్రక్కనే ఉన్న పార్కులో ఉన్న సీటు దగ్గరకి తీసుకువెళ్ళి—

ఇలా కూర్చోండి- యన్.సి.సి పెరేడ్ నించి వస్తున్నట్లున్నారు?

అవునండి- సమయానికి మీరు దేముడులా వచ్చి ప్రాణాలకు కూడ తెగించి నన్ను రక్షించారు మీ ఉపకారం మరువలేను-

మీరు సినిమాల్లో హీరోయిన్‌లాగ డైలాగులు చెప్పకండి. మహా నేను మాత్రం చేసిందేముంది? ... ఆc... నేను పొద్దున్న మీ విషయంలో కొంచెం అసభ్యంగా ప్రవర్తించేనేమో?





## సులాభవ్యాకరణం

కాకి షష్ఠివిభక్తి.
పాలు నిత్యబహువచనం;
కొంతమంది రసికులకు
ఆలు నిత్యబహువచనం.
రష్యా అమెరికాల మధ్య
పొసగవలసింది—
సవర్ణ దీర్ఘ సంధి.
రాజాజీ సర్వనామం.

—శ్రీ శ్రీ.

*   *   *   *

## క. వె. రా. సూక్తి

కాకా పట్టని నోరై
కూకూయని పికముపిల్ల కోరగ మేతన్
కాకమ్మ కసరికొట్టుచు
కా. కా కొందరికే నేర్వ కాదని

క. వె. రా.

*   *   *   *

ఒక్కొక్క రెక్కను నిక్కుచు
కొక్కొక్కనిపుంజొకటి నొక్కి
కోడికి చెప్పెన్
చుక్కా! మన అండంబుల
నిక్కంబగు శాక మంత్రులు నేడని

క వె. రా

*   *   *   *

## కోటి కొకడు

ఒక అవివాహితుడైన పండితుడు సంసార తాపత్రయాల గురించి ప్రసంగిస్తూ సభలోని వివాహితుల నుద్దేశించి యిలా అడిగాడు.

పం:-మీ మీ ఇంటి వద్ద కష్టాలున్న వారంతా దయచేసి నిలబడండి.

ఒకడు తప్ప మిగతా వారంతా లేచి నిలుచున్నారు. సభవారితో అప్పుడు అతడిలా అన్నాడు: అదుగో! మీ రొక్కరే అన్నమాట. కోటి కొకడుంటాడు సంసార బాధ లేనివాడు.

అతడు:-(మూలుగుతూ లేచి) కాదయ్యా బాబూ! ఆ బాధలతో కృంగిపోయే లేవలేకపోయా.

బి. రవీంద్ర (గుంతకల్లు)

*   *   *

మిత్రుడు:- ఏమిటీ వేళ మీ ఇంట్లో ఏదో గందరగోళంగా ఉన్నట్టుంది.

అతను:--మరేం లేదు. నా భార్య క్రొత్తగా సంగీతం నేర్చుకుంటోంది.

వి. ఆర్. శేఖర్ (చేబ్రోలు)★



క్షమించండి! రైలు ప్రయాణాలలో అలవాటు అయింది

# వాణీనిలయం



'విద్య యొసగును వినయము'

వినయాన్ని ఒసగినా ఒసక్కపోయినా, విద్య యొసగును ఉద్యోగము—తద్వారా భోజనమున్: అందుకు జాతకబలం కాస్త బాగుండాలి పైన 'మన' వాడంటూ ఒకడుండాలి . . అంతే.

సదరు విద్య—ప్రాథమికం నుండి బహుళార్థ సాధకం దాక కోటి రకాలు. ఆ కోటిలో ఒక్కటి మామూలు ఎసెసెల్సీ మార్కు విద్య ఈ విద్యను పంచిపెట్టడంలో జిల్లాకెల్లా మొట్టమొదటిది 'వాణీ నిలయం'

అది చిత్తూరుజిల్లా; ఆ బడి కుమారస్వామి గారిది.

కీర్తిశేషులైన తమ తండ్రి రామశేషయ్యగారు ఒకానొక విజయదశమి పూట వీథిబడిగా ప్రారంభించినదానిని మందరగిరి కుమారరాజావారి ప్రోత్సాహంతో, ఇంకా అటువంటి ధన పెద్దల ఇదితో పాతికేళ్ల వ్యవధిలో ఇంత ముందుకు తెచ్చిన కార్యశూరుడు కుమారస్వామిగారు.

గోచిపోసి కట్టిన దోవతి, మెడదాక బొత్తాలు వేసుకున్న కోటు, ఆ కోటు అంచుల క్రిందుగా తొంగిచూస్తున్న ఇద్దరు చొక్కా, సన్నటి జరీఅంచు ఉత్తరీయం, పెద్ద తలపాగా, మూడో కన్నులా ఉన్న కుంకుమబొట్టు, దాని వెనుక సన్నగా మెరుస్తున్న గంధపు రేఖలు, ఘట్టి

శరీరం, ఇంకా గట్టి స్వరం, చేతిల
బాటు పాత్రం ...... కుమారస్వామి
వాహనం మినహా అచ్చం
ఉంటారు.

.... అది వేసంగి సెలవులయి
కాలం .... అయిదేళ్లు దాటిన
(కొండొకచో తల్లులూ) సినిమా
క్యాలూ మానేసి — పాఠశాలల
క్రమాన నిల్చుని ఉసూరుమంటు

పాసయిన పిల్లలు, ఫెయిలయి
పుస్తకాలు, నోటీసుబోర్డు, అది



బెత్తం, దానితో
రంటే—నెమలి
దేవసేనాపతిలాగే

ండుఖు తెరిచిన
ల్లలో తండ్రులు
ర్యాలూ, బస్సావు
రణాలలో వరున
కాలం
పిల్లలు, కొత్త
స్సు, జీతాలు,

ఇంటర్వ్యూలు ... వాణీ నిలయంలో దేవేంద్రుడి వళ వార్షికోత్సవం దినంలా ఉంది

ఇంత గందరగోళం మధ్య — రాసక్రీడలో కృష్ణుడిలా అక్కడ తానై, ఇక్కడ తానై, ఎక్కడ చూచినను తానేఅయి, తమ పాఠశాలను గరిమనాభి తప్పకుండా నడిపిస్తున్నారు కుమారస్వామి ఆరోజు ఆయన కార్యక్రమంలో ఒక ఇంటర్వ్యూ ఉండింది. హైదరాబాదునుండి నలుగురు బి ఇ డీలు వస్తున్నారు వారిలో ఒకరిని ఎన్నుకోవాలి నాలుగో ఫారం 'బి' సెక్షను డిసెంబరు నుండి టీచరు లేకుండానే జరిగింది

* * * *

"ఊ, చెప్పవోయ్ ఇక్కడినుండి రామారావుపేట కెలా వెళ్తావ్ ?"

జవాబు చెప్పలేక రెండో బి ఇడి బ్లింకుతుండగా ఇంకోసారి "ఊ ..." అన్నారు కుమారస్వామి

సమాధానమివ్వ యత్నించాడు—ఉద్యోగ తుభిలషించిన యువకుడు

"మరి మరీ ఇక్కడనుండి కుడిప్రక్క తిరిగి తిన్నగా వెళ్లి . . అక్కడినుండేమో తూర్పుగా వెళ్లి మళ్లీ పడమరగా వచ్చి వచ్చి . . వచ్చి . . ."

"—వచ్చి దక్షిణ దిశగా కళ్లు మూసుకుని నడిస్తే 'రైల్వేస్టేషన్' అంటూ ఒకటి కన్పిస్తుంది అందు లోపలికి వెళితే బుకింగ్ ఆఫీసూ, ప్లాట్‌ఫారమూ అని రెండుంటాయి మొదటిదానిలో టిక్కట్టు పుచ్చుకుని రెండోదానిమీద నిల్చుంటే రైలుబండి వస్తుంది దాన్నెక్కి కూచుంటే మీవూరు వస్తుంది " అని ముగించారు కుమారస్వామి

అసలు ఇతిహాసం ఏమిటంటే — ఈ రెండో కుర్రవాడు ఉద్యోగార్థం హైదరాబాదు నుండి వస్తూ వస్తూ వో మహారాజశ్రీ నుండి ఉత్తరం పట్టుకొచ్చాడు ఆ ఉత్తరంలో 'ఏమివోయ్ కుమారస్వామీ ఈ ఉద్యోగం ఈ అబ్బాయికివ్వాలస్మీ'—అన్నట్టుగా రాశారు దాని రచయిత . . ఈ లేఖారాజాన్ని కుమారస్వామిగారి టేబిల్‌మీదకు గిరవాటేసి కాళ్లాడిస్తూ కూచున్నాడా కుర్రవాడు. దాంతో ఆయనకు ఒళ్లు మండింది రామారావుపేట వివరా లడిగారు ఆ వూళ్లో అలాటి పేట లేదు

ఇహ మొదటి అభ్యర్థి — ఆ వూరినీ, బడి వాటాన్నీ, అన్నిటికన్నా మిన్నగా పులిలా కన్పించిన హెడ్‌మాస్టర్నీ, చూసి — తన కిక్కడ ఉద్యోగం వెయ్యాలని లేదని చెప్పేసి వెళ్లిపోయాడు

"వెంకయ్యా! ఆ మూడో ఆయన్ని పిలువు"

ఉత్తరం తెచ్చిన కుర్రవాడు నీళ్లు నములుతూ బయటి కడుగు వెయ్యబోగా — "అబ్బాయ్ " అని పిలిచారు కుమారస్వామి "ఇదుగో నువ్వు పట్టుకొచ్చిన ఉత్తరం " అంటూ దానిని అందిచ్చారు

"మూడో ఆయన ! మూడో ఆయనా ! ... మూడో ఆయనోయ్ !" అని వరండాలో నిలబడి ఘోరుమని అరిచాడు వెంకయ్య — మూడో, నాలుగో ఆయనలు రెండూ తన మోచేతికిందే బెంచిమీద కూచుని ఉన్నాయన్న విషయం మరిచిపోయి.

వెంకయ్య తాలూకు శబ్దతరంగాల కడ్డంగా రెండు చెవుల్నోనూ వేళ్లెట్టుకుని లోపలికి వడిచాడు మూడో ఆయన అదే విశ్వనాథం—

కుమారస్వామిగారు అతడిని చూశారు "ఫూ ... తీసెయ్యి ." అన్నారు ఆవూటే మళ్లీ అన్నారు.

"వెంకయ్యా !"

"అయ్ !"

"ఈ అయ్యగారి చెవుల్లో వేళ్లు తీసేయించు"

"చిత్తం "

వెంకయ్య సాయంపట్టేలోపుగా — తన దేహ నిర్మాణంలో ఏదో అపసవ్యంగా ఉన్నట్టు తోచిన విశ్వనాథం — తన చేతివేళ్లను చెవుల్లో నుండి పంట్లాం జేబుల్లోకి బదిలీచేసి . "మీరేదో .. అన్నట్టున్నారే " అన్నాడు

"కూచో నాయనా !" అన్నారు కుమారస్వామి

తాను కూర్చోవడంవల్ల ఆ కుర్చీ కేదో అనవసరమయిన ఘనత వాటిల్లిపోతున్నట్లు, దాని చివరను కూర్చున్నాడు విశ్వనాథం

"నీపేరు విశ్వనాథం కదూ .. ఏం చదువుకున్నావు బాబూ "

"ఎం ఎస్సీ—బి ఇడి "

"అలాగా .. వరయితే 'టైం స్పేస్ కంటిన్యువన్' అని ఈమధ్య ఎక్కడో చదివానోయ్ అలా అంటే ఏవిటో కాస్త చెబుతావా ?"

"హు .. హూ ." అని దగ్గి టైని సర్దుకుని—"టైం ఎండ్ స్పేస్ . ! హహ్హా ! హెచ్ జి వెల్స్ అన్న సుప్రసిద్ధ బ్రిటిష్ మంత్రి మొన్నోచోట మాట్లాడుతూ హు హు హూ . నాకు రెండు మంచినీళ్లిప్పించండి మేష్టారూ ... " అన్నాడు విశ్వనాథం

"వెంకయ్యా ! అయ్యగారికో గ్లాసెడు నిమ్మరసం పట్టా అన్నట్టు విశ్వనాథం . ఈ— 'రెండు మంచినీళ్లు' అన్న వింత ప్రయోగం ఎలా పుట్టుకొచ్చిందో నని ఎపుడయినా ఆలోచించావా—"

"నేను ఇంటర్‌లో ఫ్రెంచి లాంగ్వేజ్ తీసుకున్నానండి ! .... బి. ఎస్సీలో మాకు తెలుగూ అప్పల్లేదూ .... "

"మరే .... "

విమ్మరసం ఇగిరిపోయింది విశ్వనాథంలోకి

"మిస్టర్ విశ్వనాథం ! ఈ ఇంటర్వ్యూ ఫలితం మీకు పోస్టుద్వారా తెలుపగలం

"మరి మీకు టీచర్ తక్షణం కావాలని "

"ఇంటికి చేరేలోపుగా మా ఉత్తరం నీకు అందవచ్చు ."

"ఐస్సీ .. థాంక్ యూ . "

"వెంకయ్యా .. అన్నట్టు విశ్వనాథం ! మా ఉత్తరాన్ని మామూలు ఇంగ్లీషులో రాస్తే చాలనుకుంటాను లేక ఫ్రెంచి తర్జుమాతో పంపమన్నావా ? .... " అని అతి వినయంగా అడిగారు కుమారస్వామి.

విశ్వనాథం జవాబు ఆలోచించేలోపుగా నాలుగో ఆయన్ని ప్రవేశపెట్టాడు వెంకయ్య

గదిలోకి అడుగు పెడుతుండగానే ఆయన— కాశీపతి తన సర్టిఫికేట్లు వగైరా జాతకాన్ని సంచిలోంచి తీసి కుమారస్వామిగారి టేబిల్‌మీద పరిచేశాడు

"నే నిదివరకు ప్రైవేటు టీచరుగా ఆరేళ్లు పనిచేశాను. ట్రెయినింగ్ తర్వాత వో పది నెలలు కావలి మిడిల్ స్కూలు టీచరుగా ఉన్నాను పోయిన సంవత్సరమే నాలుగో ఫారం గైడ్లు రెండు రాశాను "

"వోహో ! ... గైడ్లు రాశావా "

అవునండి ఆ గైడ్లు ఒక్కోటి ముప్పై వేల కాపీలు అమ్ముడుపోయాయి

"అబ్బా ! మరి అంత మంచి గైడ్లు రాయగలిగినవాడివి, కొన్ని చక్కటి పార్యగ్రంధాలు రాయవచ్చుగా . "

ఒకడు రోడ్డు వెంబడే పోతున్నాడు. ప్రక్కనే ఒక చెట్టు మీద ఒక కోతి మనీపర్సు పట్టుకొనిచూస్తూవుంది. అతడు ఆపర్సు ఎట్లయినా సంపాయించాలని అనుకొన్నాడు. ఇంతలో "టోపీల వర్తకుడు, కోతుల కథ" జ్ఞప్తికి వచ్చింది. వెంటనే అతడు తన వద్దఉన్న పర్సు దూరముగా విసరి, కోతికూడా దాని పర్సువిసిరి వేస్తుందేమోనని చూస్తున్నాడు. తటాలున కోతి దిగివచ్చి ఆ పర్సునుకూడా ఎత్తుకొని చెట్టు ఎక్కింది

టి. హరినాథ్ (పుంగనూరు)

"వోస్ పాత్యగ్రంథాలా ... వాటిని అడ్డమయినవాడూ రాయవచ్చు ఆ ఇహ గైడ్స్ అంటారా, అవి రాయడానికి తెలివి కావాలండోయ్ తెలివి ..!! అంతేకాదు మరి రాప్పుమని వో పార్యగ్రంథం రాసిపారేసి పూరోక్కవడానికి పీల్లేదుగా అక్కడినుండి అది బళ్లల్లో పార్యగ్రంథంగా ఎన్నిక కావాలంటే, వసుదేవుడిలా అన్నింటి కాళ్ళూ పట్టుకోవాలి ఆ . ."

తల ఆడించారు కుమారస్వామి . ఆ కుర్రవాడు కాస్త చప్పు డెక్కువ చేస్తాడు, అయినా ఫరవాలేదు కొంత 'ముడినరుకు' ఉంది, పనికొస్తాడు

"అయితే కాశీపతీ ! ఎపుడు జాయినవుతావూ ?

"ఈ క్షణం !"

"నువ్వు నాలుగో ఫారం తీసుకోవాలి ఆ వివరాలు చెబుతాను ... అన్నట్లు నువ్వు హొటల్లో దిగివుంటావేమో కదూ ?—"

"లేదండోయ్ ... బెడ్డింగ్‌ని స్టేషన్‌మాస్టర్ గదిలో ఉంచి, హొటల్‌లో భోజనం ముగించీ "

"సరేలే—. నీకు వేరే గది అంటూ దొరికేదాక మా యిట్లో వుండవచ్చు "

"హి హి హి ! కృతజ్ఞుడివి "

"దానికేం ఫరవాలేదు గాని కాస్త మా కమలతో సర్దుకుపోవాలి దానికి కొత్తవాళ్లంటే తగని బిడియం . కొంత పరిచయ మయేదాక .. అంతేలే"

"వో!" అన్న కాశీపతి గుండె రొట్టెముక్కలా ఎగిరి ఆనందపు నేతిలో పడింది 'కమల . ! ఎంత కమనీయమైన పేరు క . మ ల'

ఇంతలో బయట కలకలం ఎక్కువైంది

"ఇంటరూ ఉంది—ఇంటరూ ! పెద్దయ్యగారికి తీరికలేదు—" లంటూ, 'క్యూ' లో నిల్చున్న తండ్రులనూ తద్ బాపతువారినీ గదమాయించేస్తూ— అవతల వరండాలో రాజ్యం ఏలుతున్నాడు వెంకయ్య.

'ఇంటరూ' అయిపోవడం పసిగట్టిన ఒకానొక ఆల్సేషియన్ జాతి తండ్రి ఒకే లంఘింపుతో హెడ్ మాస్టర్ గదిని సమీపించాడు రావణాసురుడికి నందీశ్వరు డిలా అడ్డుపడ్డాడు వెంకయ్య

"ఏందయ్యా . చెబుతుంటే నీగ్గాదూ ?"

వరండాలోని క్యూ ఎగిరిపోయింది ఆ సభ్యులందరూ ఈగది ముందు పోగయ్యారు. వెంకయ్య ఐసెన్‌హోవర్‌లా ఫోజుగా నిల్చుని అందరినీ క్యూలోకి రమ్మని దబాయిస్తున్నాడు వెంకయ్య గనుక ఆ క్షణాన బడి ఆవరణ దాటి బయటికి వస్తే చాలు , అతణ్ణి అప్పడంలా ఒత్తేసి చిక్కటి ఆముదంలో వేయించేద్దామని వుంది కొందరికి.

ఈలోపుగా ఆ గుంపులోనే ఒకాయనకు హఠాత్తుగా సంఘసంస్కర్త అయిపోదామన్న బుద్ధి పుట్టింది

వెంటనే ఆ సంసం కంఠం సరిచేసుకున్నాడు. " సార్ సార్ . ఇంతసేపూ క్యూలో నిల్చున్నాము కదా కదా ? తీరా సమయం వచ్చేసరికి ఇలా ఇసుకముద్దలా అయి, ఒకరితో ఒకరు ఇరుక్కుపోకుండా వరసగా నిల్చుంటే ఎంత బాగుంటుంది !!" అన్నాడు ఇటూ అటూ చూచాడు. కరతాళధ్వనులు కాదుగదా—కనబొమలైనా ఎగరలేదు—లేదు.

తొక్కిడి అలాగే ఉంది ఆ మూకనుండి బయటికి వచ్చాడు సం.సం

కొంత ఉద్రేకంతో ప్రశ్నించాడు : "అయ్యలారా ! ఇది మనకు తగదు ఊహు తగదు! ఇలా గుంపు చేరడం నాగరికత కాదు—తెలిసిందా— నాగరికత కాదు .... మనమంతా స్వాతంత్ర్య భారతీయులం కామూ ? .... మనమంతా చదువుకోలేదూ !—" అంటూ వో పొడుగాటి, కళ్లజోడు ఆయన్ని చూశాడు

"మీ విషయం నాకు తెలీదు కానండీ, నేను మాత్రం ఎమ్మే పాసయాను" అన్నాడు పొకటో.

కొందరు గొల్లుమన్నారు.

ఇంతలో కాశీపతి నాలుగోఫారం టీచరు కాబోతున్న మొహంతో గది బయటికి వచ్చాడు ..

కాచుకున్నవారిని ఒక్కొక్కరుగా లోపలికి రమ్మన్నారు కుమారస్వామి రెండు చేతులనూ అడ్డంగా జాచి ఇంచుమించు పాతిక జనాభాను సర్దుతున్నాడు వెంకయ్య అందులో ఒక సన్నపాటి ఆయన ఉసుక్కుమని వెంకయ్య చేతిక్రిందుగా జారిపోయి, హెడ్‌మాస్టర్ గదిలోకి వెళ్ళిపోయాడు

ఇది గమనించి వెంకయ్య నోరు తెరవబోయే సరికి, ఆ సన్నటి వ్యక్తి కుమారస్వామిగారి ఎదుట కుర్చీలో కూర్చుని, ఏవో కాగితాలు చూపిస్తూ, నవ్వేస్తూ, మాట్లాడేస్తూ ఉండడం కన్పించింది.

" మరేమీ లేదుసార్ ! మీరు చాల—బోలెడు—మహా గొప్పవారని, మాంచి కృపానిధులని, పుంభావ సరస్వతులని నేను చిన్నప్పణ్ణుంచి నమ్మేవాణ్ణి సార్ ! ఇప్పటికీ నమ్ముతున్నాను సార్ .... ఆమాటే అందరికీ అహోరాత్రాలూ చెబుతుంటానుసార్. అయినా మా ఆదిశేషు ఉన్నాడు చూశారూ వో. మరే .... అన్నట్టు మీరు ఆదిశేషుని చూసి ఉండరేమో .... ఈసారి వాడి ఫోటో వోటి లాగించుకు వస్తాను .... ఈ ఆదిశేషు ఎప్పుడూ కూడా మనుషుల్ని సరిగా అర్థంచేసుకోలేడండి . . వాడంటాడూ మీమీది నా అభిప్రాయం శుద్ధ తప్పుట .... ఉత్త ఆత్మవంచన్ట ! చవలాయి ... వాడా మాట అన్నందుకు నాకెంత విపరీతమయిన కోపం వచ్చిందనీ .. గత పది పన్నెండేళ్ళబాటు నేను విదిల్చిన ముక్కుపొడుమంతా ఖచ్చితంగా వెనక్కిచ్చి మరీ మాట్లాడమని రంచన్‌గా చెప్పొచ్చానుసార్ ... వాడు అంతటితో వూరుకున్నాడా ? లేదు .. "కుమారస్వామిగారు నువ్వన్నంత మంచివారేమీ కాదు—తెలుసా ? చస్తే నీ కొడుక్కి ఆయన బళ్ళో సీటివ్వరు ... ఆ . ఆయనే గనుక మీ అబ్బాయికి సీటిస్తే నేను మున్నగా గుండు చేయించుకుని శాశ్వతంగా తిరుపతి కొండమీదే ఉండిపోతాను —" అని సవాలు చేశాడండీ సవాలూ !! మీ కీర్తికాంత ఆ దుశ్శాసనుడి నోటపడి అలా నలిగిపోతుంటే—ఎలా వూరుకోగలను చెప్పండి . . అంచేత అభిమానంకొద్దీ ఆ ఛాలెంజికి ఒప్పుకుని వచ్చానండి .. నా మట్టుకు నాకేమో మీరు మా అబ్బాయికి అయిదో ఫారంలో (కాంపొజిట్ లెక్కల్తో) సీటు యిచ్చినా ఇవ్వకపోయినా ఒక్కటే సుమండీ .... కాని ఈ పందెంలో గనుక నేను వోడిపోయానా శాశ్వతంగా కొండమీదే ఉండిపోవాలి ఆనక నేను అనక . అది తల్చుకుంటేనే దుఃఖం వస్తుందిసార్ . తప్పకుండా ఈ పోటీలో నన్ను గెలిపించాలి సార్ ... నన్ను నేల నుంచినా, కొండెక్కించినా ఆ భారమంతా మీదేసార్ . ." అని రెండు చేతులూ జోడించి కూచున్నాడు సన్నపాటి ఆయన ...

"ఇతడిని ఐక్యరాజ్యసమితికి పంపకపోవడం మన దేశానికే నష్టం .' అనుకున్న కుమారస్వామిగారు బయటికి నవ్వలేదు—, బయటికి వెళ్ళేటప్పుడు సన్నపాటి ఆయన నవ్వుకుంటూ వెళ్ళాడు

ఆసరికే—అటు నాలుగోఫారం బి సెక్షన్‌లో కాశీపతికి గుడ్లనీరు తెప్పిస్తున్నారు 'నాఫాబిసె' విద్యార్థులు

అటెండెన్స్ వేయడం దగ్గరే మొదలయింది కాశీపతిగారి మేష్టరుగిరీ ఏడో ఎనిమిదో పేర్లు చదివాడు కాశీపతి.

"కమలాకర్ !"

"ప్రెజెంట్‌సార్ !" అని ఒకే స్థాయిలో మూడు గొంతుకలు వినిపించాయి. కాశీపతి తలెత్తి చూశాడు మళ్ళీ పిలిచాడు. మళ్ళీ పిలిచాడు. అదే జరిగింది

"అటెండెన్స్ చెబుతున్నప్పుడు లేచి నిల్చోవాలి " అన్నాడు

"ఎస్ సార్ !" అని అయిదుగురు నిల్చున్నారు.

"నీపే రేమిటి ?" అని మొదటి వరసలోని ఎర్రబ్బాయిని అడిగాడు.

"కమలాకర్ సార్ !"

"నీ పేరూ ?"

---

రాజధానిలో ఒక గొప్ప ఉద్యోగానికి దరఖాస్తు పెట్టి పలుకుబడిగలవారిచే సిఫారసులు చేయించుకొన్న మీదట ఆ ఉద్యోగాన్ని సంపాదించాడొకడు.

కొన్ని సంవత్సరాల తర్వాత, తన పాత అడ్రసునుండి రీడైరెక్టు చేయబడి, వచ్చిందొక కవరు అతనికి! అందులో తను మునుపు ఉద్యోగానికి పెట్టిన దరఖాస్తు వెనుకవైపున "మీకీ ఉద్యోగానికి తగిన అర్హతలు లేనందున దరఖాస్తును తిరస్కరించడమైనదని తెలుపుటకు విచారించుచున్నాను" అని వ్రాయబడి ఉంది.

మరొక విశేష మేమిటంటే ఆ వ్రాత క్రింది సంతకం అతనిదే!

పట్నం వెంకటకృష్ణయ్య (గుంటూరు)

---

"కమలాకరండి !" అన్నాడు మూడో వరసలోని నొక్కుజుత్తబ్బాయి ఆఖరు వరుసలో ఇద్దరూ, నీలం స్వెట్టరొకడూ కూడా కమలాకర్లమే నన్నారు

అటెండెన్స్ రిజిస్టర్‌ను 'అ' నుండి 'క్ష' దాకా చూచారు కమలాకర్ ఒక్కడే ఉన్నాడు కాశీపతికి ఏడుపొచ్చింది

"నాతో ఆటలాడితే ఛావగొడ్తాను—తెలిసిందా ?" అని ఉరిమాడు.

"తెలిసింది సార్ !" అంది ఆ తరగతి నోరు తెరవకుండానే

"ఈ తరగతిలో కమలాకర్‌లు కానివాళ్ళందరూ నిలబడండి !" లెక్కపెట్టాడు ముప్ఫైరెండు మంది నిల్చున్నారు వాళ్ళతో ఇందాకటి అయిదుగురిని కలిపితే ముప్ఫైఏడుగురే అయ్యారు. రిజిస్టర్ ప్రకారం నలభైఇద్ద రున్నారు అంటే అయిదుగురు రాలేదన్నమాట.

"ఇహ అటెండెన్స్ అయిపోయింది .... " అని గంభీరంగా ప్రకటించేశాడు కాశీపతి. ఇంకాసేపుంటే 'ఎందరో మహానుభావులు' పాట వచ్చేపెట్టుంది 'వెధవలు . అగ్గిరాముల్లా ఉన్నారు .... అయినా అయిదుగురు కమలాకర్లా ... ఎంత పొగరూ ! ... అసలేదో నకలేదో తాపీగా కనుక్కోవాలి. వీపు వాచిపోయేట్టు చింతబరికెతో అంటించాలి ... కమలాకర్ . . ఏ మ్మంచిపేరో . ... ఇంతకూ హెడ్‌మేష్టరుగారి కూతురి వయసేవిటో ? ఇరవై ఉండునా ... నోపు . పుండనోపు .... వివాహం అయివుండునా . . అబ్బే ఉండదు .... వివాహం అయివుంటే హాయిగా మొగుడితో ఉండాలిగా .. లేపోతే మొగుడు మిలిటరీ యేమో . . ఛా .... పసిడిమొగ్గలాటి కన్య మీద ఈ వూహాగానమేవిటి ? .. ఏదయితేనేం బుచ్చమ్మ కాకపోతే సరి .... ఆవిడపేరూ కమలేన్ట .... కమల అనేసరికి గుర్తుకు వస్తుంది ... ఏందమ్మా ఆ పద్యం ..... కమలాప్తుని కిరణము సోకిన కిరణము సో—వో—కి—నా కిరణము సో—వో—వో—కి—నా ... కిరణము కోకిన ... కిరణము కోసిన .... వెధవ పద్యం ..'

పీరియడ్ అయిపోయింది అయిదుగురు కమలాకర్‌లూ ముసిముసించారు.

* * * *

ఆరోజు రాత్రి—

పదకొండు గంటలవేళ—

ఆ వీథి నిర్మానుష్యంగా ఉంది. మునిసిపాలిటీ దీపాలు మౌనంగా వెలుగుతున్నాయి మూడో వీధి నుండి గస్తీవాడి 'హారా ఉషార్' బలహీనంగా వినిపిస్తూవుంది ... ఉండుండి వీస్తున్న గాలికి ఒక ఎంగిలాకు ఎగురుకుంటూ పోతూంది ...

హఠాత్తుగా ఆవీథి మలుపు తిరిగాడు ఒక వ్యక్తి .... ఇటూ అటూ చూశాడు ... వీథిలోకి నడిచాడు .... జాగ్రత్తగా అడుగుమీద అడుగు వేయసాగాడు.... అతడి రబ్బర్‌బూట్లు తారురోడ్డుమీద మెత్తగా పడుతున్నాయి .... వో దీపస్తంభాన్ని ఆనుకుని నిలబడ్డాడు . . అతడి బట్టతలమీద ఆ దీపం వెలుతురు, పగిలిన గాజుముక్కలా మెరిసింది కోటుజేబునుండి రుమాలుతీసి మొహం తుడుచుకున్నా డతడు—

అతడి కళ్ళల్లో నీడలు వెలిగాయి—రోడ్డు నిటూ అటూ చూశాడు ... ఎదుటి వరసలో దీపస్తంభా న్నానుకునివున్న పసుపుమేడ నొకసారి పరికించాడు .. ఆ మేడపై అంతస్తు కిటికీమీద అతడి దృష్టి ఆనింది.

కుక్క భౌమంది.

అతడి పంచప్రాణాలూ తారు మన్నాయి.

అబ్బే .... అది కుక్క కాదు ! తన గొంతులో నుండి తనకు తెలియకనే వచ్చిన వింత శబ్దం . .. ఎంత వైపరీత్యం ! అతడు నవ్వబోయాడు. పెదవులు వికృతంగా ముడుచుకు పోయాయి.

## వాణీ నిలయం

అఖరిసారిగా రోడ్డుని తేరిపార జూశాడు గబ గబా ఆ వసుపుమేడ ప్రక్కనున్న దీపస్తంభాన్ని చేరు కున్నాడు. పంట్లాన్ని పైకి మడిచాడు. దీపస్తం భాన్ని కాళ్లతోను, చేతులతోను గట్టిగా పట్టు కుని త్వరత్వరగా పై కెగబ్రాకాడు. కిటికీ ప్రక్కకు చేరాడు. వెచ్చగా ఉన్న దీపపు డిప్పమీద వో పాదం ఆనించి, ఇంకో పాదాన్ని కిటికీమీద ఉంచాడు.

అమ్మయ్య .... వాల్గడుగుల ఎత్తున్న ఆ కిటికీకి ఒకేవూచ అడ్డంగా ఉంది ! .... దిక్కులేనివారికి దేవుడే .......

"పారావుషార్ !"—ఈ వీథిలోకి వచ్చాడు గస్తీవాడు.

గభుక్కున వంగి కిటికీలోకి దూరి గదిలోకి దూకేశాడు ఆ వ్యక్తి.

ధప్పుమని చప్పుడయింది.

ఉలిక్కిపడి లేచారు కుమారస్వామి. మంచం ప్రక్కనే ఉన్న లైటు స్విచ్చి నొక్కారు.

కిటికీకి అతుక్కొనిపోయి, వణుకుతూ నిల్చున్న ఆ కోటు ఆసామీని చూసి ఏదో కేక వెయ్యబోయారు.

ఆ వ్యక్తి రివ్వున వచ్చి ఆయన పాదాలమీద పడ్డాడు ... " సార్ ! సార్ ! .... అరవకండి .... నన్ను కాపాడండి .... నేను దొంగనుకాను .... నేను దొంగను కాను .... " అని రొప్పుతూ లేచి నిల్చొన్నాడు. కుమారస్వామిగారి కళ్ళు ఆశ్చర్యపడ్డాయి. ఈ నాటకం ఘోషకు మంచంకింద పడుకొన్న నల్లపిల్లి లేచింది. అరుస్తూ కుమారస్వామిగారి పాదాలకు ప్రదక్షిణం చేయసాగింది.

వెక్కెక్కి వదులు చేసుకున్నాడు కోటు మనిషి .... గొంతు సర్దుకున్నాడు.

"నన్ను క్షమించండి .... నాకు మీరు తప్ప దిక్కెవరూ లేరు .. నామాట నమ్మండి .... మా అబ్బాయికి మీ బళ్లో నాలుగో ఫారంలో సీటు కావాలి ... మిమ్మల్ని పగటివేళ బడిలో కలుసుకుందామని మూడువారాలనుండి విశ్వప్రయత్నం చేశాను. మీ ప్యూను వెంకయ్య యమకింకరుడిలా అడ్డుపడ్డాడు. వోడిపోయాను ... మిమ్మల్ని చూచి మాట్లాడ్డానికి వేరే దారి కానక ఇలా రాత్రివేళ గోడ ఎక్కి రావలసి వచ్చింది .... ఇది నిజం .... ఇహ మీరేం చేసినా మీ యిష్టం .... నా అదృష్టం .... " అని నమస్కరించాడు ఆ వ్యక్తి ....

నల్లపిల్లి అరుపు ఎక్కువయింది.

"కమలా ! కాసేపు వూరుకో .... " అని దానిని గదమాయించారు కుమారస్వామి. ఇటు తిరిగారు—"మీరా కుర్చీలో కూర్చోండి! కాసిని మంచినీళ్ళు కావాలా ?"—

—ఆ సౌధంబులోనే, వో మూల గదిలో నిద్రపోతున్న కాశీపతి మానసరోవరం నిండా కమలాలు విరిశాయి. 

తిండిగింజలు కూడా యివ్వడంలేదు. అవతల అతగాడు ఆకలితో మాడి పోతున్నాడు. యేంచెయ్యడం?"

దేవయ్యా శ్రద్ధగా విన్నాడు. "సరే మహాబాగు. అతనిని కూడా పోషించండి తప్పదు. అయితే నేం రోజుకో ఇల్లుచొప్పున వారాలు చేసుకోమనండి" అని ఆజ్ఞాపించారు. మహారాజు.

అంతకన్నా వేరేమార్గం లేక పోయింది ఆ ముసలి దెయ్యానికి. ఆప్రకారమే రోజు కొక యింటి చొప్పున వారాలు చేసుకుంటోంది.

చివరికి ఆ క్రమంలో ఒకరోజు వారం దేవయ్యా రాజుగారింట్లో కూడా వచ్చింది. ఆనాటి భోజనం విషయం దేవయ్యాచెల్లెలు మారమ్మ ప్రత్యేకంగా యేర్పాటుచేస్తోంది.

అంతకుముందు కూడా భోజనాల విషయం ఎప్పుడూ మారమ్మ చూసుకొనేది. ఆరోజుల్లో యింట్లో పనిచేసే వాలేరు కుర్రాళ్ళు ఆమెను మోసగిస్తూండేవారు. పొలం పని పూర్తి కాకుండానే వచ్చేసి అన్నాలు పెట్టమనేవారు. అలాంటి వాళ్ళని కనిపెట్టడానికి మారమ్మ ఒకపద్ధతి అవలంబించేది. భోజనాలకి వచ్చేవారి అరచేతులు పరీక్షించేది. అవి మొద్దుబారి, దుమ్ము కొట్టుకున్నట్టుంటే వాళ్ళ కష్టించి పనిచేసినట్టు, శుభ్రంగా మృదువుగాఉంటే వాడు పనిచేయని సోమరిపోతన్న మాట. ఆ ప్రకారం పరీక్షించి కష్టం చేసినవారికి మాత్రమే ముందుగా తృప్తిగా భోజనంపెట్టేది. మృదు పాణితలాల వారికి అఖరినిమిగిలిన మెతుకులు పెట్టేది.

# దేవయ్యా కథ

(27-వ పేజీ తరువాయి)

ఈ విషయం తెలియని ముసలి దెయ్యం భోజనానికి చక్కగా ముస్తాబై మొదటి పంక్తిలో కూర్చుంది. అంతా సిద్ధమయ్యాక మారమ్మవచ్చి అరచేతులు పరిక్షిస్తోంది. ఈదెయ్యం అరచేతిని పరీక్షించి ఒక్క విసరువిసరి కొట్టింది. ఆ అరచేయి, అతి మృదువుగా

⁂

అత్త (కోడలితో): "సుశీలా! ఎందుకమ్మా అన్ని పత్రికలు కొని డబ్బు వ్యర్థం చేస్తావు. ఈ రోజు ఒక్కపిల్ల అనేనా. ముందున్న దమ్మా ముసళ్ళ పండగ." అని ఇంకా ఏదో అంటుండగానే ఆ మాట అందుకొని.

కోడలు:- లేదత్తయ్యగారూ! నేనేమి డబ్బు వ్యర్థం చేయడం లేదు. నా రెండవ తమ్ముణ్ణి ఈ వూరి పోస్టుమాష్టరుగా ట్రాన్స్ఫర్ చేశారు. వాడే ఈ పత్రికలన్నీ పంపాడు అంతే.

కొల్లా వెంకటేశ్వరరావు (గుంటూరు)

⁂

ఎప్పుడూ పనిచేయని దానిలా ఉంది. ఇంతలేసి గోళ్ళు కూడాను. అలా విసరి కొట్టి ఆ తరవాత వారికి వడ్డించింది. ముసలి దెయ్యం మూతి ముడిచి కూర్చుంది. అప్పుడు దేవయ్యా భార్య వచ్చి సముదాయించింది. "జరిగిన దానికి మీరుయేం అనుకోకండి. మా మారమ్మ తీరే అంత. కష్టపడి పనిచేసి వచ్చినవారికే ఆమె ఆదరించి తిండిపెడుతుంది. అయినా ఫరవాలేదు లెండి. ఒక్కక్షణం ఆగితే ఆ మిగిలినది మీారు తినవచ్చు."

అంతటి మహారాజు భవనంలో కూడా తనికి అంత అగౌరవం జరిగినందుకు ఆ ముసలిదెయ్యం తెగ గుంజుకుంది. "ఛీఛీ! ఇదేమి పద్ధతి మహారాజా! మీా దేశంలో ప్రతి వాడు పని చెయ్యాలనే వెధవచట్టం ప్రవేశపెట్టడం వింతగా ఉందే? పని చేయడం అంటే చేతులతోనే పని చేయ్యాలా? అందరూ అలాగే చేస్తారా? తెలివైనవాళ్ళు పనులెలా చేస్తారో మీాకు ఎవ్వరికైనా తెలుసా?"

"మాకెలా తెలుస్తుందండి, తెలివి తక్కువ దద్దమ్మలం. మాపని చాల వరకు చేతులతోటి మూపులతోటీ చేసుకుంటాం."

"మీారు వెర్రి దద్దమ్మలు కనక అలాచేసుకుంటారు. బుర్రతో పని చేయడం ఏలాగో నేర్పుతాను ఆగండి మీాకు. అప్పుడేనా మీాకు తెలిసివస్తుంది. చేతులతో చేయడం కంటే బుర్రలతోచేయడమే ఎక్కువ లాభదాయకం అని."

దేవయ్యాకి ఆశ్చర్యం వేసింది. "అయితే మమ్మల్ని దద్దమ్మ లనడంలో అర్థం ఉందన్నమాట."

ముసలిదెయ్యం యింకా చెప్పకు పోతోంది. "అంతేకాదు. బుర్రతో పనిచేయడం యేమంత సులభం కాదు; నాచెతులు బండబార లేదని నాకు తినడానికి యేంయివ్వలేదా యిరి మీారు. కాని బుర్రతో పని చేయుడం దానికన్నా యెన్నోరెట్లు కష్టంఅని గుర్తించుకోండి. అప్పుడప్పుడు బుర్ర బ్రద్దలై పోతుంది కూడా."

దేవయ్యా ఆలోచనలో పడ్డాడు. చివరికి అన్నాడు "అయితే ఎందుకు

బాబూ అంతయిబ్బంది పడటం? బుర్ర బద్దలై పోతుంటే సుఖంగా ఉంటుందా? అంతకన్నా సులువైన పని చేతులతోటి మూపులతోటి చేసుకోవచ్చును కదా"

"ఇదంతా మీవంటి దద్దమ్మల నుద్ధరించడానికి నా నెత్తిని పెట్టుకున్నాను. ఈమాత్రం యిబ్బందైనా నేను పడకపోతే మీరు యెప్పటికీ దద్దమ్మల్లాగే ఉండిపోతారుమరి. నేనుయింకకు ముందు బుర్రతో పనిచేసి ఉన్నానుకనుక ఇప్పుడు మీకది నేర్పుతాను."

దేవయ్య ఆశ్చర్యానికి అంతు లేకుండా పోయింది.

"నేర్పు! బాబూ నేర్పు! నీకు పుణ్యం ఉంటుంది. అదికూడా నేర్చుకుంటే, ఈ చేతులూ అవీ విరిగితే అప్పుడు బుర్రతో పని చేయడం అయినా పనికివస్తుంది."

ముసలిదెయ్యం తప్పకుండా నేర్పుతానని హామీయిచ్చింది. ఆ ప్రకారమే దేవయ్యా రాజ్యం అంతటా చాటించాడు. ఈ పెద్దమనిషి మనకిబుర్రతో పనిచేయడం నేర్పుతాడు. చేతులతో పని చేయడంకంటె బుర్రతో పనిచేయడం ఎంతో ఉపయోగంట! అందుకని అందరూ వచ్చి నేర్చుకోవలసిందోహో!" అని

ఆ దేవయ్యా రాజుగారి నగరులోనే ఒక ఎత్తయిన స్తంభం ఉంది. దానిపై గలబురుజు దగ్గర దాకా చిన్నని మెట్లు కూడ ఉన్నాయి. దేవయ్యముసలిదెయ్యాన్ని ఆబురుజు పైకి యెక్కించాడు. అక్కడ నుంచి అయితే అందిరికీ బాగా కనిపిస్తుందని.

అక్కడనుంచుని, ఆ పెద్దమనిషి

# దేవయ్య కథ

మాట్లాడడం మొదలు పెట్టాడు. వెర్రివాళ్లంతా ఒకరొకరే పోగవుతున్నారు, చేతులుపయోగించ నక్కరలేకుండా, బుర్రతోటే అన్ని పనులూ చేసుకోవడం ఆ పెద్దమనిషి నేర్పుతాడనే వారంతా విశ్వసించారు. కాని ముసలిదెయ్యం మాత్రం తన ఉపన్యాసంలో పనులుచేయకుండా యెలా బ్రతకవచ్చునో ఘాటుగా చెప్పేస్తోంది.

---

లక్ష్మయ్యను అభినందించడానికి సభ జరిగింది. సభాధ్యక్షుడు వెంకయ్యాగారు ఈ రీతిని ముచ్చటించారు:

"లక్ష్మయ్యగారు పరాయి గ్రామం వారయినా మనవూళ్లో ఇరవై సంవత్సరాల నుంచీ, మన గ్రామాభివృద్ధికై పాటుపడుతున్నారు. ఆయనను మన ఊరి సమాధిలోనే పూడ్చేటట్టు భగవంతుడు అనుగ్రహించు గాక!"

పి. ధనకోటి (పాడిరిపేట)

---

కాని ఈ తెలివితక్కువ ప్రజలకి అదేం బోధపడలేదు. అతని వైపు చూసేవారు; వారిలో ఒకరికొకరు చూసుకునేవారు; విసుగెత్తి ఎవరి పనులమీద వారు వెళ్లిపోయేవారు.

"ఆ ముసలిదెయ్యం అక్కడే నుంచుని రెండోరోజు కూడా తన ఉపన్యాసం కొనసాగించింది. ఆకలిగా ఉండడంవల్ల తినడానికి యేమయినా ఉంటే బాగుండు ననుకుంది. కాని ఆ దద్దమ్మల్లో ఒక్కడికీ తోచనే లేదు. ఆ ఉపన్యాసకుడికి యింత తిండి తీసుకువెళ్లి ఆ బురుజు మీద యివ్వాలని. పైగా చేతులతో కంటే బుర్రతోనే బాగా పనిచేయగల ఆ పెద్దమనిషి యేదోవిధంగా తిండి కూడా సంపాదించకోలేకపోతాడా అని అందరూ అనుకున్నారు.

ఆ విధంగానే ఆ మరునాడూ గడిచిపోయింది. ఆ పెద్దమనిషి అలా మాట్లాడుతూనే ఉన్నాడు. ప్రజలు వస్తూఉంటారు. కొంచం సేపు వినేవారు, తమదోవను తాము పోయేవారు.

## 14

తిరిగి వచ్చే వాళ్ళని దేవయ్య అడిగేవాడు. "ఏమర్రా ఆపెద్దమనిషి బుర్రతో పనిచేయడం మొదలు పెట్టాడా?"

"ఇంకా లేదు ప్రభూ! ఇప్పటి దాకా మాట్లాడుతూనే ఉన్నాడు."

ఆ ముసలిదెయ్యం యింకోరోజు అలాగే అక్కడే ఉంది. కాని నీరసం మాత్రం ఎక్కువైంది. ఇంక ఉండబట్ట లేక తూలిపోయింది. అలా తూలిపడడంలో అతని తలవెళ్ళి ఆ బురుజు స్తంభానికి కొట్టుకుంది. సరిగ్గా అదే సమయానికి అక్కడికి వచ్చిన ఒక తెలివితక్కువ, నాయన అది చూచాడు. ఇంకేముంది? వెంటనే పరుగు పరుగునపోయి మహారాణీవారికి ఈ విషయం చెప్పాడు. మహారాణి, వెంటనే దేవయ్య రాజుగారికి అందచేసింది. దేవయ్య అప్పుడు పొలంలో పనిచేసుకుంటున్నాడు. రాణి అక్కడికి వెళ్ళి, "మహాప్రభూ! రండి రండి. ఆ పెద్ద మనిషి బుర్రతో పనిచేస్తున్నాడట. వారంతా చెబుతున్నారు. చూద్దాం రండి."

దేవయ్యా తెల్లపోయాడు.

"నిజంగా" అని అడిగి వెంటనే గుఱ్ఱం మీద ఆ బురుజు దగ్గరికి వచ్చి చేరాడు. అతను అక్కడికి చేరేటప్పటికి, ఆ పెద్దమనిషి అతి నీరసరంవల్ల నిలబడలేక తూలిపోతూ ఒక్కొక్క స్తంభానికీ కొట్టుకుంటు న్నాడు. దేవయ్య గుఱ్ఱందిగి నేల మీద అడుగు పెట్టేటప్పటి సరిగ్గా ఆపెద్దమనిషి యింక పట్టుదప్పి, అంతయెత్తు బురుజునుంచి క్రిందకి జారిపడ్డాడు. ఒక్కొక్క మెట్టు మీదనుంచి క్రిందికి దొర్లినప్పుడల్లా తలకి ఒకబొప్పికట్టేది. అలా దొర్లి దొర్లి చివరకి దేవయ్య కాళ్లదగ్గరకి వచ్చిపడ్డాడు.

అతని తలమీదనుంచి క్రిందకి ప్రవహించే రక్తాన్ని చూసి దేవయ్య అన్నాడు.

"అయితే ఈ పెద్దమనిషి చెప్పింది నిజమేనన్నా మాట! అప్పుడప్పుడు బుఱ్ఱ బ్రద్దలు కావడమేకాదు అంతకన్నా అసహ్యంగా విచ్చి పోతుందికూడా నేమో! బుఱ్ఱతో యింతపనిచేస్తే మరి ఏమవుతుంది?"

దేవయ్య ఇంకొంచెం ముందుకు పోయి చూశాడు ఎంతవరకు బుఱ్ఱతో పనిచేశాడో సరిగ్గా చూద్దామని. అతను దగ్గరకి రాగానే ఆ ముసలిదెయ్యం అమాంతంగా భూమిని బ్రద్దలుచేసుకుని లోపలికి దూసుకుపోయింది. గుండ్రని కన్నం మాత్రం మిగిలింది.

దేవయ్య బుఱ్ఱ గోక్కున్నాడు. "ఛఛ! వెధవది మళ్ళీవచ్చిందే! ఇది ఆ పిల్లలకి పెద్ద కాబోలు."

* * *

దేవయ్య యింకా బ్రతికే ఉన్నాడు. ప్రజలు మళ్ళీ అతని రాజ్యం లోకి తిరిగివచ్చేశారు. **అతని** సోదరులు కూడా **అక్కడికే** చేరుకున్నారు. వాళ్ళనికూడా అతను పోషిస్తు న్నాడు. "అన్నం పెట్టండిబాబూ" అని ఎవరైనావస్తే చాలు దేవయ్య దానికేం రండి మాతోఉండండి. మాకు బోలెడుంది." అనేవాడు.

అయితేనేం అతని రాజ్యంలో ఒక నియమముంది. అరచేతులు మొద్దుకెక్కిన వాళ్ళకే అన్ని విధాలా సుష్టుభోజనం, అరచేతులు మెత్తగా ఉన్నవారికి ఆఖరిని మిలి గిన మెతుకులే! 

(ఆధారం. టాల్‌స్టాయ్)

ఆ కాస్త సమయాన్నీ వినియోగించుకోవాలని చలమయ్యవర్గంవారు తిప్పలు పడుతున్నారు

మళ్ళీ పోలింగు ప్రారంభమైంది ఓ గంట సేపు మందకొడిగానే జరిగింది ముసలివారు, యువకులు, స్త్రీలతో ఊరుకదలివచ్చిందా అన్న ట్టుంది అక్కడి వాతావరణం

నరసింహప్ప కుటుంబం, చలమయ్యకుటుంబం కూడా వోటు వెయ్యడానికి వచ్చారు

అలివేణి లక్ష్మమ్మని వెంట తీసికొని పోలింగుకు బయలుదేరుతుంటే "నీవు కూడా ఎందుకు— పదిమందిలోకి" అన్నాడు చలమయ్య

అలివేణి నవ్వి "హక్కును వదులుకోడంఎందుకు, నా ఒక్కవోటువల్ల కూడా ఎంతో ప్రయోజనం ఉంటుంది!" అన్నది

"నీకు వేరే చెప్పక్కరలేదుగా—నాపెట్టె గుర్తు ఏమిటో ?" అన్నాడు చలమయ్య

"నాకు తెలియకపోతేగా" అని నవ్వుతూ అలి వేణి లక్ష్మమ్మతో బయలుదేరింది

"కార్లో వెళ్ళు"

"ఉహూ ... ఎంతదూరంవుందని ..." అంటూ వీధిలోకి వచ్చింది అలివేణి

అంతకుముందు ఆమెను చూడని వారందరికీ చక్కటి అవకాశం చిక్కింది ఆమె ఆ ఊరు వచ్చిన తరువాత అది రెండవసారి బయటకు రావడం. మొగవాళ్ళు, ఆడవాళ్ళూ కూడా ఆమెను కొన్ని క్షణాలు కళ్లప్పగించి చూశారు

పోలింగు చురుకుగా సాగుతున్నది

ఒక వృద్ధుడిని ఇద్దరు యువకులు బండీమీద నుంచి జాగ్రత్తగా దింపి నెమ్మదిగా పోలింగ్‌బూతు

# ఆదర్శాలు-ఆంతర్యాలు

(23 వ పేజీ తరువాయి)

లోకి తీసుకువచ్చారు

వెంటఉన్నవాళ్ళు లోపలకు వెళ్ళడానికి వీలు లేదనిచెప్పి ప్రిసైడింగ్ ఆఫీసరు ఆ వృద్ధుడికి చేయూతనిచ్చి లోపలికి తీసుకువెళ్ళాడు

ఆ వృద్ధుడు బైటకువచ్చి "పోలయ్యను వోసారి సూపెట్టండిబాబూ !" అన్నాడు

రంగపాండు ఆ వృద్ధుడిని చురచుర చూశాడు.

"మేం చూపిస్తాం రా తాతా!" అంటూ అతనికి సహాయంగా వచ్చిన యువకులు నెమ్మదిగా తీసుకు వెళ్లారు

"తొందర తొందరగా కానివ్వండి" అని మిగతా వాళ్ళను హెచ్చరించాడు ప్రిసైడింగు ఆఫీసరు

* * *

ఊర్లో జరుగుతున్న తతంగంతో తనకేమీ సంబంధంలేనట్టు మునేరు పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహిస్తున్నది

ఏటి జలాలమీదుగా పైరుగాలి వీస్తున్నది

అప్పుడప్పుడే చీకట్లు ముసురుతున్నాయి

పోలయ్య ఇసుక తిన్నెలమీద వెల్లకిల పడు కున్నాడు

మునేరులాగానే అతని హృదయం ఆనందంతో పరవళ్ళు త్రొక్కుతున్నది

తన చదువు, శారదతో పరిచయం ప్రేమగా మారడం, నిరసనవ్రతంపూని కార్మికులకు ప్రయో జనం కల్పించడం, ఎన్నికలలో నిలబడటం అన్నీ ఒక్కటొక్కటే పోలయ్యలో ముప్పిరిగొని ఆనం దంలో తేలుస్తున్నాయి

ఒక్కొసారి కలలోకూడా అనుకోని సంఘట నలు జీవితంలో సంప్రాప్తమై విచారంలోనో, ఆనందంలోనో మానవుణ్ణి వుక్కిరిబిక్కిరి చేస్తాయి ఆ ఆనందంలో, విచారంలో కొందరు వెర్రివేషాలు వేస్తారు పోలయ్య తన ఆనందాన్ని ప్రకృతికి పంచుతున్నట్టు ఏటిఒడున కూర్చు న్నాడు

"నిజంగా రాజారావుగారు ఈ వూరికి రాకపోతే తనకింత ఆనందం కలిగేదా ? తన వ్యక్తిత్వానికి వో ప్రత్యేకత ఉండేదా ?" అనుకుంటున్నాడు పోలయ్య

"తనను చూచి సంతోషించేవారొకరు కావాలని ఒకప్పుడనిపించింది ఇప్పుడు తననుచూసి నిండు హృదయంతో సంతోషించేవారున్నారు తనకు ఆ దృష్టి ప్రసాదించినవాడు రాజారావుగారైతే దానికి రాణింపు కూర్చేందుకు శారద తనకు లభిం చింది"

ఆలోచనల్లో తేలిపోతున్నాడు పోలయ్య

"తను ఎన్నికలలో తప్పకుండా గెలుస్తానని రాజారావుగారూ, మల్లేశం అన్నారు అయితే తను ఎం ఎల్ ఏ అయిపోతాడన్నమాట ఈ నియోజక వర్గంలోని వారందరి తరఫున ప్రతినిధిగా తను వ్యవహరించాలన్నమాట . తన వూరికి, తన ప్రజలకి ప్రయోజనాలు కల్పించడానికి తను పాటు పడాలి కాని ఎట్లా ? తనమాటకు విలువ ఇస్తారా? వీడేమిటి చెప్పేది అనుకోరూ?" అనుకున్నాడు పోలయ్య

పోలయ్య లేచి కూర్చున్నాడు. "బాగా చీకటిపడి

# ఆదర్శాలు-ఆంతర్యాలు

పోయిందే" అనుకుంటూ లేచి ఇంటిముఖంగా బయలుదేరాడు.

చీకటిలోఅయినా, అలవాటుపడిన డొంకే కాబట్టి చకచక నడుస్తున్నాడు పోలయ్య. డొంకకు ఇరుప్రక్కలాఉన్న దుబ్బులు, చెట్లు గుబుర్లు గుబుర్లుగా ఆ చీకటిలో ఏవో వింత ఆకారాలు దాల్చాయి. పొలాలనుంచి ఏవో పురుగులు 'గీ' 'గూ' అని భయంకరంగా అరుస్తున్నాయి

"ఈ నాలుగురోజులు కాస్త జాగ్రత్తగా మసులుకోవాలిపోలయ్యా" అన్న రాజారావు మాటలు డొంకలో నడుస్తున్న పోలయ్యకు స్ఫురణకు వచ్చాయి

"ఈ చీకటిలో నిర్జీవంగాఉన్న ఈ డొంకలో ఎవరైనా తనమీదపడితే . . చేతిలో బాణాకర్ర కూడా లేదే" అనుకున్నాడు ఆ ఆలోచన రావడంతో పోలయ్యలో కొంత భయం కలిగింది ఆ ప్రదేశమంతా ఎంతో భయంకరంగా తోచింది

"ఏమిటి తనలో ఈభయం ? . . . తనెప్పుడూ భయమనేది ఎరుగడే! పదిమంది రజాకార్లయెదుట తను బాణాకర్రపట్టుకొని నిలబడితే ఒక్కడూ నిలబడలేక పారిపోయారే! అటువంటివాడికి తనకు భయమేమిటి ?" అనుకొని గుండె దిటవు చేసుకొని నడుస్తున్నాడు.

మనసు ఎందుకో ఆందోళనగా ఉంది కారణం లేని కంగారేదో తనలో కలుగుతున్నట్టు అనిపించింది పోలయ్యకు "ఎన్నడూలేనిది తానీరోజు ఎందుకిలా కలవరపడుతున్నాడు" ప్రశ్నించుకున్నాడు ప్రతిదీ నిశితంగా ఆలోచించగల పోలయ్య తాను పొందుతున్న అవస్థకు కారణం వూహించలేకపోయాడు.

డొంకదాటాడు. మామిడితోపు కూడా దాటేశాడు. జగ్గడి సమాధి దగ్గరకువచ్చాడు. ఎందుకో ఆ సమాధిని కౌగలించుకోవాలనిపించింది చకచకవెళ్ళి దాన్ని కౌగలించుకున్నాడు "జగ్గా—నామూలంగా ఆరోజు బలియైపోయావు నీవు లేకపోయినా నీ పిల్లాడికి చేతనైనవిధంగా సహాయం చేస్తున్నాను. వాడిని వృద్ధిలోకి తీసుకువచ్చి నీ ఆత్మకు శాంతి కలిగిస్తా జగ్గా". నిజంగానే జగ్గడిని కౌగలించుకున్నంత అనుభూతితో చెబుతూంటే పోలయ్య కంఠం రుద్ధమైంది. ఆ సమాధిని కౌగలించుకొని లేచేప్పటికి మనస్సు ఎందుకో తేలిక పడినట్టు అనిపించింది. అక్కడినుంచి ఒక శృంగాటకంలోకి వచ్చాడు. "ఒకసారి రాజారావుగారిని చూసి ఇంటికి వెడితే" అనుకున్నాడు. అనుకున్న ప్రకారమే రాజారావు ఇంటిమార్గంపట్టాడు

చీకటి దట్టంగావుంది చీకటిని చీల్చుకొని మిట్టపల్లాలుగాఉన్న రోడ్డుమీద నడుస్తున్నాడు పోలయ్య. వెనుక ఎవరో వస్తున్నట్టు చప్పుడైంది. వోక్షణం ఆగి వెనక్కు తిరిగి చూశాడు. అలికిడి ఆగిపోయింది. "ఎవరూలేరు. . . . పరధ్యానంలోఉండి ఎవరో వస్తున్నారనుకున్నాను" అనుకొని మళ్ళీ నడక ప్రారంభించాడు కొన్నిక్షణాలు గడచేప్పటికి మళ్ళీ తనను ఎవరో అనుసరిస్తున్నట్టు అనిపించింది పోలయ్యకు. అలికిడి దగ్గరగావచ్చి ఆగిపోయింది. "ఎవరక్కడ" గట్టిగా అరిచాడు పోలయ్య. ప్రతినాదంతప్ప సమాధానం రాలేదు. మళ్ళీ ముందుకుసాగాడు సందుమలుపులోకి వచ్చాడు. పోలయ్యను అనుసరిస్తున్నవ్యక్తి చేతిలోని కర్రతో బలంగా తలమీద మోదాడు 'అమ్మా!' అంటూ పోలయ్య నేలకొరిగాడు కొట్టినవ్యక్తి కాలికిబుద్ధి చెప్పాడు

ఆసందుమలుపుకు అయిదారు గజాలదూరంలో ఉన్న ఇంట్లో చదువుతూ కూర్చున్న రాజారావుకు 'అమ్మా' అన్న కేక వినిపించింది. పుస్తకం మూసివేసి లాంతరు తీసుకొని బయటకు వచ్చాడు ఎవరూ కనిపించలేదు , మూలుగు వినిపించింది రాజారావు మూలుగు వినిపించిన వైపుకు లాంతరుతో వెళ్ళాడు. క్రిందపడివున్న పోలయ్యను చూసేప్పటికి కళ్ళు చెదిరిపోయాయి తలనుండి నెత్తురు కుండపోతలా ప్రవహిస్తున్నది పోలయ్య కళ్ళు మూసుకొని మూలుగుతున్నాడు

"ఎంతపనైంది పోలయ్యా—ఒంటరిగా తిరక్కు జాగ్రత్తగా ఉండమని చెప్పాను ఎంత నిర్లక్ష్యం చేశావు నామాట" అని విలపించాడు రాజారావు. పోలయ్య అరుపుకు, మూలుగుకు అప్పటికప్పుడే కొందరు బయటకు వచ్చారు

"ఎవడో ముదనష్టపోడు దొంగపాటుగ వచ్చి తల పగలగొట్టిండు" అన్నాడొకడు

"ఇది ఉడుకుమోతుతనంతో ఆ చలమయ్య చేయించిన పనే" అన్నాడు మరొకడు.

ఇట్లా అనుకుంటూ కూర్చోడంకాదు మన పని. . . . తొందరగా బండి తీసుకురండి—ఆసుపత్రికి తీసుకువెడదాం . . లేకపోతే పోలయ్య మనకు దక్కడం కష్టం" అన్నాడు రాజారావు

బండి వెంటనే సిద్ధం చేశాడు ఒకడు. రాజారావు మరిద్దరి సహాయంతో పోలయ్యను బండీలోకి ఎక్కించాడు పదిహేను నిమిషాలలో బండీ ఊళ్ళోని ఆసుపత్రిముందు ఆగింది కాని డాక్టర్ లేడు ఒకడు డాక్టరింటికి పరుగెత్తాడు.

డాక్టరువచ్చి పోలయ్యకు ప్రథమ చికిత్స చేశాడు.

"బలమైన గాయం. . ఇంతకంటే నేనేం చేయలేను . . ఆసుపత్రిలో తగిన ఏర్పాట్లు లేవు! వెంటనే హైదరాబాదు తీసుకువెళ్లడం మంచిది. లేకపోతే చాలా ప్రమాదం" అన్నాడు డాక్టరు. అందరి ముఖాలూ కళాహీనమైనాయి

"ఇప్పటికిప్పుడు హైద్రాబాదు తీసుకువెళ్ళడం ఎట్లా ? . కారులో అయితే సాధ్యమవుతుంది' కాని కారెట్లా ? . . . ఊళ్లో కార్లున్నవాళ్ళు నరసింహప్ప, చలమయ్యగార్లే ! . . . .వాళ్లను అడగడం ఎట్లా ? . . . .ఇద్దరూ ప్రతికక్షులు. . అయినా నరసింహప్పగారు కొంతనయం. . . తను వెళ్ళి పరిస్థితి చెబితే కాదంటారా ? చలమయ్యంత కఠినుడుకాదు నరసింహప్పగారు , ఆయనలో దయాదాక్షిణ్యాలున్నాయి" అనుకున్నాడు రాజారావు.

"మీరంతా ఇక్కడేఉండండి . . .నేను ఇప్పుడే వస్తాను" అంటూ రాజారావు చకచకబయలుదేరాడు

మరికొంతసేపటిలోనే రాజారావు నరసింహప్పగారి మేడలోకి వచ్చాడు. ఎదురుగ్గా శాయిలు కనిపించాడు.

"శాయిలూ. . . .శాయిలూ. . . .మీ దొరవారు ఎక్కడున్నారు?" ఆదుర్దాగా అన్నాడు

రాజారావు.

"ఏందిబాబూ!. . . అంత ఒగురుస్తున్నారు" అన్నాడు శాయిలు.

"ముందు దొరవారెక్కడున్నారో చెప్పు"

"మేడమీదిగదిలో ఉన్నారుబాబూ ! . . .రండి" అన్నాడు.

శాయిలుమాట వినిపించుకోకుండానే రాజారావు చకచక మేడమెట్లు ఎక్కాడు. అప్పుడే గదిలోంచి బయటకువస్తున్న నరసింహప్పగారు రాజారావును చూసి "ఇదేమిటి?" అనుకున్నాడు ఆశ్చర్యంతో.

"అర్జంటుగా మీ కారు కావాలి! పోలయ్యను ఎవరో చీకట్లో తలపగలగొట్టారు ఆసుపత్రికి తీసుకు వెడితే వెంటనే హైదరాబాదుకు తీసుకువెళ్ళమని సలహా ఇచ్చాడు డాక్టరు! మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను అన్నాడు రాజారావు.

"ఏమిటి ? . . .పోలయ్యను తలపగలగొట్టారా? . . ఎంత దారుణం. . . .అక్కడ పోలయ్యను వదిలి మీరు స్వయంగా రావాలా—ఎవరిచేత కబురుచేసినా నేను కారు తీసికొనివచ్చేవాణ్ణిగా. . . . రండి—పోదాం" అన్నాడు నరసింహప్ప.

"ఏమిటి నాన్నగారూ" అంటూ తనగదిలోంచి వచ్చింది లలిత.

"పోలయ్యను ఎవరో తల పగలకొట్టేశాడు లలితా" రాజారావు స్వరం హృదయం తరుక్కుపోయేట్పుగా ఉంది

"పోలయ్యను తీసుకొని కార్లో హైదరాబాదు వెళ్ళతున్నాంతల్లీ—అమ్మతోచెప్పు" అన్నాడు నరసింహప్ప మెట్లు దిగుతూ

మరి కొంతసేపటిలోనే కారు ఆసుపత్రిముందు ఆగడం, పోలయ్యను ఎక్కించుకొని రాజారావు, మరి ఇద్దరు ఎక్కడం, కారు హైదరాబాదుమార్గం పట్టడం అంతా క్షణాలమీద జరిగిపోయింది

* * *

కారు రయ్యిన పోతున్నది నరసింహప్పగారే స్వయంగా కారు నడుపుతున్నాడు కారువేగంతో పాటు ఆయనలోని ఆలోచనలు కూడా వేగంగా పరుగులు తీస్తున్నాయి "చలమయ్యే ఈపని చేయించి ఉంటాడు. లేకపోతే ఈ వూళ్ళో పోలయ్యను కొట్టవలసిన అవసరం ఎవరికుంది ? అందరికీ పోలయ్యపట్ల సద్భావముంది మిల్లు కార్మికులచేత సమ్మె చేయించినా తన పథకం పారనందుకూ, అది బెడిసికొడితే పోలయ్య పూనుకొని నిరశనవ్రతంతో జయించి మంచిపేరుతెచ్చుకోడం, పైగా ఎన్నికలలో నిలబడటం చలమయ్యకు పిచ్చెక్కించిఉంటాయి ఆ పిచ్చితోనే లోగడ పోలయ్యను రాజారావును హత్య చేయించడానికి ప్రయత్నించాడు అది విఫలమయింది అప్పటినుంచి సమయంకోసం చూస్తూనేఉండి ఇప్పుడు ఈపనికి పూనుకొని ఉంటాడు" అనుకున్నాడు నరసింహప్ప

"తనుమటుకు ఏంచేశాడు ? . . పోలయ్యకు తీరని అన్యాయం చేశాడు తను చెయ్యలేనిపని పోలయ్యకు రాజారావు చేశాడు తనవాడైనా పోలయ్యను పరాయివాడిగా, అంతకంటే హీనంగా చూచాడు తను. అంతకుముందునుంచి ఎలా ఉన్నా, ఆరోజు మిల్లు కార్మికుల విషయమై మాట్లాడటానికి పోలయ్య వచ్చినప్పుడు పోలయ్యలో తనను చూసుకున్నాడు. దగ్గరికి తీసుకోడానికి మనస్సు ఉవ్విళ్ళూరింది కాని తనలోని అహం, బాహిరవాతావరణం, తనస్థాయి, ఆపని చెయ్యనియ్యలేదు.ఆరోజు మునసబు పోలయ్యను దొర కావలసినవాడంటే తను ఉడికిపోయాడు. నిజంగా పోలయ్య దొరబిడ్డ... కాని తనే అన్యాయం చేశాడు." నరసింహప్ప తను చేసిన అన్యాయం స్ఫురించేప్పటికి గత స్మృతులు కెలకవేశాయి

ఇందిరను కనడానికి నరసింహప్పభార్య పుట్టింటికివెళ్ళింది. యౌవ్వనం నుళ్ళు తిరుగుతున్న రోజులవి నరసింహప్పకు.

నరసింహప్ప ఓరోజు సాయంత్రం మునసబుతో కలిసి పొలంనుంచి వస్తున్నాడు. ఒక ఏనాది పడుచు అప్పుడే గడ్డిమోపెత్తుకొని గట్టుమీదకువచ్చి,నరసింహప్పను, మునసబునుచూచి ప్రక్కప్రక్కకుతొలగి తలవంచుకుని నిలబడింది.

నరసింహప్పదృష్టి ఆమెమీదపడింది. ముఖాన కాసంత కుంకుమబొట్టు, ఆకర్షణీయమైన కను ముక్కుతీరు, చూపుల్లోని వాడితనం, ఒడ్డూ పొడుగూఉండి యౌవనం ఉరకలువెడుతున్న యానాది పడుచుమీదినుంచి చూపులు మరల్చలేకపోయాడు నరసింహప్ప. ఆ పడుచు సిగ్గుతో చితికిపోయింది. ఇక అక్కడ నిలవలేక, ఆమె పక్కతోవపట్టి మెరుపులా వెళ్ళిపోయింది మునసబు నరసింహప్ప అవస్థ గ్రహించి లోలోపల నవ్వుకున్నాడు

"ఎవరది?"

"ముసలయ్యకూతురు లచ్చి దొరవారూ. . . . బలే చలాకీదిలెండి. . . .మంచి మనవుకోసం చూస్తున్నాడు ముసలయ్య" అన్నాడు మునసబు.

ఆనాటినుంచీ నరసింహప్పలో తిష్టవేసుకుంది లచ్చిమి "తప్పిపోయి అది ఏనాది కులంలో పుట్టింది కాని కలవారింట్లో పుట్టినట్లయితే ఇంకెంత అందంగా ఉండేదో?" అనుకున్నాడు ఆరోజునుంచీ విధిగా సాయంత్రంపూట పొలంమీదకు పోయేవాడు మునసబు దొరవారి వాలకం కనిపెట్టి "మీరు తలుచుకుంటే అదోలెక్కా" అన్నాడు.

ఆరోజు లచ్చిమి మామూలుగా గడ్డిమోపు ఎత్తుకొని వస్తున్నది అప్పటికే రైతులు, గడ్డిపిల్లలు వెళ్ళిపోయారు పొద్దుపోయిందని లచ్చిమి వడివడిగా నడుస్తున్నది కొంతదూరం వచ్చేటప్పటికి నరసింహప్ప ఎదురైై అడ్డంగావచ్చి నిలుచున్నాడు.

"తప్పుకోండిదొరా!" సిగ్గుపడుతూ అంది లచ్చిమి

"లక్ష్మీ ! . . . .నిన్ను చూస్తుంటే మతిపోతున్నది . . నామాట కాదనకు . . నిన్ను పువ్వుల్లోపెట్టి పూజిస్తాను" అన్నాడు నరసింహప్ప

"తప్పుదొరవారూ. . . నేను ఏనాదిదాన్ని"

"ఆ మాట అనకు లక్ష్మీ ! . . . నీకు ఏ లోపం రానివ్వను" అంటూ చెయ్యి పట్టుకున్నాడు.

"ఇడవండిదొరా . . .మా నాయనకు తెలిస్తే ప్రాణం తీస్తడు. . . కులపోళ్ళు కాకుల్లా పొడిచేస్తారు" అంది లచ్చిమి అలా అన్నదేకాని చెయ్యి విడిపించుకోలేకపోయింది నరసింహప్ప స్పర్శతో ఆమెలో పొంగులువారుతున్నరక్తం ఉడుకెత్తింది. ఏదో కోరిక తలెత్తింది. తలమీది గడ్డిమోపు క్రిందపడిపోయింది. నరసింహప్ప ఆమెను దగ్గరగా తీసుకున్నాడు ఆమె వారించలేకపోయింది. లచ్చిమి చెయ్యిపట్టుకొని ప్రక్కనేఉన్న మామిడితోపులోకి నడిపించుకువెళ్ళాడు నరసింహప్ప చెట్టుచాటునుంచి ఇదంతా గమనిస్తున్న మునసబు ఇక తను అక్కడ దేనికని వూళ్ళోకి వెళ్ళిపోయాడు.

ఆరోజునుంచి లచ్చిమీ, నరసింహప్పలు తరచు కలుసుకుంటూనేఉన్నారు. దాని ఫలితంగా లచ్చిమి గర్భం తాల్చింది. భయపడిపోయింది లచ్చిమి. మేనత్త లచ్చిమి వాలకం కనిపెట్టింది. . . నిజం దీసి అడిగింది. . . లచ్చిమి దాచుకోలేకపోయింది. ఆమె ఒడిలో వెక్కి వెక్కి ఏడుస్తూ జరిగినదంతా చెప్పుకుంది. ముసలయ్య కూతురి వాలకం కనిపెట్టాడు అసలే మంచంలోపడి లీసుకుంటున్నాడు. ఈ బెంగతో ఆరోగ్యం మరీ పాడైంది. "కులపోళ్ళు బతకనిస్తారా లచ్చీ. . . .ఎంతపని చేశావు" అని విలపించాడు. ఆ బెంగతోనే కళ్ళుమూశాడు. లచ్చిమిని బయటకు పోనియ్యకుండా మేనత్త కాపాడుతున్నది. నరసింహప్ప మునసబుతో డబ్బు పంపించి తాలూకా ఆసుపత్రికి తీసుకు వెళ్లమని కబురు పెట్టాడు. ఆపనే చేసింది ముసలిది

లచ్చిమి ఆసుపత్రిలో పోలయ్యను ప్రసవించి కళ్ళు మూసింది.

ఆరోజు నరసింహప్ప లోలోపలే ఎంతో విలపించాడు లచ్చిమి మేనత్తకే కొంత డబ్బుయిచ్చి ఆ శిశువును పెంచి పెద్ద చేయించాడు. పోలయ్యను చూచినప్పుడల్లా నరసింహప్పకు లచ్చిమి మనసులో మెదిలేది పోలయ్యను దగ్గరకు తీసుకోవాలనిఉండేది. కాని సమాజం, తనస్థాయి అడ్డు నిలిచేవి ఈ రహస్యం పరులకు తెలియకుండా మునసబుకు లచ్చిమి మేనత్తకు డబ్బుగుప్పి కాపాడుకుంటూ వచ్చాడు. ఈ కారణంవల్లనే ఆయన మునసబు మాటకు విలువ ఇవ్వడం, అడిగినప్పుడల్లా డబ్బివ్వటం జరిగేది.

* * *

"తనతండ్రి ఫలానా అని తెలిస్తే పోలయ్య ఎలా భావిస్తాడో ? . . . ఎంత బాధపడుతాడో" అనుకుంటూ నరసింహప్ప ఒకసారి వెనక్కుతిరిగి చూశాడు

"ఎంత పెద్దగాయం కాకపోతే డాక్టర్ వెంటనే పట్నం తీసుకుపొమ్మని ఎందుకంటాడు? పోలయ్య ఈ గండంనుంచి బతికిబయటపడ్తాడా?" అనుకునేప్పటికి ఆయన కళ్లల్లో నీళ్ళు నిండాయి

పదకొండు గంటలయ్యేప్పటికి నరసింహప్పకారు ఉస్మానియా ఆసుపత్రి ఆవరణలో ఆగింది.

పోలయ్యను స్ట్రెచ్చరుమీద పడుకోబెట్టి లోపలకు తీసుకుపోయారు. (సశేషం)

మించుగా దాటిపోతున్నది. రవీంద్రుడు వెయ్యి దేవుళ్ళకు ప్రయివేటు మేష్టారు రాకుండా చెయ్యమని మొక్కుకుంటున్నాడు ఇంతలో సరిగ్గా సమయానికి నల్లటిగొడుగు కనిపించింది. రవీంద్రుడి వళ్ళు భగ్గుమండింది. 'రయ్'మని తల్లి దగ్గరకు వెళ్ళి కడుపు నొప్పిగా వుందని చెప్పుకున్నాడు. ఆ తల్లికీ కొడుకు కడుపు నొప్పి ఎల్లాంటిదో తెలుసు అందుచేత ఆవిడ తలెత్తి చూడకుండానే జవాన్ను పిలిచి, మేష్టారిని ఆరోజుకు వెళ్ళిపొమ్మని చెప్పించింది! ఆ మేష్టారికీ గొడుగు గుర్తుయిపోయింది!

బాబయ్యగారు భద్రాచలం వెళ్ళినప్పుడు అక్కడి మంచి కొండవాళ్ళు తయారు చేసిన గొడుగులు పట్టుకుని వచ్చారు. వాటికి మేము అడవి గొడుగులని పేరు పెట్టాము. లోపలంతా ఆకూ, అలమూ పెట్టి పైన సన్నటి బద్దలతో, పేముబెత్తం అల్లికలా తమాషాగా తట్టలా అల్లుతారు దొర టోపీలా వున్నదాన్ని నెత్తిమీద పెట్టుకుని వెళ్ళిపోవడమే కింద వడిపోకుండా, గడ్డం క్రింద కట్టుకోవడానికి చిన్న తాడొకటి వుంటుంది. పట్టుకోవడానికి కాడా, గీడా వుండదు

మా చిన్నతనంలో రంగు రంగుల పువ్వుల సిల్కు గుడ్డలతో తయారు చేసిన గమ్మత్తయిన గొడుగులు జపానునుండి వచ్చేవి. ఇవి కేవలం విలాసానికే గాని, వుపయోగానికి పనికిరావు ఇవి చాలా అందంగా వుంటాయి చిన్నప్పుడు, గొడుగువేసుకోమంటే నల్ల

(21వ పేజీ తరువాయి)

గొడుగు నచ్చక, ఈ పువ్వుల గొడుగులే వేసుకునే వాళ్ళం. సర్కసుఫీటులో పువ్వుల గొడుగులు వేసుకుని, తాడుమీద నడిచే ఫీటుతప్ప మాకేదీ నచ్చేదికాదు! ఎల్లాగూ అల్లాంటి గొడుగులు మనకూ వున్నాయి కదాని, చేంతాడుమీద ఆఫీటు చెయ్యబోయి మోకాళ్ళు చెక్కుకుపోయి, చీవాట్లుతిన్నరోజులూ వున్నాయి! ఇప్పుడిప్పుడీ గొడుగులు మళ్ళా వస్తున్నాయట!

ఆమధ్య పోస్టుమాన్లపని మరీ పైలావచ్చీసుగా వుండేది! ఏడాదికో గొడుగు సప్లయిచేసేవారు. దాంతో కొందరు గొడుగుల గుత్త వ్యాపారం ప్రారంభించారు ప్రభుత్వం పసికట్టి ఏటికేటికి సప్లయి చెయ్యడం మానేసి రెండేళ్ళకో, మూడేళ్ళకో యివ్వడం ప్రారంభించింది దేవుడికి కూడా సింహాసనంతో పాటు, బంగారుదో, వెండిదో 'ఛత్ర' మొకటి చేయిస్తారు వినాయకుడికి గొడుగులేందే పూజ గడవదు

అత్తయ్య అనంతపురం నుండి వస్తూ, జాకెట్టు గుడ్డొకటి పట్టుకొచ్చింది తీరాచూస్తే ఆగుడ్డనిండా గొడుగులే అద్దకం వాడికి గొడుగు జ్ఞాపకం వచ్చింది కాబోలు! గొడుగులు అద్దాడు! ఒహో! ఎన్ని గొడుగులు! ముడిచిన గొడుగులు, తెరచిన గొడుగులు! గొడుగుమీద గాఢ భక్తిగల మేమూ గుడ్డకోసం ఘోరంగా గుద్దులాడుకున్నాం. అక్కయ్య హడలిపోయి "అది అరగజమేనర్రోయ్" అని అరిచింది దాంతో గోడు గోడున ఏడుస్తూ, గొడుగుల గుడ్డను పాపాయికి యివ్వకతప్పిందికాదు!

పడగ గొడుగు ప్రతిభావంతులకుగాని పట్టదు !

అనాదినుండి గొడుగులు హిందూదేశములోనూ, తూర్పుదేశాల్లోనూ వాడకంలో వున్నాయి కాని పాశ్చాత్య దేశాల్లో యివి క్రీ వె 1700 లోనే ప్రవేశించాయి 'జాన్స్‌హాన్‌వే' అనే యూరోప్ దేశస్థుడు, తూర్పు దేశాల్లో పర్యటిస్తూ, విదేశపు వింతల్లో ఒకటిగా యీ గొడుగును తనతోపాటు తీసుకుపోయాడు ఆ గొడుగు వేసుకుని గొప్పగా వీధుల్లో తిరుగుతుంటే, విదేశీయులంతా నెత్తిమీద ఆ గుడ్డేమిటని పరిహసించారు కొందరు కొంటె కోణంగులు రాళ్ళు కూడా రువ్వేవారట కాని అతడు వీటిని లక్ష్యపెట్టకుండా రోజూ గొడుగు వేసుకునే తిరిగేవాడు గొడుగు వుపయోగాన్ని గుర్తించడానిక్, విదేశీయులకు వెక్కిరించినంత కాలంపట్టలేదు! దడదడా గొడుగులు వుపయోగంలోకి వచ్చేశాయి

కూడు గుడ్డతోపాటు ప్రతి మనిషికి గొడుగూ వుండాలి!

ఈ గడ్డురోజుల్లో ఏ యెండకా గొడుగు పట్టకపోతే బ్రతకడం కష్టం!

ధర సింహాసనంబు, నభంబు గొడుగు! ★

---

దిడ్డంగా పాకుతున్న మనసుకి పెద్ద ఆధారం దొరికినట్లయింది కానీ యిదంతా వాసంతికి తెలియదు. సంభాషణలో మూడొంతులు వాసంతివే వుంటాయి. ఒక వంతులో సగం శేఖరం నవ్వుతూ వుంటాడు. జీవిత తటాకంలో ప్రశాంతతనిపొందిన నీరు తేటగా తేరుకోసాగింది పాత అనుభవాలు అడుక్కువెళ్ళిపోయినాయి పూర్తిగా ధైర్యం కలిగింది అమ్మయ్య అనుకుంటున్న సమయంలో మళ్ళీ రాయి విసరబడింది అమూల్య వచ్చింది ఈసారి నీళ్ళ మలినం అవుతే తేర్చటం తనకి సాధ్యంగాదు అందుకే శేఖరం భయపడుతున్నాడు అతన్ని మరీ మరీ బాధిస్తున్న విషయం తనమీద అమూల్య ప్రభావం పూర్తిగా పోయిందనుకున్నాడు కానీ అదేంలేదు తాత్కాలికంగా ప్రక్కకుజరిగి ఒదిగివుంది సమయం చిక్కగానే మళ్ళీ వురుకుతోంది పైదకి అదీ బాధిస్తున్న విషయం

చాలాసేపట్నుంచీ యేవేవో చెప్తున్నాడు శేఖరం అతని గుండెలమీద అలాగే పడుకుని వింటోంది వాసంతి చెవిదగ్గర టకటకమని గడియారంలా కొట్టుకుంటున్న అతని గుండె—ఒక్కోసారి బాధగా, మరోసారి కోపంగా—యింకోసారి అతి బాధగా రక రకాలుగా మారుతున్న కంఠస్వరం, గదిలో బెడ్‌లాంప్‌నుంచి లేత నీలంగా వస్తున్న కాంతి అదోరకంగావుండి గదిలో వస్తువుల్ని తమాషాగా చేసి చూపుతుంది యివన్నీ కలిసి వాసంతికి యిదంతా అబద్ధం మాయ—శేఖరానికి యింత వెనక గాథ వుండటం యేమిటి సచ్చి అబద్ధం అన్పిస్తోంది. నిజంగానే కథలా వుంది.

# అమూల్య

(20-వ పేజీ తరువాయి)

"నిజం వసూ! నా కిప్పుడు తేలికనిపిస్తోంది నిజంగా నేనింత బాధపడవలసిందిగాని, భయపడవలసిందిగాని లేదేమోకదూ యేమిటి నిద్రపోతున్నావా' ఒక్కమాట గూడా మాట్లాడలేదు యింతసేపట్నుంచి, చెప్పు'—భుజాలుపట్టి లేవదీస్తూ అన్నాడు శేఖరం

"లేదు లేదు మీరు చెప్తున్న కథ వింటున్నాను" నీరసంగా మళ్ళీ అతని గుండెలమీదకి తలవాలుస్తూ అంది వాసంతి శేఖరం మాట్లాడలేదు. తను తొందరపడ్డాడేమో. వాసంతికిది అర్థం అవుతుందా? చెప్పకుండావుంటే బాగుండేదేమో. అతని చేతులు వాసంతి జుట్టును—బుగ్గల్ని అప్యాయంగా నిమురుతూ వుండిపోయినాయి మనసు హఠాత్తుగా—వేగంగా ఆలోచించసాగింది లేదు లేదు తనమీద అమూల్య ప్రభావానికి బలమేలేదు వాసంతి తనప్రక్కనుంది వాసంతితో జీవితం ముడిపడిపోయివుంది. వాసంతికోసం తను కాని—అమూల్యకోసంకాదు లోకంలో యితరులలో అమూల్య ఒకటి అమూల్య వచ్చి యెదురుగా కూర్చున్నా తను చలించడు అవును నిజం. అమూల్యకి తనంటే యేమిటో యింకా బాగా తెలియాలి వాసంతితో కలిసి ప్రస్తుతం తను అనుభవిస్తున్న జీవితాన్ని చూసి యీర్ష్యపడాలి. తనని గురించి ఆలోచించేందుకు ఒక్క సెకను గూడ ఖాళీ కాకుండా వాసంతి ఆక్రమించుకుందని తెలియాలి తను అనవసరంగా ఖంగారు పడుతున్నాడు. యిది మంచికే వచ్చింది ఒకవేళ యెప్పటికీ అమూల్య యిక్కడేవుండిపోవటం తటస్థిస్తే తను యీ వూరునుంచి ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వెళ్ళిపోతాడు. ట్రాన్స్‌ఫర్ కుదరదు, చెయ్యము అంటేనా వాసంతిని తీసుకుని యింకెక్కడికైనా వెళ్ళిపోతాడు. అంతేగాని గాని అమూల్యని వాసంతి నీడ గూడ తొక్కనివ్వడు. ఆలోచిస్తున్న అతను పరధ్యానగా మరింత గుండెల దగ్గరికి లాక్కున్నాడు

'నే నొకటి అడగనా?' చాలా సేపటికి మొదటిసారిగా మాట్లాడుతూ అతి నీరసంగా అంది వాసంతి.

'యేమిటది చెప్పు ఇహనుంచి నీకు తెలియని విషయమంటూలేదు'

'ఆమె తిరిగిరావటం మీకేమన్నా అన్పిస్తోందా?'

'అంటే?' అర్థంగానట్లు వాసంతి కళ్ళలోకి చూస్తూ అడిగాడు

'అంటే యేంలేదు నన్ను పెళ్ళి చేసుకోవటంలో త్వరపడ్డాననిపిస్తోందా—మీకు చెప్పండి నేను వేరుగా—పరాయిగా అన్పించటం లేదుగదూ' యిన్నాళ్ళ మన జీవితం యేంకాకుండాపోదుగా మీకు'

'యేమిటి నువ్వనేది?'

'మీరు పడేబాధ చూస్తుంటే ఆమెమీద మీకింకా అభిమానం వున్నట్లేవుంది ఆవిడంటే లెక్కలేనట్లేవుంటే మీ రసలు బాధ పడనేపడరు'

'నీమొహం. అదేంకాదు ప్రపంచంలో నాకున్నది ఒక్కరే అది వాసంతి ఆ వాసంతికి నాకూ మధ్య అడ్డుగా యేదీరాదు. వాసంతి తనంతతాను

వన్నక్కర్లేదంటేతప్పు. నువ్వు చాలా అలసిపోయావు యిహ పడుకో! నీ కసలిది చెప్పివుండకూడదు నేనొట్టి మూర్ఖుడ్ని చూడు నీ మొహంలో యిందాకటి చిరునవ్వులేదు. కళ్ళు గూడ అనుమానంగా భయంగా వున్నాయి. నువ్వు నన్ను నమ్మకపోతే నేనేం చెయ్యలేను వాసంతి. ఆవిడ నాకేంకాదు ప్రపంచంలోవున్న లక్షమందిలో ఆవిడ ఒకత్తి. నువ్వు అనవసరమైన ఆలోచన్లతో మనసు పాడు చేసుకోనని నాకు మాట యివ్వాలి నీ ఆరోగ్యం అసలే సరిగ్గాలేదు ఈ రెండు రోజుల్లో చాలా తీసినట్లు కన్పిస్తున్నావు డాక్టర్ సుశీల వచ్చిందా? యేమంది? వసంత చేతుల్ని తన బుగ్గలికి, కళ్ళకి అన్చుకుంటూ అడిగాడు శేఖరం. ఆఖరిమాటకి వాసంతి మొహంలోకి వెచ్చటి ఆవిరి వచ్చింది. యెలా చెప్పటం అతనికి. ఇప్పుడా—యిలాగా—ఊహు కాదు యిప్పుడు గాదు అనుకుంటు 'పరీక్ష చేసింది. రేపు మీరు ఫోన్‌చేసి అడగండి—' అంది.

'అదేం ? నీకు చెప్పలేదూ.'

'చెప్పలేదు.' అంది వాసంతి నిర్లిప్తంగా.

తెల్లవారుఝామైంది. చల్లటిగాలి కిటికీలోంచి దూసుకొస్తోంది బాగా అలిసిపోయిన యిద్దరూ నిద్రకు ప్రయత్నం చేయసాగారు.

మర్నాడు వాసంతి లేచేసరికి బాగా బారెడు పొద్దెక్కింది. తెల్లగా బాగా మెరుస్తున్న యెండ కిటికీ చువ్వల్ని దూకుకొచ్చి లోపల డ్రాయరు, కుర్చీ, పుస్తకాలు వాటిమీద పట్తోంది. మంచంమీద బద్ధకంగా బరువుగా కళ్ళు తెరిచిన వాసంతికి అంతా కలలో యేదో పెద్ద గొడవజరిగి తను స్పృహ తప్పిపోయినట్లు అన్పించింది. క్షణంసేపు రాత్రి జరిగింది, శేఖరం చెప్పింది అంతా వట్టి కలేననిపించింది. ప్రక్కకు తిరిగిచూసింది కానీ శేఖరంలేడు వళ్ళంతా బరువుగా బాధగా వుంది. జ్వరం తగిలిందని థర్మామీటర్ చూపింది.

వాసంతి లేచి యివతలకు వచ్చేసరికి శేఖరం హాల్లో కూర్చుని కాఫీ తాగుతూ పేపరు చూసుకుంటున్నాడు మామూలు ప్రకారం అతని స్నానం అయిపోయింది వాసంతి మెల్లగావచ్చి శేఖరం కుర్చీ ప్రక్కన నిలబడింది 'మెలకువ వచ్చిందా? కళ్ళు చాలా యెర్రగా వున్నాయి. యింకొంచంసేపు పడుకోకబోయావా—నిద్ర చాల్లేదులావుందికదూ?' నవ్వుతూ చెయి తీసుకుని యేదో చెప్పబోతున్నాడు శేఖరం. హఠాత్తుగా వాసంతి వంగి మోకాళ్ళమీద కూర్చుని అతని చేతుల్లో మొహం దాచుకుని యేడుస్తూ 'రాత్రి చెప్పిందంతా అబద్ధం కదూ! అబద్ధం అని చెప్పండి నాకు నాకోదో భయం వేస్తోంది' అంది.

శేఖరం క్షణంసేపు మాట్లాడలేదు. తర్వాత చాలా తగ్గుస్థాయిలో చాలా నిశ్చలంగా నెమ్మదిగా 'అవును అంతా అబద్ధమే నీకు కల్పించి చెప్పానులే రాజువాళ్ళు వస్తారు వెళ్ళి మొహం కడుక్కుని రా! యిదేమిటి—వేడిగావుందే వళ్ళు—జ్వరం వచ్చిందా.' హఠాత్తుగా ఆదుర్దాగా చేయిపట్టి లేవదీస్తూ అన్నాడు

వాసంతికి జ్వరం బాగానే వచ్చింది. డాక్టర్ సుశీలకి ఫోన్ చేసాడు ఆవిడ డ్యూటీమీదవుందని—సాయంత్రంగాని రాలేనని యెవరిచేతో చెప్పించింది. ఆరోజు శేఖరం ఆఫీసు మానేశాడు వాసంతి ప్రక్కనే కూర్చుని చాలా మామూలుగా అవీ యివీ చెప్తూ తమాషాలుచెప్పి నవ్విస్తూ కూర్చున్నాడు. వాసంతిని విడిచి కనీసం ముందుహాల్లోకిగూడ వెళ్ళలేదు. యిష్టంలేకపోయినా శేఖరంకోసం చారూ అన్నం తింది వాసంతి.

బాగా పన్నెండయింది. తన మంచంప్రక్కన వాలుకుర్చీలో కూర్చుని యేదో పుస్తకం తిరగేస్తున్న శేఖరాన్ని వున్నట్లుండి అడిగింది. 'ఆవిడ సుకన్యాదేవికి తప్ప యిక్కడ యింకెవ్వరికీ తెలియదా?' అని. 'తెలియదు. నువ్వింక ఆ ప్రసంగం యెత్తొద్దు గంభీరంగా అన్నాడు శేఖరం పుస్తకం తిరగేస్తూ.

వాసంతి ఆపైన మాట్లాడలేదు. శీతాకాలపు మధ్యాహ్నం 12 గంటలు దాటుతుండగానే యెండ తిరిగిపోతోంది. సన్నగా వీస్తున్న గాలికి గుమ్మానికున్న కర్టెన్ కదులుతోంది. గదిలో గోడమీద పాకిన వాటర్‌ప్లాంట్ ఆకుల్ని కిటికీలోంచి వచ్చిన పిచ్చిక ఒకటి పొడిచి తుంపాలని ప్రయత్నం చేస్తోంది. మధ్యాహ్నం చాలా దిగులుగా యేదో పోగొట్టుకున్న దానిలావుంది. మోచేయి దిండుమీద ఆన్చి పడుకుని



గురువు:-రాస్కెల్! కొంచెం కూడా తెలివిలేనట్లుందే! పశువుతో సమానంగా వున్నావు.

బాలుడు:-ఆవిధంగా తిట్ట కూడదు సార్. మీరు మా గురువులు గదా!

జి. వి. శ్రీధర్ (మద్రాసు)



చేతిలో పుస్తకాన్ని తిరగేస్తోంది వాసంతి యేదో చప్పున అయిపోయి జరగవలసిందేదో జరిగిపోతే బాగుండుననిపిస్తోంది. నాటకంలో సీనుకీ సీనుకీ మధ్య యింటర్వల్‌లా వుంది. ఇంతలో ఫోన్ మోగింది. 'సుశీల' అంటూ శేఖరం లేచివెళ్ళి రిసీవర్ తీసాడు. అంతవరకూ పుస్తకం తిరగేస్తున్న వాసంతి కళ్ళెత్తి అతని మొహంలో మారబోయే భావాలకోసం పరీక్షగా చూస్తోంది. సుశీల చెప్పబోయేదేమిటో వాసంతికి తెలుసు. కానీ యిప్పుడీ సమయంలో—యిలా—సుశీల చెప్పకుండావుంటే బాగుండు. అసలు యింకెవరయినా అయితే బాగుండునని పిస్తోంది.

'హలో' అన్నాడు శేఖరం రిసీవర్ తీసుకుని

'. . . .' అవతలనుంచి యే స్వరం విన్పించిందో యేమని విన్పించిందో తెలియదు. కానీ హఠాత్తుగా శేఖరం మొహంలో గబగబా రంగులు మారాయి కంఠస్వరం గూడ మారింది. ఫోన్ వైర్‌ని చేత్తోసాఫ్‌చేస్తూ చాలా గంభీరంగా మాట్లాడడం మొదలు పెట్టాడు. 'ఇందులో క్షమార్పణ ఏమీలేదండి రాత్రి నా ప్రవర్తనకి నేనే చెప్పుకోవాలి యేదయినా ముందుగా కొంచం యేమాత్రం తెలిసినా అలాటి సంఘటన జరిగేదికాదు ఇందులో మీకు తెలియని రహస్యం యేంలేదు''

'. . . . . . .' మళ్ళా అవతలనుంచి యేదో విన్పించింది.

'అబ్బెబ్బె' మీమీద కోపం యెందుకు? యేమిటి? మాట్లాడాలంటోందా? క్షమించండి మా యిద్దరికీ గతమేతప్ప భవిష్యత్తు లేదన్నానని చెప్పండి. యెప్పుడూ యెలాటి పరిస్థితుల్లోనూ మామధ్య మాట్లాడవలసిన మాటలేంలేవు. ముందు నా యీ ప్రశ్నకు జవాబు చెప్పండి ప్రసాద్ కిక్కడకి ట్రాన్ఫర్‌అయిందా!. . . . అహా! అలాగా! నేను ఒకవేళ ట్రాన్ఫర్ అయిందేమో అనుకుంటున్నాను. ఇందులో మీ దగ్గర దాచవలసిందేమీలేదు. ఒకవేళ వాళ్ళు వుద్యోగరీత్యా యిక్కడికివచ్చినట్లయితే నేను రేపే ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వెళ్ళిపోదాం అనుకుంటున్నాను మేం యిద్దరం ఒక వూళ్ళోవుంటూ తెలియకుండా వుండటం అసంభవం.

'. . . . . .'

'ప్రస్తుతం వాసంతికి తెలియని విషయం అంటూ లేదండి. నిన్నరాత్రివరకు తెలియదు కానీ మీయింటి దగ్గర్నుంచి వచ్చింతర్వాత అంతా చెప్పేసాను ఇప్పుడు నాకు చాలా తేలికగావుంది'' నిట్టూర్పు విడుస్తూ అన్నాడు శేఖరం మంచంమీద కూర్చున్న వాసంతి రెప్పవాల్చటంగూడ మర్చిపోయి తదేకంగా భర్తని గమనిస్తోంది

'లేదండీ! మీరు గట్టిగా చెప్పండి, మాకు కలుసుకోవాల్సిందిగాని, మాట్లాడుకోవాల్సిందిగాని యేమీలేదని నేను వుంటాను. అవును ఆఫీసుకు వెళ్ళలేదు. వాసంతికి ఒంట్లో బాగాలేదు ఫోన్ చప్పుడు చేస్తూ పెట్టేసాడు శేఖరం. అంతవరకు శేఖరంవంక పరీక్షగా చూస్తున్న వాసంతి చప్పున తలతిప్పుకుని కిటికీలోంచి బైటకు చూస్తున్న దానిలా కూర్చూండిపోయింది

తిరిగివచ్చి కుర్చీలో కూర్చున్న శేఖరం చాలాసేపటి వరకూ యేం మాట్లాడలేదు పుస్తకం తిరిగేస్తూ యేదో ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు వాసంతి గూడ యేం మాట్లాడలేదు నాలుగుదాటిపోయింది. రాజు తెచ్చి కాఫీ యిస్తుండగా శేఖరం తనే అన్నాడు. 'ఇదుగో చూడు రాజూ! దబ్బున యేదయినా టిఫెన్ చెయ్యి లేకపోతే బజారుపోయి యేవైనా పళ్ళు తీసుకురా! కాఫీచేసి ఫ్లాస్క్‌లో పోసివుంచు. మేం అలా డ్రైవ్‌కి పోతున్నాం. తిరిగివచ్చేసరికి కొంచం ఆలస్యం అవుతుందేమో!' రాజు సరేనని తలూపి వెళ్ళిపోయాడు. వాసంతివైపు చూడకుండానే కాఫీ తాగుతూ 'నువ్వు త్వరగా తయారు కావాలి వసూ' ఇలా యింట్లో కూర్చోవటం నాకు బాగాలేదు అలా హిమాయిత్ సాగర్ పోదాం. రాజుని క్యారియర్‌తో భోజనం కూడ పెట్టమంటాను కారులో యీ రాత్రికి తిరిగి రావద్దు. నువ్వు కొంచం మొహం కడుక్కుని బట్ట తేసుకో!' శేఖరం మాటలు సాంతం పూర్తికాక మునుపే టెలిఫోన్ మోగింది. కాఫీ తాగుతున్న శేఖరం ప్రశ్నార్థకంగా ఫోన్‌వైపు చూసాడు కాఫీతాగటం మానేసినవాసంతి శేఖరం మొహంలోకిచూడ సాగింది.

కాఫీతాగడం పూర్తిచేసి నిదానంగాలేచి వెళ్ళి రిసీవర్ తీసుకొన్నాడు ''హలో'' అంటూ

# అమూల్య

వాసంతి చేతిలో కప్పు అలాగే పట్టుకుని భర్త మొహంలోకి మళ్లీ రెప్పవాల్చకుండా చూడసాగింది.

'యెవరు?' కొంచం కటువుగానే అడిగాడు శేఖరం.

'......'

'ఓ! డాక్టర్ సుశీలా! నమస్తే. నమస్తే అయిందా డ్యూటీ' శేఖరం మొహం ప్రసన్నమైంది అంతవరకు చూస్తున్న వాసంతి చప్పున దృష్టి అంతా కాఫీమీదకు మరల్చుకుని జాగ్రత్తగా తాగుతున్నట్లు తాగసాగింది. యిప్పుడా యిప్పుడా — వాసంతి గుండెలు కొట్టుకొంటున్నాయి

'యేమిటీ— బహుమతా — బహుమతేమిటి? అహ—వాసంతి నాకేం చెప్పలేదే—' వెనక్కు తిరిగి వాసంతివైపు చూస్తూ అన్నాడు అప్పటికే కాఫీ తాగడం పూర్తిచేసిన వాసంతి కప్పు వంగి క్రిందున్న స్టూలుమీద పెట్టేసి పుస్తకంలో తలదూర్చుకొని బొమ్మలు చూడసాగింది

'అడగమంటారా?' ఆగండి అయితే— మౌత్ పీస్‌ని అరచేత్తోమూసి 'సుశీల తనకి బహుమతి రావాలంటుందేమిటి వసూ—దేనికి?' అన్నాడు

'యేమో నాకు తెలియదు. ఆవిడనే అడగండి. రక్తంఅంతా ఒక్కసారి మొహంలోకి వచ్చేసినట్లున్న యెర్రబడిన మొహాన్ని మరింత దించేసుకుంది వాసంతి

'మిమ్మల్నే అడగమంటోంది' మళ్లీ ఫోనులో మాట్లాడ్తూ అన్నాడు శేఖరం

'ఆ! యేమిటి సరిగ్గా వినపడడంలేదు ఓ! యేమిటి మీరనేది నిజం సుశీల చెప్తోంది నిజమేనా వసూ. వెనక్కుతిరిగి అడిగాడు శేఖరం. పుస్తకంలో మొహం దించేసుకుంది జవాబుగా వాసంతి

'థ్యాంక్సు సుశీలా మీకు స్పెషల్ పార్టీ యిస్తానని ప్రామిస్ చేస్తున్నాను నేను వుంటాను' ఫోన్ పెట్టేశాడు శేఖరం

ఫోన్ పెట్టేసిన శేఖరం వెంటనే పరుగెత్తుకుని దగ్గరకు వచ్చెయ్యలేదు క్షణంసేపు అలాగే నిలబడిపోయి భార్యనిచూసి ఆ తర్వాత నెమ్మదిగా వచ్చి మంచంమీద ప్రక్కగా కూర్చున్నాడు.

"నిజమా వసూ! నాకింతవరకూ చెప్పలేదేం?" తన భుజం చుట్టు చెయ్యివేసి అడుగుతున్న శేఖర్ మాటలు వింటూనే వాసంతి చప్పున పుస్తకం వదిలి అతని ఒళ్లో తలదాచుకుంటూ 'రాగానే చెప్పాలనుకున్నాను కానీ ఛైవ్స్ దొరకలేదు అందులో యీ గొడవలో అసలెలా చెప్పాలో తెలియలేదు'

'నాకోసం నువ్వింత మంచివార్త దాచుకొనివుంటే నేను నిన్నెంత బాధించానోకదూ! క్షమించు వాసంతి' యేదో అనబోతున్న శేఖరాన్ని చేత్తో వారిస్తూ "ముందు నాకిది చెప్పండి. మీకెలా అన్పిస్తోంది సంతోషంగాలేదూ!"

'దానికి జవాబు కావాలంటే నువ్వు తలెత్తి కళ్ళు తెరిచి నా మొహంలోకి చూడాలి.' అదోరకంగా మారిపోయిన కంఠస్వరంతో అంటున్న భర్తకేసి తలతిప్పి కళ్లు తెరిచి చూడబోతున్న వాసంతి చెంపల మీద అప్పటికే నిండిపోయి జారిన కన్నీటి బిందువులు పడ్డాయి వాటిని కొనగోటితో తుడుస్తూ శేఖరం 'ఇంతకంటే మంచివార్త యింకేముంటుంది నాకు—మనలో చాలా సంసారాలు నూటికి దాదాపు తొంభై పిల్లల మూలంగానే నిలుస్తున్నాయి అంటే అతిశయోక్తిలేదు వసూ. మన సంసారం అలాటిది కాకపోయినా' వంగి వాసంతి నుదురుమీద ముద్దు పెట్టుకుంటూ అన్నాడు

బాగా సాయంత్రం అయిపోయింది శేఖరం వసంత తయారయినారు గారేజులో కారు బైటకుతీసి వరండా

---

ఒక సెట్టిగారు నౌకరుకు ఆరు కానులిస్తూ, యీ కవరు మీద ఆరు కానుల బిళ్ల అంటించి పోస్టు పెట్టెలో పడెయ్యరా అన్నాడు. కొంత సేపయిన తరువాత నౌకరు ఆరు కానులు తిరిగియిచ్చి 'శేర్‌జీ! నాకు బహుమానం యివ్వండి. మీకు ఆరు కానులు మిగిల్చాను' అన్నాడు.

శేర్‌జీ:- ఎలా మిగిల్చేవురా.

నౌకరు:- ఎవరూ చూడకుండా దాన్ని పెట్టెలో పడేశాను.

మైలవరపు వేంకటయ్య జేశ్ బాబు
(పెద్దాపురం)

---

ముందుకు తేవటానికి వెళ్లాడు శేఖరం హాల్లో శేఖరంకోసం చూస్తూ నిలబడిన వాసంతికి ఫ్లాస్క్, పళ్ళు, భోజనం క్యారియర్ కారులోపెట్టి తిరిగి వస్తున్న రాజు 'సుకన్యాదేవి నౌకరువచ్చి యిచ్చి వెళ్లాడంటూ ఒక కవరు యిచ్చివెళ్లాడు కవరు అంటించి వుంది. పైన శేఖరంపేరు వుంది ఇంతలో వాకిట్లోంచి శేఖరం పిలుపు విన్పించింది వచ్చికారులో ప్రక్కన కూర్చుంటూ రాజు యిచ్చిన కవరు ఇచ్చింది 'యేమిటది—' కారు స్టార్ట్‌చేయబోతున్న శేఖరం ఆగి కవరు చించాడు అందులో వుత్తరంవుంది చదువుకున్న శేఖరం పూర్తిచేసి చదవమన్నట్లుగా వాసంతి చేతికిచ్చాడు 'యెవరు రాసింది' ఉత్తరం తీసుకుని చూసింది వాసంతి అది అమూల్య స్వయంగా రాసిన ఉత్తరం అందులో యిలా వుంది:

'శేఖరం!

నిన్ను వదిలిపెట్టి వెడ్తున్నప్పుడు నేను చాలా అదృష్టవంతురాలినని నిన్ను గెల్చానని అనుకున్నాను. కానీ నేను వెళ్తోంది అదృష్టపు శిఖరాలు అందుకోవటానికి కాదని — అఖాతపు లోయల్లో నామరూపాలు లేకుండా జారిపోవటానికని నాకేం తెలుసు! నువ్వెప్పుడూ అదృష్టవంతుడివే! మొదట నన్ను పెళ్ళి చేసుకున్నప్పుడు లోకం నిన్ను అదృష్టవంతుడివని అంది. నేను విడిచి వెళ్ళిపోయినప్పుడూ అంది. యిప్పుడూ అంటోంది. ఈ కొద్ది సంవత్సరాల్లో నేను మానసికంగా చాలా మారాను కొన్ని వూహాలతాలూకు విలువలు గూడ అర్థమైనాయి. అనుభవం చాలా పాఠాలు నేర్పింది నిన్ను విడిచిపెట్టినప్పుడు వెళ్ళిన అమూల్యనికాను నేను. అందుకే యిప్పుడు యిలా హఠాత్తుగా వెడ్తున్నాను నువ్వు హైద్రాబాద్‌లో వున్నావని తెలిస్తే నేనీ ఛాయలకి గూడ వచ్చేదాన్నికాదు తెలియక పాతజీవితాన్ని జ్ఞప్తిచేసుకుని కాసేపు కులాసాగా గడుపుదామని సుకన్యాదేవి యింటికి వెళ్లాను సరీగ్గా అప్పుడే పుట్టినరోజు జరగటం మీరురావటం నా దురదృష్టం. రాత్రి చాలా బాధపడ్డాను ముఖ్యంగా వాసంతి మొహం నన్ను నిద్రపోనివ్వలేదు నాకు ప్రస్తుతం లేనివి—నేను అజ్ఞానంలో కాలదన్నుకున్నవి యిప్పుడు వాసంతికి ఉన్నాయి ఒక్కసారి నీతో మాట్లాడాలని ప్రయత్నించి సుకన్యాదేవిచేత ఫోన్ చేయించాను. గతంతప్ప భవిష్యత్తులేదన్న నా మాటని నాకు తిప్పిచెప్పావు నీకేం భయమక్కర్లేదు నువ్వే ట్రాన్స్‌ఫర్‌కి ప్రయత్నం చెయ్యొద్దు నేనే యీ రోజు సాయంత్రం వెళ్ళిపోతున్నాను, మళ్ళీ యెప్పటికీ కనపడనని వాగ్దానం చేస్తూ

అమూల్యచే

ఉత్తరాన్ని ఒకటికి రెండుసార్లు చదివింది వాసంతి అప్రయత్నంగా కళ్లలో నీళ్ళు తిరిగాయి అవి అమూల్యవెళ్ళిపోతోందికదా అనే సానుభూతితో కాదు యేదో పెద్ద ప్రమాదం జరగబోయి ఆగిపోయిందనే సంతృప్తితో, సంతోషంతో. యెప్పటిలా తనూ శేఖరం మిగిలిపోయారుకదా అనే ధైర్యంతో చేత్తో ఉత్తరాన్ని మడిచేసి బైటకు చూసింది వాసంతి కారు హిమాయిత్ సాగర్‌వైపు రివ్వున దూసుకుపోతోంది ప్రక్కనుంచి బంజారా హిల్స్ వెనక్కు భయంతో తప్పుకుంటున్నాయి.

రోడ్డుని తదేకంగా చూస్తూ ఫాస్ట్‌గా డ్రైవ్ చేస్తున్న శేఖరం ఒకచేత్తో డ్రైవ్‌చేస్తూ, రెండో చేయి జాపి వాసంతిని దగ్గరకు తీసుకున్నాడు అతని కళ్ళల్లో గూడ నీళ్ళ తిరుగుతున్నాయని అవి నిగ్రహించుకోవటానికి ప్రయత్నం చేస్తున్నాడని వాసంతికి తెలియదు ప్రక్కకు తిరిగి భర్త భుజంమీద తలదాచుకుంటూ నిన్న యీ ఛైవ్‌కి, యీరోజు యీ ఛైవ్‌కి యెంత అనుభవం పొందాను నేను. ఒక్క 24 గంటల్లో యెంత మారానో!" అంది.

'ఒక్కోసారి అంతే వసూ! 24 గంటలే అక్కర్లేదు 24 సెకన్లు చాలు మారటానికి' నెమ్మదిగా అన్నాడు శేఖరం. 

ముక్కూ, అజంతా శిల్పంలా శరీరం నిండా ఒంపులు, గుండ్రటి బుజాలు, దీర్ఘమైన చేతులు, గులాబీరంగు అరచెయ్యి, చేతికి సన్నని వేళ్ళు, వేళ్లను పాలిష్‌చేసిన గోళ్ళు, అరచేతిలో అద్దం, దంతపు దువ్వెన—శంకరం స్తంభించిపోయి కన్నార్ప కుండా చూస్తున్నాడు.

“మా చిన్నమ్మాయి, పార్వతి. ఇక్కడ ఉండే దల్లా మేమిద్దరమే. వంటవాడు చీకటి పడక ముందే వంటంతా సిద్ధంచేసి వెళ్లిపోతాడు. ఉదయం మళ్లీ కాఫీ వేళకుగాని రాడు . . తల కాస్త దువ్వుకోండి” అని ఆయన హెచ్చరికచేసేడు.

“విచిత్రంగా ఉంది. ఇందాక చూసిన పాప ఎవరు ? ఇద్దరే ఉన్నామంటాడేవిటి ?”

“అందమైన మీ ముఖారవిందంమీద ఆ పిచ్చుక గూడు కాస్త సరిచేసుకొంటారా ! చూడ్డానికి చాలా భయానకంగా ఉంది . . నూనె తీసుకు రమ్మంటారా?” మెత్తని శృతిలో అడిగిందిపార్వతి.

“వద్దులెండి !” అంటూ ఆమె చేతి అద్దం తీసుకొని అందులో తన ప్రతిబింబము చూసు కొంటూ దువ్వెనతో చెదరిన జుత్తు సరిజేసికొన్నాడు.

“కాస్త వేడివేడి టీ తీసుకోండి ఒంటికి మంచిది” అంటూ పార్వతి ఎప్పుడు వెళ్లి తీసు కొచ్చిందో సిద్ధంగా నిలుచుంది. కప్పులో పోసిన టీ ఆవిరి పొగలు చిమ్ముతోంది. వేళగాని వేళ తను వర్షంలో తడిచివస్తానని వీళ్లకు ముందుగానే తెలుసా ? టీ కాచి తనకోసం సిద్ధంగా ఎదురు చూస్తున్నట్టు కనిపిస్తోంది. ఆయనవైపు చూసేడు ముడతలుపడ్డ ముఖంలో మందహాసం తొణికిస లాడుతోంది.

“తీసుకోండి” అన్నట్టు కనుబొమలు ఎగుర వేస్తూ సాంకేతికంగా తెలియజేసేడు.

పార్వతి ట్రేలో నుంచి ‘టీ’ తీసుకొని శంక రానికి దగ్గరగా వచ్చింది.

ఆమె చేతినుండి టీతో నింపబడ్డ కప్పు, దాని కింద సాసర్ని, రెండు చేతులూ ఎత్తి అందు కొన్నాడు. పార్వతి అందిస్తున్నప్పుడు చేతి వేళ్ళ దూరంగా పెట్టుకోలేదు ఆ నునుమెత్తని వేళ్లను తాకుతూ, వణుకుతూ నాట్యం చేస్తోన్న కప్పుని సాసర్లోంచి దొర్లిపోకుండా కాసుకొంటూ ముందున్న టేబిలుమీద పెట్టుకొన్నాడు.

శంకరం తొట్రుపాటు చూసి పార్వతి గబు క్కున నవ్వబోయి పక్కనే కూర్చొన్న నాన్నను చూసి నవ్వుని మింగేస్తూ ఆపుకొంది.

“నే వచ్చినప్పుడు సజ్జనిండా పువ్వులు పట్టు కొని గుమ్మంలో నిలుచొన్న పాపేదీ ?” శంకరం వేసిన ప్రశ్న వాళ్ల కర్థమైనట్టు లేదు.

తండ్రీ కూతుళ్ళు ఒకరి మొఖాలు ఒకరు చూసుకొన్నారు.

“పాపండీ ! గులాబీరంగు పువ్వుల గౌను వేసు కొంది. నన్ను వరండాలో చూసి ఆ కర్టెన్ తొం గించి, తుర్రుమని యీ హాల్లోకి పరుగెత్తింది. అప్పుడు మీరు యిక్కడేగా చదువుకొంటూ కూర్చొన్నారు.”

ముసలాయన చాలా అట్టహాసం చేసేడు. ఎంత హాసం అంటే ఆ నవ్వు శంకరం గట్టిగా కప్పు, సాసరు చేత్తో అదిమి పట్టుకోకపోయినట్టయితే యీపాటికి గదినిండా వాటి పెంకులు

# దారి తప్పినా
# మాట తప్పినా

(17-వ పేజీ తరువాయి)

దొర్లుతూ ఉండాల్సింది. అలా నవ్వుతున్నవాడల్లా చూస్తుండగానే ముఖంలో నవ్వు మాయ మైపోయి—విచారసూచకంగా పెట్టి,

“వర్షంలో తడవటాన్ని కాస్త పైత్యం చేసు వుంటుంది. అంతేగాని మా పెద్దమ్మాయి సుంద రమ్మ, దాని పాప ఉష చనిపోయిం తర్వాత నా యింట్లో చిన్నపిల్లలు తిరగడం, ఆ ముద్దూ ముచ్చటా అన్నీ కరువైపోయినాయి—పోనీ ఇదైనా పెళ్లి చేసుకొని ఆలోటు భర్తీచేసి ముచ్చట తీరు స్తుందేమో అంటే నాకు పెళ్లే వద్దని గోల పెడుతోంది ఏవిటో—

“పోనీ నాన్నా! పెద్దవాడి వవుతోన్నకొద్దీ నీకు చాదస్తం ఎక్కువైపోతోంది. ఎక్కడ ఎలా మాట్లాడాలో తెలీదు” అని పార్వతి కోపంగా లేచి వెళ్లిపోయింది.

శంకరాని కేవీ అంతుపట్టటంలేదు. పార్వతి వెళ్లిపోతున్నప్పుడు ఆమె కాళ్లవైపు పరిశీలనగా చూసేడు సరిగ్గానే ఉన్నాయి. ఎంతో సుకుమా రంగా, కుదురుగా పచ్చని ఛాయతో మిలమిల మెరుస్తున్నాయి ముసలాయన పాదాలవైపు చూసేడు సవ్యంగానే ఉన్నాయి. అన్నట్టు యిందాక ఆ పాప పాదాలవైపు చూళ్లేదు. అవి తప్పకుండా వెనక్కు తిరిగి ఉండి ఉండాలి గుర్తు లేదు ఈయనతో మీ పాప దెయ్యం అయి తిరుగుతోందని చెబితే నొచ్చుకొంటాడు. పాపం కూతురూ, పిల్లా — ఎలా చనిపోయారో? అడిగితే ! ఛీ—పెద్దమనిషికి అవన్నీ జ్ఞాపకంచేసి యిప్పటికే మనస్సు నొప్పించాను. ఏదేనా టాపిక్ మారుస్తే మంచిది. పార్వతి తిరిగొస్తుందో రాదో ? ఎక్క డకు వెళ్లిపోయింది ? అవసరంగా పార్వతి కూడా మనస్సు కష్టపెట్టుకొంది.

“పాపం పార్వతిని” శంకరం సన్నగా గొణిగాడు.

“దానికి కోపం ఎప్పుడూ ముక్కుమీ దుంటుంది చూడండి ! ఒక్క నిమిషంలో నాన్నా ! అనుకొంటూ నవ్వుతూ నా తల్లి తిరిగొస్తుంది” అన్నాడు చేతి రుమాలుతో కళ్లు వత్తుకొని కళ్లజోడు పెట్టు కుంటూ.

“నే నెవర్నో ఏమిటో నా విషయం ఏమీ తెలుసు కోకుండానే నన్నింత అభిమానిస్తున్నందుకు మీకు కృతజ్ఞత ఎలా చెప్పాలో అర్థం కావటంలేదు.”

“చూడండి ! మిమ్మల్ని గురించి నాకేవిధమైన అనుమానంలేదు. అసలు నే నెవర్నీ ద్వేషించలేను. హత్యలు, దొంగతనాలు, దోపిళ్ళూ చెయ్యగలరనే నమ్మకం మిమ్మల్ని చూడగా నాకు కలగటం లేదు అలాగే నా విషయంలో కూడా మీకేమీ అను మానం అక్కర్లేదు. ఇది నా స్వంత యిల్లు దీని చుట్టూ వందెకరాల పొలం, పొలానికి ఎగువ పని వాళ్ల కొంపలు, పశువులదొడ్లూ, అంతకంటే ఒకర్ని గురించి ఒకరు తెలుసుకో నవసరంలేదు. రోజుల తరబడి తెలుసుకోవడాలు — హృదయాన్ని విప్పి, చించేసి మూటలు కట్టుకు కూర్చోవడాలు అంటే నాకు సరిపడదు మీరు వర్షంలో తడిసి ముద్దయ్యొచ్చారు. మీకు కాస్త ఆతిథ్యం యివ్వటం నా విధి అంతకుతప్ప మీ పుట్టుపూర్వోత్తరాలు, గోత్రనామాలతో చెప్పమని, జీతం ఎంతని, రాబడి ఎన్ని అంకెలమీద నడుస్తోందని ప్రశ్నలువేసి వేధించుకు తినదలుచుకోలేదు “బైట చీకటి — యీ రాత్రికి యింత హాయిగాతిని, పడుకొని విశ్రాంతి తీసుకొని ఉదయాన్నే మీ పనులు మీరు చూసుకోండి” అన్నాడు. పార్వతి వచ్చి చిరునవ్వుతో నాన్న పక్కనే కుర్చీలో కూర్చొంటూ,

“తొమ్మిదయింది” అని వాచీ ఆయన కళ్ల ముందు పెట్టి చూపించింది.

“అన్నట్టు సరిగ్గా తొమ్మిది గంటలకు నేను నిద్రపోవాలి మళ్లీ ఉదయం నాలుగ్గంటలకు లేస్తాను ఈలోగా ప్రళయం వచ్చినా, ప్రపంచ యుద్ధం జరిగినా లేచేది లేదు టయిము ప్రకారం ఎప్పు డేది చెయ్యాలో అది చెయ్యడం నా కల వాటు అలా అని అందర్నీ నన్ను ఫాలో అవమనే మనస్తత్వం కాదు. పార్వతి మీకు సుష్టుగా ఆవ కాయ, పెరుగు వేసి భోజనం పెడుతుంది బహుశా ఆమ్లెట్ కూడా, ఏం పార్వతీ ! అవి తిని పడు కోండి గుడ్‌నైట్. గుడ్‌నైట్ తల్లీ !—” అని ఎదురుచూడకుండా ఆయన గదిలోకి వెళ్లి పోయారు ఆ ప్రవర్తనకి శంకరం నోరొదిలి చూస్తూ నిలుచున్నాడు ఎదురుగ్గా పార్వతి నవ్వుతూ కనిపించేసరికి సిగ్గుపడిపోయాడు పార్వతితో ఏవిధంగా ప్రస్తావించాలో ఉపోద్ఘాతంచిక్కడంలేదు.

“అన్నీ సిద్ధంగా ఉన్నాయి ఇప్పుడే భోజనం చేస్తారా ! కాస్త ఆగి తింటారా ? మీ యిష్టం.”

“మీ యిష్టం” అన్నాడు శంకరం ఆమె లాలి త్యాన్ని జుర్రేసుకొంటూ.

“బాగుందండోయ్ భోజనం చేసేది మీరా నేనా ? నా భోజనం ఎప్పుడో అయిపోయింది. భోజనం రడీ తల్లీ అని వంటవాడు అనగానే ఒక్క గంతులో వెళ్లి టేబిలు ముందు కూర్చొంటాను. అదీ నా పద్ధతి.”

“అవుతే ఆకలేస్తోంది పదండి” అంటూ శంకరం లేచేడు. పార్వతి దారి చూపిస్తూ భోజ నాల గదివైపు నడచింది శంకరం ఆమె ననుస రించాడు. ఇంటిలో ప్రతి వస్తువా ఎంతో నున్ని తంగా, పొందిగ్గా ఎక్కడుండవలసిన వస్తువు అక్క డుండి, వాళ్ల సంస్కారాన్ని మనసుకి హత్తుకొనేలా చేస్తున్నాయి శంకరానికి ఇంద్రభవనంలో విహ రిస్తోన్నట్టుంది

“ఇల్లూ ఒళ్ళూ శుచిగా వుంటే మనసు కూడా నిర్మలంగా ఉంటుంది పార్వతి ఒడలో సన్నజాజి పూలు ఎంత అందంగా ఉన్నాయి ఆ జడ పొడుగ్గా నల్లని కాటుకలా ఉండి మిలమిలా మెరుస్తోంది. జడ విప్పి పట్టులా ఉన్న కేశాలతో తన ముఖం, శరీరం దాచుకోవా లనిపిస్తుంది

“రండి, కూర్చోండి” అన్నది పార్వతి.

శంకరం కుర్చీలో కూర్చొన్నాడు. మాటలు దొరకటంలేదు. పార్వతి అతని కెదురుగ్గా ఉన్న కుర్చీలో కూర్చొని వెండిపళ్లెంలో అన్నం వడ్డిం చింది. తెల్లని బల్లమీద వెండి కంచంలో బువ్వ మల్లెమొగ్గల్లా విచ్చుకొంది. నేతిగిన్నె చేతి కందిం

చింది మువ్వగుండ చెమ్చాతో అన్నమ్మీద వేసింది. వంగి ఆవకాయ పళ్లెంలో వడ్డిస్తోన్నప్పుడు ఆమె జడలో తురుముకొన్న పువ్వులు అతని ముక్కుని రాసుకొన్నాయి. శంకరం ముగ్ధుడై పోయాడు. జన్మ తరించిపోయింది.

"గాజు ప్లేట్లో ఆమ్లెట్ వేడివేడిగా ఉంది పార్వతి స్వయంగా తయారు చేసిందా ? చాలా తమాషాగా ఉండే ఫలానా వంటకం నీకు పెడు తుందని ఆయన దివ్యదృష్టితో చూసి చెప్పినట్టు చెప్పాడే అట్లా చేసుకోవడం కూడా నేర్పేనేమో ?" అనుకున్నాడు శంకరం.

పార్వతి ఎదురుగ్గా కూర్చొని శంకరాన్ని చూస్తోంది. దొండపండులా ఉన్న ఆమె పెదాల పైన చిరునవ్వు నిర్మలంగా ప్రకాశిస్తోంది విచ్చు కొన్న బొగడప్పువ్వులా, పారిజాతంలా, మల్లెపువ్వులా మెరిసిపోతోంది "ఒక్కసారి హృదయానికి హత్తు కొనే భాగ్యం తనకు కలుగుతే ఎంత బావుణ్ను !" అనుకొన్నాడు శంకరం.

పార్వతి వేళ్లతో టేబిలుమీద వట్టేనే మూగ భాషకు లిపి కడుతోంది.

"మీరేం చదువుకొన్నారు" పార్వతి జవాబు చెప్పలేదు. ఏం చదువుకొంటేనేం ? అన్నట్టు చూసింది.

"ఛా—ఏం ప్రశ్న ! విజ్ఞానం, నాగరికత అన్నీ మూర్తీభవించినట్టు ఆమె కనిపిస్తోంటే డిగ్రీ లతో ఆమె సంస్కారాన్ని కొలవటమా ! యింత లేత వయస్సులో కూడా ఎంత సహనం! సిగ్గు పడిపోయి ముడుచుకొని దూరంగా పారిపోవటం లేదే ! నెమలిపురి పిట్టలా పురి విప్పుకొని సింహా సనంమీద కూర్చొన్నట్టు ఎదురుగ్గా రోజ్ వుడ్ కుర్చీలో కూర్చొందే"

వద్దంటున్నా వినక మళ్లా కంచంలో అన్నం వడ్డించి, చిక్కని పెరుగు వేసింది తృప్తిగా భోజనం చేసేవరకూ చెంత కూర్చొని చేతులు తుడుచుకొనేందుకు తువ్వా లందించింది శంకరం చేతులు తుడుచుకొంటూ "మీరింత వేగం పెళ్లి చేసుకోరా ?"

"ఏం ? మీకు చేసుకొందామనిపిస్తుందా ?" పార్వతి నవ్వుకొంటూ వెళ్లిపోయింది. శంకరానికి షాక్ తగిలినట్టయింది.

నే నెవర్నో కనీసం నాకు పెళ్లయిందో లేదో అన్న ఆలోచన లేకుండా ఏమిటలా అడుగుతుంది ?"

భోజనాలగది వదలి హాల్లో అడుగు పెట్టే సరికి పార్వతి వక్కపొడితో సిద్ధంగా సోఫాలో కూర్చొనుంది.

"ముక్కూ మొఖం ఎరుగని నన్ను పార్వతి ఎందుకింత ఆదరణతో చూస్తోంది? ఏమిటి? ఆవిడ ఉద్దేశం ! అదేదో తేల్చుకోవాలి"

"నేను ఊఁ — అంటే నన్ను చేసుకోవడానికి సుముఖంగా ఉన్నారా ?" అంటూ ఆమె చేతి లోంచి వక్కపొడి తీసుకొని నోట్లో వేసుకొన్నాడు

"ఏమిటి చేసుకొనేది ? దుష్యంతుడూ, శకుం తలా వ్యవహారంలా ఉంది మీ మానాన మీరు దులుపు కొని వెళ్లిపోతే ఏడు ఘడియల్లో ఉంగా, ఉంగా అంటూ మా నాన్నగారు మనవడితో ఆడు కోవాలేం?" అంటూ సోఫాలోనుంచి లేచి శంకరం కుర్చీ వద్దకు వచ్చి అతనివద్ద నిలుచొంది.

శంకరాని కదేవిటో అర్థంకాలేదు. ఆమె కళ్ల

# దారితప్పినా మాటతప్పినా

వైపు అమాయకంగా చూసేడు తన షర్టుమీద పాకురుతోన్న గొంగళిపురుగు గోళ్లతో పట్టుకొని కిటికీవైపు చరచరా నడచివెళ్లి కిటికీ తెరచి చీక ట్లోకి విసిరేసింది. తిరిగి నవ్వుకొంటూ వచ్చి శంకరంవద్ద నిలుచొంది

"మనస్సాక్షిగా చెబుతున్నాను" అన్నాడు శంకరం

"మనస్సుకి కోర్టులూ, సాక్ష్యాలు, పురో హితులు అక్కర్లేదనా ? రండి అలసిపోయిన ట్టున్నారు కాస్త విశ్రాంతి తీసుకొందురుగాని" అని బెడ్‌రూం వైపు వెళ్లింది

శంకరానికేమ్మాట్లాడాలో తెలీడంలేదు పార్వతి గది తలుపులు తెరచి గుమ్మానికి రెండు చేతులూ ఆని—అలా నిలుచొనే ముఖం ఎత్తి తన కుడి భుజం మీదుగా నవ్వుతూ శంకరాన్ని పిలుస్తోన్నట్టు చూసింది అలా చూస్తోన్నప్పుడు ఎడమవేపున వేసుకొన్న పైట, పాము కుబుసంలా ఉన్న జడ

భర్త:-(భార్యతో) నీ కెన్ని సార్లు చెప్పాను. నలుగురితో మాట్లాడేప్పుడు ఇల్లు ఊడవ టానికి పిలవొద్దని.

భార్య:-నాకేం తెలుసు. మీ దగ్గర కొచ్చేవారు పెద్ద మనుషు లని.

వి. ఆర్. శేఖర్ (చేబ్రోలు)

జారి ఒకదానితో ఒకటి చట్టాపట్టాలు వేసు కొన్నాయి శంకరం ఆమె దగ్గరకు వెళ్లి వెనుక నిలుచొని ఆ వేణిక ప్రసూనాలపరిమళాల మీదుగా విశాలమైన పడకగదిలోకి చూసేడు గది మధ్య హంసతూలికాతల్పంలా పరచుకొన్న మంచం దాని మీద మెత్తని దిండ్లు, గదంతా కళకళలాడుతూ కనిపించింది

పార్వతితో కలిసి గదిలో ప్రవేశించాడు. కిటి కీలు తెరవలేదు బైట యింకా సన్నని జల్లు పడు తోంది

ఆ రూములో గోడలన్నీ ఎంతో నీటుగా ఉన్నాయి. రెండంటే రెండే ఫోటోలు చక్కని చట్రాలతో గోడను అంటిపెట్టుకొని కన్నుల పండువగా ఉన్నాయి శంకరం మంచంమ్మీద కూర్చొన్నాడు. పరుపు మెత్తగా శరీరాన్ని అంటిపెట్టుకొని గిలి గింతలు పెడుతోంది అతని పక్కనే పార్వతి కూర్చొని మంచాన్ని ఆనుకొనివున్న పుస్తకాల స్టేండు నుంచి పుస్తకం తీసి పేజీలు తిరగే స్తోంది అందులో దేన్నో వెతుకుతోంది

"ఇల్లంతా ప్రశాంత వాతావరణంతో నిండి ఏకాంతంగా ఉంది పార్వతి నాన్నా, తనూ తప్ప వేరే మగపురుగు లేదు ఆయన నిద్దరపోయే ఉంటాడు. ఒక్క గంట కిందట తనెవరో — ఎన్నో సంవత్సరాలుగా తనతో పరిచయం ఉన్నట్టు పార్వతి ఎంత చనువుగా మాట్లాడుతోంది" అను కొన్నాడు

ఆమెపైట జారి తెల్లని పరుపుమీదుగా దొర్లి ఆ మెత్తని సిల్కుచీర శంకరం కాళ్ల ముడుకులు మీద పడి గిలిగింతలు పెట్టింది.

చీర కొంగు తీసి చేతో పట్టుకొన్నాడు

"సారీ" అంటూ పార్వతి పైట అతని చేతి నుంచి విడిపించుకొని యెద కప్పుకొంది

"అట్లా జారినట్లు గుర్తు చెయ్యకుండా ఉండ వలసింది" అని శంకరం అనుకొన్నాడు

పార్వతి తిరిగి మాట్లాడలేదు నిశ్శబ్దంలో కాలం కరిగిపోతోంది శంకరం వూహలకు మాటల ద్వారా రూపకల్పన చెయ్యలేకపోతున్నాడు

పార్వతి అకస్మాత్తుగా లేచి నిలుచుంది

"ఈ పక్కగదిలో చదువుకొంటూ పడు కొంటాను మీకేమైనా కావలిస్తే నన్ను పిల వండి. నిద్దరపోతున్నా లేపొచ్చు మంచినీళ్లు కూజాలో ఉన్నాయి" అని చెప్పి పుస్తకం చేతో పట్టుకొని వెళ్లిపోయింది

వెళ్లిపోతున్నప్పుడు పిలవాలనిపించింది పిలవ లేకపోయాడు మెత్తని తలగడాలో తల ఆన్చి పడుకున్నాడు

పార్వతి తిరిగి వచ్చింది

"మీకు నిద్దరొస్తున్నప్పుడు లైటు ఆర్పేసు కోండి స్విచ్చి ఎక్కడుందో మీకు తెలుసా" అని పుస్తకాల స్టేండు వైపు వేలు చూపింది

అర్థమైనట్టు "సరే !" అన్నాడు శంకరం. పార్వతి తలుపు దగ్గరగా వేసుకొని వెళ్లిపోయింది. తనొక్కడూ ఎలా గడపటం ? పార్వతి దగ్గ రున్నంతసేపూ ఆమెతో ఏవేవో తియ్యని కబుర్లు చెబుతూ ఆమె మాటల్లో తేనె జుర్రుకొంటూ మత్తెక్కిపోవా లనుకున్నాడు ఆ ఆశను నిరాశచేసి పార్వతి వెళ్లిపోయింది

పుస్తకాల దెస చూసేడు వాటిని వేళ్లతో తడిమి కూడా చూసేడు రుచించలేదు చీర కొంగు పట్టుకున్నప్పటిలా ఒళ్లు జ్వలించలేదు. దీపం మీటనొక్కి పక్కమీద పడుకొన్నాడు గది నిండా చీకటి ముసుగేసుకుంది గది బయట నిశి, నిశ్వాసము, కప్పలు, సిమ్మెట్లు, చీకటి పురుగులు, తుఫానుగాలి—కన్ను మూద్దామన్నా మూతపడ్డంలేదు పాప వస్తుందేమో ? దెయ్యం అయి తిరుగుతోంది వరాండాలో తనకు మూడు గజాల దూరంలో నవ్వుతూ నిలుచొంది ముస లాడు హేళనచేసి రాక్షసిలా నవ్వేడు వికృతంగా ఉంది ఆ నవ్వు ఈ చీకటి, భయం, దెయ్యంపాప ఎంచక్కా కర్టెన్ పట్టుకొని నిలుచుందేమో" అనుకొని లైటు వేసేడు

పగలబడి నవ్వినట్టు గదిలో లైటు వెలిగింది.

లేచి తలుపు తీసుకొని హాల్లోకి వెళ్లేడు. హాల్లో లైటు కూడా వేసి పోర్టికో వైపు తలు పులు తెరచి కర్టెన్ తొలగించి చూసేడు గాలికి మాలతీలతవద్ద ఆరబెట్టిన బట్టలు రెపరెప కొట్టు కొంటున్నాయి ఎక్కడా—ఎవరూ తిరుగుతోన్న సవ్వడి వినిపించలేదు. దెయ్యంపాప కనిపించనూ లేదు. "అయినా ఆ చీకట్లో ఏం కనిపిస్తుంది" అనుకొన్నాడు. వీధిలైటు స్విచ్చికోసం ప్రయ త్నించి ఒకట్కి రెండు మీటలు నొక్కి చూసేడు.

ట్యూబులైటు వెలిగి వెన్నెల విరిబూయలేదు. ప్రయత్నం విరమించుకొని, తలుపు గడియవేసి తిరిగొస్తున్నప్పుడు పారతి గది తలుపు కాస్త తెరచుకొని సన్నని వెల్తురు జాలుగా కుర్చీలమీద పడుతూ కనిపించింది

"పార్వతి యింకా పడుకొన్నట్టు లేదు" తలుపు దగ్గరగా వెళ్లి చూసేడు మంచంమీద వెల్లకితలా పడుకొని చదువుకుంటోన్నట్టుంది. దిగువవరకూ జారిన జడ పాములా పరచిన తివాసీ మీద కదుల్తోంది పిలవమంది కదూ! పిలుద్దామా! పిలుస్తేనో" అనుకొన్నాడు. సిగ్గుపడి పోయి పిలువకుండానే తన గదిలో ప్రవేశించి మంచంమీద కూరుకుపోయాడు ముఖం మెత్తని తలగడాలో నొక్కిపట్టి దాచుకున్నాడు

"రాత్రి ముదిరిపోతోంది. లాభంలేదు అనుకొన్నాడు

"చూ చూ చూ చో" మని పెంకులు ఎగిరి పోయేలా హోలుగుండా పెద్ద కేకలు వినిపించాయి మంచానికి గజ మెత్తుమీద కురికి గడగడ వణికి పోతూ లేచి నిలుచున్నాడు పార్వతి ధణేలున తలుపు తోసుకొంటూ గదిలో కొచ్చింది శంకరం తొ ట్రు బా టు చూ సిం ది న వ్వు కుం టూ, "క్షమించండి మా నాన్నగారికి ఏదొచ్చినా ఉపద్రవమే నిద్దట్లో అప్పుడప్పుడు కలవరిస్తారు మీతో యిందాకనే చెబుదా మనుకొని మరచి పోయాను పాపం ." అంటూ శంకరం చెయ్యి పట్టుకొని మంచంమీద కూర్చోపెట్టింది.

చెమటపోసి ఉక్కపెడుతోన్నా—

"ఆహా, లేదండీ! ఏమిటో తెలీక కాస్త గాబరా పడ్డాను రండి కూర్చోండి" అన్నాడు శంకరం నాలిక తడి చేసుకొని

పార్వతి శంకరాన్ని ఆనుకొంటూ దగ్గరగా జరిగి కూర్చొంది

"మంచినీ ళ్లివ్వనా."

"తేంక్స్"

"భయపడ్డారా ?"

"ఉహుఁ !"

"మీరెందుకు పెళ్లి చేసుకోలేదూ ?" శంకరానికేం చెప్పాలో తోచలేదు అలా అడుగుతుందని అనుకోలేదు. అయినా కాస్త ఆలోచించాడు అబద్ధం చెబితే మంచిదని తోచింది

"నేనూ మీలాగే పెళ్లి చేసుకోనని భీష్మించుక్కూర్చున్నాను"

"నేను కూర్చోలేదే, తగిన వరుడు దొరికితే సిద్ధంగానే ఉన్నాను నే యిష్టపడితే నన్ను చేసుకొంటారా !"

శంకరానికి సమస్యే "ఏమని చెప్పడం ? ఎంత చనువుగా అడిగేసింది ! అమాయకురాల్లా ఉంది తనను నమ్మేసింది"

మెత్తగా పువ్వుల్లా ఉన్న ఆమెచేతులుపట్టుకొని "నిన్ను తప్పకుండా చేసుకొంటాను జీవితమంతా నీకు అంకితం చేస్తాను. నామాట నమ్ము" అంటూ తన హృదయానికి హత్తుకొన్నాడు

అట్లా హత్తుకొంటోన్న చేతుల్ని ఒక్క వూపుతో విడిపించుకుని తుర్రున పరుగెత్తుకొని గుమ్మంవరకూ వెళ్లి అక్క డాగిపోయింది శంకరం లేచి ఆమె వద్దకు వెళ్లబోయాడు. పార్వతి తనే తిరిగి వచ్చింది శంకరాన్ని కూర్చోపెట్టింది

ఆ ఒయ్యారానికి ముగ్ధుడై కళ్లు చారెడేసి చేసుకొని ఆమెను చూసేడు. పార్వతి అతనిని జాలిగా చూస్తూ "పాప మీకు కనిపించిందన్నారు కదూ ?"

"అవును నవ్వుతూ నన్ను పిలిచింది"

"పాప దెయ్యం అయిందంటే మీరు నమ్ముతారా ?"

శంకరానికి మళ్లీ ఒక సమస్య కళ్లతో చూస్తే నమ్మనని ఎలా చెప్పటం ?

"మీరు సరిగ్గా చూసేరా ?"

"అవును వెన్నముద్దలా ఉంది"

"దెయ్యాలంటే మీకు భయంలేదా ?"

"ఎందుకులేదూ ! దెయ్యాలు పీడించుకు తినకుండా వదుల్తాయా! నీకూ పాప కనిపిస్తుందా ?'

"ఎప్పుడేనా కనిపిస్తుంది కాని ఎవర్నీ పీడించుకు తిన్నట్టు లేదు దాని మానాన అది ఎక్కడో గాలిలో తేలిపోతూ, సన్నగా పాడుకొంటూ స్వేచ్ఛగా తిరుగుతుంది" అంటూ పార్వతి అతని భుజంమీద తల పెట్టుకొని కళ్లు తుడుచుకొంది

"పాపను చూసి భయపడతా ననుకొంటున్నావా ? అలా ఎప్పటికీ అనుకోకు పార్వతీ" అంటూ ఆమెను దగ్గరకు తీసుకోబోయాడు పార్వతి మళ్లీ యిందాకట్లా చర్రున లేచి, శంకరం బుగ్గమీద అంటీ అంటనట్టుగా ముద్దు పెట్టుకొని—

"ఉదయాన్నే నాన్నతో చెప్పండి—పెళ్లి విషయం . ." అని గళుక్కున నవ్వి తిరిగి చూడకుండా తన గదివైపు ఒక్క పరుగున వెళ్లి తలుపులు మూసుకొంది.

శంకరం ఆమె గది వరకూ వెళ్లి తలుపు లోన గెడవేసి ఉండటం గమనించి తిరిగి తన గది చేరుకొని కూజా ఎత్తి గడగడా కడుపు పట్టేనన్ని మంచినీళ్లు తాగి లైటార్పి పడుకొన్నాడు

నిద్దర మట్టుకు రావడంలేదు, ఆవలింతలుతప్ప.

తను చెప్పినంతవరకూ నిజమనుకొని నమ్మేసింది ప్రాణంతో సమానంగా చూసుకొంటానంటే అంతలావున పొంగిపోయింది. తప్పకుండా మళ్లీ వస్తుంది. సౌందర్యం అంటే అలా ఉండాలి అంతేకాదు దానికి తగ్గ నిర్మలత్వం, అమాయకత—ఆహా" అనుకొంటూ కళ్లు మూసేడు కాస్త నిద్దర పట్టింది నిద్దట్లో తన నొసటి మీద మెత్తని చేతితో ఒత్తుతున్నట్లయి కళ్లు విప్పి చూసేడు చీకట్లో నల్లగా ఏదో ఆకారం తనవద్ద కూర్చొన్నట్టు కనిపించింది భయంతో వణికిపోతూ 'బాబోయ్' అని కొట్టుకోవటంలో చెయ్యి స్విచ్‌మీద పడి లైటు వెలిగింది

పార్వతి ముసి ముసి నవ్వులు నవ్వుకొంటూ లేచి నిలుచొంది తన అకారణ భయానికి సిగ్గుపడి పోతూ ముఖం రెండు చేతుల్లోనూ దాచుకొన్నాడు పార్వతి తన మెత్తని చేత్తో శంకరం రెండు చేతులూ తీసి పట్టుకొని, బుగ్గమీద రెండో చేత్తో చిన్న చిటికవేసి మళ్లా తుర్రున ఉడాయించింది

తనను తాను తిట్టుకొంటూ దుప్పటి తీసి పూర్తిగా ముసుగుపెట్టి శంకరం పడుకొన్నాడు. గాఢంగా నిద్దర పట్టేసింది. ఎంతసేపు అలా పడుకొన్నాడో తెలీదు గాని—ఎంతో కొంతసేపటికి నిద్దర పూర్తిగా తీరినట్టయి ఒళ్లు విరుచుకోబోయాడు. శరీరాన్ని అంటిపెట్టుకొన్న మెత్తని పరుపుల్లేవు చేతుల ముడుకులు విరిగేలా గచ్చు నేల పెడీలున చేతులకు తగిలింది కళ్లు విప్పి చూసేడు.

చీకటి పోయి పగటి వెలుగొచ్చింది

కోడు విరిగిన మంచం మధ్య నేలమీద తను న్నాడు. ముట్టుకొంటే బూడి దయిపోయే పట్టెడ ముక్కలు చీలికలై మంచపు పట్టెను అంటుకొని వేళ్లాడుతోన్నాయి.

ఒక్క కుదుపుతో లేచి గది చుట్టూ కలయ జూసేడు పొగచూరిన గోడలనిండా సాలెగూళ్లు నేసుకొని కనిపిస్తోన్నాయి

చెంగున కుప్పించి, వో ఎగు రెగిరి లేడిలా దాటుకొంటూ హోల్లో కొచ్చాడు దాటుకొంటూ వస్తోన్నప్పుడు పరుగుల్లో కాలికేదో తగిలి గలగల శబ్దం చేసుకొంటూ దొర్లింది శంకరం నిలుచొని నిదానంగా చూసేడు. సొట్టలు పడిపోయి జల్లెడలా చిల్లులతో ఉన్న పింగాణి పళ్లెం, బెళ్లులు బెళ్లుగా వూడిపోయిన దాని రంగు, తుప్పుపట్టిన పొడితో పళ్లెం చుట్టూ రాలి అసహ్యంగా కనబడుతోంది

ఊరగాయ వేసిన జాడీ డోక్కుపోయి మకిలి మకిలిగా ఉంది చెమ్చా ఆకారంలో శిధిలమై పోయిన ఎముకలు, చిటికిన అద్దం పెంకులు, చిల్లులుపడి లొత్తలోయి ఒడిలిపోయిన సీమవెండి, నేతిగిన్నె, బూజుపట్టిన ఆమ్లెట్టుల మట్టిప్లేటు, విరిగిన కుర్చీ ముక్కలు, బల్లలు, సగం విరిగిపోయి కూలిపోవడానికి సిద్ధంగా ఉన్న పైకప్పు, రాలిన పెంకుల గుట్టలు

"అయ్య బాబోయ్ ! అనుకొని మరొక్క దాటుతో చెదపట్టిన తలుపులు తోసుకొని ఇంటి వెలుపలకొచ్చి పడ్డాడు

సైకిల్ కోసం నాలుగు దెసలా తల గిర్రున చక్రంలా తిప్పి చూసేడు కనిపించలేదు

ఆరవేసిన బట్టలు గుర్తుకొచ్చి ఒంటిమీద చూసుకున్నాడు. తన బట్టలే ! ఎక్కడ కక్కడ చిరిగి పీలికల్లా వేళ్లాడుతోన్నాయి

"అయ్యయ్యో"అనుకొంటూ ముందుకి నడిచేడు.

చద్దికూడు తిని, అంబలి పట్టుకొని రంపకోతకు వెళుతోన్న అయినాడ అప్పలస్వామి పీలికలైన బట్టలతో దెయ్యాలకొంప దిగివస్తోన్న శంకరాన్ని చూసి—

"వోరి బాబోయ్ ! దెయ్యం ! సంపేహినాదేస్" అని ఒక్క గావుకేకేసి చేతిలో ఉన్న అంబటిసట్టి ఉట్టితో సహా విసిరేసి పరుగుచ్చుకొన్నాడు.

శంకరం వాడి కేకల్తో మరింత హడలిపోయి తను గూడా పరుపెత్తాడు. పరువెడుతోన్నప్పుడు కట్టుకొన్న గుడ్డపీలికలు గాల్లో ఎగురుతూ అసహ్యంగా, వికృతంగా కనిపిస్తోన్నాయి

వెనక శంకరం తరుముకురావడం చూసి అప్పలస్వామి తన వేగాన్ని మరీ హెచ్చించి అరుపులూ, పెడబొబ్బల్తో ఒగుర్చుకొంటూ ఆకాశానికీ భూమికీ అందకుండా గాల్లో తేలిపోతూ వూసలా దూసుకుపోతున్నాడు

శంకరం అప్పలస్వామి తన వేషం చూసి, తన్ను

దెయ్యం అనుకొన్నాడని గ్రహించి, అతన్ని పట్టుకొని నిలబెట్టి తన అసలు చెప్పుకోవాలని, పరుగులగులో ఉన్న నైపుణ్యం యావత్తూ ప్రదర్శిస్తూ ఉన్న సత్తువను వినియోగించుకొంటూ అప్పలస్వామి వెంట పరుగెడుతున్నాడు.

ఇద్దరిలోనూ ఎవరి పేగులు తెగిపోతాయో చెప్పడం కష్టం అన్నంత వేగంతో వాళ్ళు పరుగెడుతోండగా అదృష్టవశాత్తూ ఎదూరుగ్గా గొర్రెల మంద అడ్డొచ్చింది. అప్పలస్వామి వేగం తగ్గిపోయింది. శంకరం అమాంతంగా వెళ్ళి అప్పలస్వామి నడుం వాటేసి పట్టుకొన్నాడు

భయంతో అరుస్తూ అప్పలస్వామి తన చేతికి తోచినట్టూ శంకరం వీపు చదును చేస్తున్నాడు. ఆ గుద్దులకి,

"బాబోయ్ ! వాయనోయ్ ! నన్ను చంపకురా దేవుడా ! నేను దెయ్యాన్ని కాను—మనిషినే—శంకరాన్ని !" అని గుద్దుకో అరుపు చొప్పున శంకరం అరుస్తున్నాడు

పిల్ల రణగొణధ్వని విని గొర్రెలు చెల్లాచెదురై పరుగెడుతోన్నాయి గొర్రెలు విడిపోవడం చూసి కేకలూ, అరుపులు విని ఎవరో మనుషులు కొట్లాడుకొంటున్నారని పెద్ద కోనారి, గొల్ల గురయ్య, వాళ్ళ మధ్యకొచ్చి యిద్దర్నీ చెరో చేత్తోను పట్టుకొని విడదీసేడు.

గురయ్యను చూసి అప్పలస్వామి ధైర్యం తెచ్చుకొన్నాడు. పొరపాటు గ్రహించి సిగ్గుపడ్డాడు.

శంకరం తన్ను రక్షించమన్నట్టు కోనారివైపు దీనంగా జాలిగా చూసేడు.

"తమ రెవరు బాబూ?" అనడిగేడు కోనారి.

"పాలవలస రంగరాజుగారి అల్లుణ్ణి. నిన్న సాయంకాలం వర్షం వచ్చి దారితప్పి తడిసి ముద్దయి చీకట్లో చిక్కుకుపోయాను. ఆ పాడుకొంప పెద్ద బంగాళాలా కనిపించి రాత్రంతా అందులో .... " శంకరం వాక్యం పూర్తిగాకముందే గురయ్య పగలబడి నవ్వేడు.

అప్పలస్వామి కూడా నవ్వి "యీర్నే దెయ్యమనుకొని బేజారెత్తిపోనానేస్" అన్నాడు.

"సేనెత్లేయ్ ! నాన్ రాపోతే అయ్యగోర్ని అయిపు నేకుండా ఉట్టి పున్నేనికి సంసీసెగ్గిసోడివి సూడెలా బిగిలిపోనారో" అన్నాడు కోనారి గురయ్య

"కానుకోనేపోనాను గురయ్యమావా ! ఏటిదో అనుకొన్ను. కోతకి బైపైపోనాది. ఆల్సివైతే ఆ మేస్తి రొల్లకోడు ఒస్తాను బాకోటుపడకకండి" అని చెప్పి అప్పలస్వామి వెళ్ళిపోయాడు

కోనారి గురయ్య శంకరంవైపు చూసి,

"గడిసేపు కూసొండి బాబు ఆయాసం—ఒగ్గింతరవా తెల్దురుగాని" అని శంకరం చెయ్యి పట్టుకొని కూర్చోపెట్టేడు.

శంకరం కూర్చొన్నాడు.

"ఈటి కద సేనోటుండండయ్యగోరూ" అని చెయ్యెత్తి చూపిస్తూ,

"అది గట్టటు సూడండి ఆ కనిపిస్తున్న మొండి గోడ్నెదూ ? ఆ మేడ నేడంతా ఆరాజుగోరిదే. గోపాలాజుగోరని — మా గగనమైన మారాజునెండి. నన్ను మాదయగా జూసెరు గోసెట్టుకొన్నది నగాయితు—ఆరికాడేనాను గొర్రెలు కాసేడ్ని. ఈ పుల్ల గొర్రి—ఆ ఎల్లమచ్చలవడ్డా ఆరిచ్చినాటి సంతతే మా దొడ్డ పెబువు. పెదరాజుగోరంటే సుట్టు పక్కాలంతా అదలు."

"ఆ రాజుగారా !" అన్నాడు శంకరం వినదామనే ఆసక్తితో.

"ఇనండి ! రాజుగోరి భార్య, పెదరాజుగోర్ని సిన్న పిల్ల సిట్టెమ్మగోర్ని ఒగ్గేసి నా సిన్నతనాంలోనే సొరగాని కెళ్లిపోయినారు. ఆ సిట్టెమ్మగోర్ని యిన్నింత పిల్లకాడ్నుంచి పెదరాజుగోరు సేతుల్లో ఎట్టుకొని పెంచి పెద్దాయిన్ని సేసినారు. ఆ యమ్మగోరు మాం సూత్తుండంగానే సిన్నగాల్లోనెట్టిన్నాటికి నదా రేక్కు నిండి, బంగారంనాగ పచ్చగ నలకజాకి, లచ్చిందేవినాగ మిలమిల మెరిసిపోతుండోరు.

పెదరాజుగోరు కూతుర్నొగ్గి ఒక్క సిటం ఎక్కడుండోరు కాదు. ఎక్కడికెల్తే అక్కడికా యమ్మా యెంట సెల్లవట్సిందే. కూతురు పీన

ఒక పాలవాడు పాలుపితికే సీటికోసం చాలాసేపు వెతికాడు. కానీ ఎక్కడా కుర్చీ దొరకలేదు. చాలాసేపు వెదికాడు. ఆ పశువు (క) న్నెటితోనే పాలగిన్నె నిండిపోయింది. దానినిచూచి చాలా సంతోషపడి వెళ్ళిపోయాడు.

కె. కృష్ణారావు, (మద్రాసు)

పమతోటే రాజుగోరు మళ్ళీ యివాహం సేసుకోనేదు. బెమ్మచారి గుండిపోనారు.

ఆ రీలాగున్న టయాంలో రాజుగోరింటికి పట్నాల్లో గొప్ప సదూ సదివిన ఆరి మేనల్లుడు పద్దనాభరాజొచ్చిండు. ఆ మారాజుకిద్దెంతుంటేందుకూ ? చీ —యీరింట్లో అడుగెట్టినో డెట్టినట్టుండక యీ కబురాకబురు సెప్పి సిట్టెమ్మగోర్ని సల్లగా వల్లో ఒడీసుకుండు. పెదరాజుగోరి కేటెరిక !

సిట్టెమ్మగో రా మాయిదారి మారాజోల్లో బడిపోయి, మాటల్తో మంత్రించేసి, పెదరాజగోర్ని కూడ బోల్తా జేసీసినారు. ఆడి కబుర్లకి మోసపోయి పెదరాజుగో రొప్పేసుకుని, సిట్టెమ్మగోర్నిచ్చి, పద్దనాబరాజుకి యివాహం సేసీసినారు

ఇంకేంటుంది ? పెళ్లయినోరం నాటికే ఆయమ్మ కారేసుకొని బుర్రున పారొచ్చింది ! గొర్రెల్నోగేసి కారు సూద్దామని నాను పారొచ్చినాను

అపొద్దు పెదరాజుగోరు యీపదరుగుమీద సరికింబడి, తుపాకి కొట్టుకొని తాటిసెట్టు మొవ్వుల్ని గురేస్తున్రు. కారు కారెనక మావంచరం పొద్రాడట సూసి అరుగుమీన కొచ్చి నిలబడ్డారు. కారు దిగి పీనపెటోడి నాటకంలో సెంద్రమతమ్మనాగ—ఆయమ్మ నచ్చిన పీనని బుజాన్నాడీసుకుని తిన్నగా పెదరాజుగోరి కాడకెళ్ళి ఆరి పాదంమీ దాపిల్ల నొడీసింది !

పెదరాజుగోరి కాయమ్మెవురో ఏటో అరదం కానేదు. బిక్కసచ్చిపోయి నిలబడ్డారు.

యీసడంతాయిని అప్పుడే దువ్వారం దాటొచ్చిన పద్దనాబరాజు ఆయమ్మని సూసి గతుక్కుమనిపోయి గాబరయెత్తి పారిపోబోనాడు. ఆయమ్మ పద్దనాబరాజు రెక్కట్టుకొని పెదరాజుగోరికాడకి నాక్కొచ్చి గోలగోలున 'గోలెట్టి, ఆయమ్మకి పద్దనాబరాజు సేసిసిన అన్యాయమంతా సెప్పుకొని ఏడిసేసింది.

కాళ్లమీ దొడిసిన సిన్నపిల్ల తండ్రికోసం బెంగెట్టుకోని సచ్చిపోనాదంట. ఆయమ్మని పద్దనాబరాజు పట్నాల్లో పేమించి అదేదో పెళ్లి సేసుకుని, ఒగ్గిసొచ్చినాదంట. ఆసంగ తెవురికీ సెప్పనేదు. పెదరాజుగోరుగాని, సిట్టెమ్మగోరుగాని కానుకోనేపోనారు. పద్దనాబరా జార్ని ముంచీనాడు

అమట్టిన పెదరాజుగో రెక్కడ్నేని కోపంతో అగ్గిపిడుగైపోయి, యిల్లూ, ఒల్లూ మరిసిపోనారు. పద్దనాబరాజుమీ దెక్కెట్టిన తుపాకీ బారొగ్గేసినారు. "డాం"మ్మని పేలి ఆ గుండు పద్దనాబరాజు గుండెల్లో దూసుకుపోనాది ఆ మారాజు రగతాల్లో పడ్డిపోనాడు. ఆయేపు సూడ్నేకపోనాను. ఆ డటువచ్చాడో నేదో! సిట్టెమ్మగోరు జామ్మని పరిగెట్టి—అల్లదుగో ! ఆటు సూడండి—ఆ పెద్దూతిలోకి దూకీసినారు.

ఆయమ్మకోసం పెదరాజుగోరు పరిగెట్టెల్లారు గాని నాబం నేకపోనాది. రాజుగోరి సేతికి దొరికినారు కాదు. బానంలాగెల్లి అందులో కురికీసినారు.

ఆ టయాంలో ఎండలు మా జోరుగున్నాయేమో —ను ఎయ్యండిపోనాది. నూతదుగుని బండరాతి వణుక్కి సిట్టెమ్మగోరి బుర్ర గుద్దుకొని రెండు సెక్కలైపోనాది. నుయ్యంతా రగతం రగతమయిపోనాది. ఆ నూతిగట్టుకాడ్నుండి పెదరాజుగోరు మరి తిరిగి రానేదు. సేతిలో తుపాకెత్తి గుండెమీ దెట్టుకొని పేల్చేసుకున్నారు రగతం సిమ్మేసింది. ఆ రగతాల్లో యిలవిల్లాడిపోనారు.

సావులన్నీ సూసినాను. బేజారెత్తిపోయి మంచం పట్టేసినాను. ఆ దిగిని మాగొప్ప కాయిలా పడిపోనాను. పొలాలావాసవాకా మర్నెగనేపోనాను. ఆ తరవాత్తేరిసిందింనెండి. ఆరంతా దెయ్యాలైపోనారు. మా ఒల్లమాల్ని దెయ్యాల్నెండి !" అని కోనారి గురయ్య దెయ్యాల కథ చెప్పేడు.

శంకరం తలమీద జుత్తు ఏదుబంది కొయ్యిలా జిల్లున నిలుచుంది.

"మాం రోజూ యిందమ్మటే తిరుగుతాం. మమ్మన్నేటనవు. ఎప్పుడన్నా—ఎవురన్నా ఆటూనుకెల్తే, ఆటికేయిడంగా నన్నా అపకారం తలపెడితే ఆ డప్పట్టుకో నొగ్గవు మాకా న్దెయ్యాలు. సత్తెమైన దెయ్యాలు, జాగర్తగా మసులుకోండి బాబుగోరూ" అని చెప్పి చెదిరిపోయిన గొర్రెలను కూడగట్టుకొని అదలించుకొంటూ వెళ్లిపోయాడు కోనారి.

శంకరం సైకిలు వెతకాలన్న యోచన లేకుండా వెనక్కి తిరిగి ఎక్కడనుండి బయల్దేరాడో అక్కడికి పిక్కబలం అంతా ఉపయోగిస్తూ పరుగు పరుగున ప్రయాణం సాగించసాగేడు.



## చిత్రపరిశ్రమపై ఆధిపత్యం
### కేంద్ర ప్రభుత్వ యోచన

చలనచిత్ర పరిశ్రమను ఇప్పుడున్నట్లుగా సమాచారశాఖ క్రిందనే ఉంచడమా, వాణిజ్య పరిశ్రమల మంత్రిత్వం క్రిందకు మార్చడమా అనే విషయం పరిశీలనలో ఉన్నట్లు తెలుస్తోంది.

సమాచారశాఖ కేవలం ప్రభుత్వ విధాన ప్రచారంకోసం ఏర్పడిందేనని, ఏ వాణిజ్యప్రధానమైన పరిశ్రమైనా ప్రచారయోగ్యమనే ఏదో అస్పష్టపు సాన్నిహిత్యం వల్లనే చిత్రపరిశ్రమను సమాచారశాఖ క్రిందకు చేర్చటం జరిగిందని, పలువురు పారిశ్రామికవేత్తలు అభిప్రాయపడుతున్నారు.

## తర్జుమా చిత్రాలు తెలుగుజాతికి అవమానం

చలనచిత్ర పరిశ్రమ ఈ నాడు కళారంగంగా ఉండటంలేదని, కేవలం వ్యాపార దృష్టితోనే సాగుతోందని, పరిశ్రమ ఆర్థిక వ్యవస్థను దిటువు చేసుకోవాలనే తాపత్రయంతో మన నిర్మాతలు, బాగా డబ్బు చేసుకున్న అన్యభాషా చిత్రాలని తర్జుమా చేయటం జరుగుతోందని, ఇందులో నిజమైన కళాసేవ లేదని, ఈ స్థితి చిత్రరంగంలో ఏర్పడటం తెలుగుజాతికే అవమానం అని, ఈ అవాంఛనీయ పరిస్థితి నుండి చిత్రరంగాన్ని మళ్ళించటం మన విధి అని ప్రముఖ చలనచిత్ర నటుడు, దర్శక నిర్మాత శ్రీ చిత్తూరు వి నాగయ్య ఇటీవల చెన్నపురి ఆంధ్రమహాసభ వారు దసరా మహోత్సవాల సందర్భంలో ఏర్పాటు చేసిన ఏకాంకిక ప్రదర్శనపు పోటీలను ప్రారంభిస్తూ అన్నారు

తెలుగు చిత్రరంగానికి, క్రొత్తముఖాలు, క్రొత్త కథలూ అవసరమని, అటువంటి నూతనత్వాన్ని నాటకరంగం ప్రవేశపెడ్తే, చిత్రరంగం సుహృదయంతో స్వీకరిస్తుందని కూడా శ్రీ నాగయ్య అన్నారు.

శ్రీ జె. వి. సోమయాజులు అధ్యక్షతన జరిగిన ఈ ప్రారంభోత్సవ సభ కార్యదర్శి పంతుల సముద్రాలతో సమాప్తమైంది

ఆంధ్రపత్రిక అభ్యుదయ కళామండలి తాలూకు ఔత్సాహిక నటవర్గం ప్రదర్శించిన 'గడ్డిపూలు' ఏకాంకికతో పోటీలు ప్రారంభ మయ్యాయి. శ్రీ కె గోపాల్ దర్శకత్వాన ఈ ప్రదర్శనలో శ్రీయుతులు కె వసంతకుమార్, యస్ బి జ్ఞానశేఖరం, కె రామచంద్రయ్య, కె. గోపాల్, సంపత్ కుమార్ ప్రభృతులు పాల్గొని పాత్రోచితంగా నటించారు. తరువాత అన్నపూర్ణా ఆర్ట్ థియేటర్స్‌వారు శ్రీ పోతుకూచి సాంబశివరావు రచించిన 'దొంగ' ఏకాంకికను ప్రదర్శించారు.

* * *

## హిందీ చిత్రజగత్
### "రాఖీ" నిర్మాణం

తమిళంలో ఘనవిజయం సాధించిన 'పాశమలర్' చిత్రాన్ని ప్రభుదాస్ పిక్చర్స్‌వారు హిందీలో 'రాఖీ' అనే పేరుతో పునర్నిర్మిస్తున్నారు.



కవితా చిత్రవారి 'వాగ్దానం'లో రేలంగి,



'వాగ్దానం'లో చలం

ఈ చిత్రానికి విజయ—వాహినీ స్టూడియోలో ఇటీవల పూజ జరిగింది

అశోక్‌కుమార్, ప్రదీప్‌కుమార్, వహీదా రెహమాన్, అమీతా, మహమూద్ నటిస్తున్న ఈ చిత్రానికి శ్రీ ఎ భీమ్‌సింగ్ దర్శకత్వం వహిస్తున్నారు ఈ చిత్రానికి సంభాషణలు : రాజేంద్ర కిషన్, సంగీతం : రవి

ముహూర్తం సమయానికి అశోక్‌కుమార్, ప్రదీప్‌కుమార్, వహీదారెహమాన్‌లతో ఒక సన్నివేశ చిత్రీకరణ జరిగింది.

## హిందీలో ఉత్తమ నటీనటులు మధుబాల, దిలీప్‌కుమార్

హిందీ నటుడు దిలీప్‌కుమార్, నటి మధుబాల, 1960 సం చిత్రాలలో ఉత్తమ నటుడుగా, నటిగా ఎన్నికయ్యారు.

చలనచిత్ర విమర్శకుల సంఘం చేసిన ఎన్నికల వివరాలు : ఉత్తమ చిత్రం : అనూరాధ దర్శకుడు : ఎం సాదిక్, కవి : శచీదేవిర్ (అనూరాధ), గేయకారుడు సాహిత్ (బర్సాత్ కిరాత్), సంగీతం : శంకర్, జైకిషన్ (దిల్ అపనా ప్రేమ్ పరాయే), సంభాషణా రచయిత : రాజేంద్రసింగ్ బేడి (అనూరాధ), ఛాయ : ఆర్ డి మధువీర్ (మొఘల్—ఇ—ఆజామ్), కూర్పు : ధరమ్‌వీర్ (మొఘల్—ఇ—అజాం), శబ్దగ్రహణం : మోడీ (కోహినూర్) నృత్య దర్శకత్వం: లచ్చూ మహారాజ్ (మొఘల్—ఇ—అజాం) కళ : సజ్జాద్ (మొఘల్—ఏ—అజాం).

సహాయనటుడు: మోతీలాల్ (పరాఖ్), సహాయనటి : కుంకుం (కోహినూర్,) గాయకుడు : రఫీ (చౌద్వీన్‌కాచాంద్) గాయని లత (దిల్ అపనా ప్రీత్ పరాయే)

ఉత్తమవిదేశీ చిత్రం క్రొవ్స్ ఆర్ క్రైయింగ్.

★



ప్రసాద్ ప్రొడక్షన్స్ వారి 'ససురాల్'లో రాజేంద్రకుమార్, బి. సరోజాదేవి.

# మనమూ—మన రాష్ట్రం

(11-వ పేజీ తరువాయి)

అభ్యంతరం చెబుతారని ఎవరూ అనుకోలేదు. నాయకత్రయం సిఫార్సులు ఎన్నికల సంఘానికి వచ్చేదాకా ఆయనకు తెలియదా, తెలిస్తే ఈ రభస లేకుండా ముందుగానే పల్లంరాజు, అల్లూరి, బ్రహ్మానందరెడ్డిగారలతో మాట్లాడి తెలుకోవచ్చుగదా? సిఫార్సుల తరహా ఎట్లాఉండేది ముందుగానే తెలిసినా, మార్పులు కోరడానికి కొంత హంగామా, ఆందోళన అవసరం. అందుకనే, హరిజన, గిరిజన, వర్గాలవారు నెహ్రూవద్దకువెళ్ళి విన్నవించుకునేదాకా, తన బసలో జగ్జీవనరాం సమక్షంలో సమావేశం జరిపి తన సహాయం అభ్యర్థించేదాకా తమాయించారు. దానికితోడు అభ్యర్థిత్వం రాని వారందరూ ఆయన చుట్టూ చేరారు. ఇక ఇప్పుడు ఇందరి తరఫున ఇన్ని వర్గాల నాయకుడుగా ఆక్షేపణలు తెలుపుతున్నారంటే కొంత శ్రద్ధగా పునర్విమర్శించక తప్పదు. అయితే ఈయన తెలిపే 59 ఆక్షేపణలు నిజంగా తీవ్రమైన ఆక్షేపణలేనా అంటే, ఆ ఆక్షేపణల స్వరూపం ఎటువంటిదో తెలిస్తేగాని చెప్పలేం. ఏమైనా ఆయన అనుయాయులనుకునే కొందరి అభ్యర్థిత్వం నిరాకరింపబడినమాట వాస్తవం. ఈ సందర్భంలో నాలుగైదు పేర్లు వినిపిస్తున్నాయి. వారందరికీ అభ్యర్థిత్వం ఇస్తే ముఖ్యమంత్రికున్న తదితర ఆక్షేపణలు తొలగిపోవచ్చు. ముఖ్యమంత్రికి పోటీగా శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి తెచ్చిన 25 ఆక్షేపణలు కూడా వాటితోపాటే అంతర్థానం కావచ్చు. లేదా ఈ తగాదా ఇలాగేసాగితే పైన శ్రీ సంజీవరెడ్డి, కేంద్ర ఎన్నికల సంఘం ఉండనే ఉన్నారు. ప్రదేశ్ ఎన్నికలసంఘం ఏకగ్రీవంగా సిఫార్సులు పంపినా మార్పులు జరగవని హామీలేదని ఇదివరకే శ్రీ రెడ్డి అన్నారు. కనుక చివరికి పిట్టపోరు, పిట్టపోరు పిల్లి తీర్చినట్లుగా పరిష్కరించివేస్తారు.

* * *

అమ్మకంపన్ను చట్టం వర్తకలోకంలో గందరగోళం రేపింది. ఇప్పటికి పది పదిహేనురోజులుగా రాష్ట్రంలో ప్రతిచోటా సభలుజరిపి చట్టాన్ని ప్రభుత్వాన్ని దుయ్యబడుతున్నారు. ప్రజాదృష్టి నాకర్షించడంకోసం హర్తాళ్ కూడా చేస్తున్నారు. ఈ నిరసన చర్యలవల్ల ప్రభుత్వవైఖరి ఏపాటి మారుతుందో తెలియదుకాని, కాఫీ భోజన హోటళ్లుసైతం మూయించి ఇబ్బంది పెడితే ప్రజలకు తామంటేఉన్నకొద్ది సానుభూతి కూడా కోల్పోయే ప్రమాదంఉంది. ఇంతకూ గవర్నరు ఆమోదం పొంది చట్టం అమలులోకి వచ్చిన తరువాత, ఈ ఆందోళన, గత జలసేతుబంధనగా కన్పిస్తోంది.

అమ్మకంపన్నుచట్టం విషయంలో వర్తకుల అలజడి ఈనాటిదికాదు. 1959 డిసెంబర్‌లో మొట్టమొదటగా ప్రభుత్వం ఈ చట్టానికి సవరణ బిల్లు ప్రకటించినప్పుడు, రాష్ట్రమంతటా పెద్ద గొడవ జరిగింది. ఆ బిల్లులో క్లాజులు తమను అనవసరంగా బాధించేవిగా ఉన్నవని మొరపెట్టుకుంటే ఆర్థికమంత్రి వాటిని తొలగించడానికి ఒప్పుకున్నారు. ఆ క్లాజులనే తిరిగి కొత్తరూపంలో ప్రస్తుత చట్టంలో చేర్చి, మాటతఫావతుగా మంత్రి వ్యవహరించారని వర్తకులు అంటున్నారు. మంత్రిగారి మాట తఫావతుసంగతి ఏమికాని, ప్రస్తుతచట్టంలోని కొన్ని క్లాజులకు 1959 డిసెంబర్‌లో ప్రకటించిన బిల్లులోనివాటికీ పెద్దతేడా ఏమీ కన్పించడంలేదు. అసలే వర్తకులంటే అలుసు. అందులో అప్పీలుకు కూడా అవకాశం లేకుండా చేసి చిన్న అధికారులకు పెద్ద అధికారాలిస్తే ఇక చెప్పాలా. ప్రస్తుత చట్టంలో అసెస్‌మెంట్లురివైజుచేసే పైగా గడువు 4 ఏళ్ళనుంచి ఆరేళ్లవరకూ పొడిగించారు. ఇది చట్టం ప్యాసైనతేదీనుండి అయితే ఫర్వాలేదుకాని చట్టాన్ని వెనుకటినుంచి (అంటే 1957 జూన్ నుంచి) అమలులోకి వచ్చినట్లు పరిగణించడంచేత, ముగిసిపోయిన లెక్కల పుస్తకాలన్నీ మళ్ళీ ముందు వేసుకోవలసిన అవసరమేర్పడి వర్తకులకు చాలా ఇబ్బంది కలుగుతుంది. ఏమైనా ఒకదఫా పెద్ద ఆందోళనకు కారణమైన క్లాజులనేచేర్చి, మళ్ళీ ఆందోళన రెచ్చగొట్టడంలో ప్రభుత్వ ఉద్దేశ్యమేమిటో తెలియదు. ఒకవంక ఇంత అలజడి జరుగుతుంటే, ప్రభుత్వ వైఖరి వివరించి సర్దిచెప్పవలసిన ఆర్థికమంత్రిగారు ఏకారణంవల్లనో మౌనముద్ర వహించారు. బహుశః ఎన్నికల అభ్యర్థుల గొడవలోపడి ఈ సంగతి పట్టించుకోడంలేదేమో.

అసలు ఈ బిల్లును గురించి ముందుగా మేల్కొని ప్రభుత్వంపై తగినంత వత్తిడి తేకపోవడం వర్తకుల తప్పు. బిల్లును ప్రజాభిప్రాయంకోసం ప్రకటించలేదని అంటున్నారు. కాని అది నిజంకాదు. బిల్లును ప్రభుత్వం 1961 జులైలోనే ప్రకటించింది. అమ్మకంపన్ను సలహా సంఘంలో చర్చ కూడా జరిగింది. తరువాత బిల్లు ఆగస్టు 4 న ఉభయ శాసన సభల చేత ఆమోదింపబడింది. బిల్లు ప్రకటించిన గెజెట్ తమకు ఆలస్యంగా—అంటే బిల్లు చట్టమైన తరువాత చేరిందనడం ఒక సాకుగా ఎవరూ అంగీకరించరు. జిల్లాలలోఉన్న వర్తక సంఘాలకు ఆలస్యంగాచేరితే చేరవచ్చు. కాని రాజధానిలోనూ, ఉభయ శాసనసభల లోనూ తమ ప్రతినిధులు ఏం చేస్తున్నట్లు? అమ్మకంపన్ను సలహాసంఘంలో చర్చకు వచ్చినప్పుడైనా జాగ్రత పడలేకపోయారా? పోనీ బిల్లు ఉభయ సభలలోనూ ప్యాసైన తరువాత,గవర్నర్ ఆమోదంపొందటానికి నెలరోజులు పట్టింది. అప్పుడు కూడా ఏం చేయలేదు. అంటే, బిల్లు ప్యాసవడానికిముందుఉన్న నెలరోజులు, ప్యాసైన తరువాత అమలులోకి రావడానికి ఉన్న నెలరోజులు వృధా చేశారన్నమాటేగదా! అప్పట్లో గట్టిగా ఆందోళన చేసిఉన్నట్లయితే బిల్లు అమలులోకి రాకుండా వాయిదా వేయడం సాధ్యమయ్యేదేమో.

తీరా చట్టం అమలులోకి వచ్చింతరువాత చట్టంలో క్లాజులు తొలగించాలని, చట్టాన్ని రద్దు చేయాలని అడిగితే అది జరిగేపనిగాదు. పైగా చట్టాన్ని రద్దు చేయడానికి గవర్నరు ఆర్డినెన్సు జారీ చేయాలనడం మరీ వింతగాఉంది. ఉన్న చట్టం చెల్లకుండా పోయినప్పుడు దానికి ప్రాణ ప్రతిష్ట చేయడానికి ఆర్డినెన్సు జారీచేయడం కద్దు. అంతేగాని అమలులో నున్న చటాన్ని రద్దు చేయడానికి —అందులోనూ కొత్తగా చేసినదాన్ని— ఆ అధికారం ఉపయోగించరు. కాగా వర్తకుల ఆందోళన ఫలించే అవకాశం కన్పించదు. ఎలాగూ చట్టం అమలులోకి వచ్చింది గనుక, ఇది ఎలా పని చేస్తుందో ఇందువల్ల వర్తకులకు కలిగే కష్టనష్టాలెటువంటివో ప్రభుత్వం ప్రత్యక్షంగా తెలుసుకోడానికి వ్యవధిఇచ్చి, ఈ ఆందోళనను ఇంతటితో విరమించడం ఉత్తమం. ★

# మనమూ—మన దేహస్థితి

(13-వ పేజీ తరువాయి)

భాగం డుయోడినంతో కలిసి ఉంటుంది. డుయోడినం గుర్రంనాడం ఆకారం కలది. కాని గుర్రంనాడం రెండు కొమ్ములు సమానంగా ఉన్నట్లు డుయోడినం కొమ్ములు ఉండవు. డుయోడినంలో ఒక అంగుళం పొడుగున్న మొదటి భాగం మాత్రమే కదులుతూ ఉంటుంది. మిగతా భాగమంతా ఉదర ప్రదేశం వెనుక గోడకు అతుక్కొనివుండి అంతగా చలించదు. ఈవిధంగా జఠరాశయం పైనా క్రిందా కట్టివేయబడి గుడ్డతో చేసిన ఉయ్యాలలాగా మధ్యభాగం, ఆకృతిలోనూ సంస్థితిలోనూ కూడా మార్పులు చెందడానికి వీలుకలిగి ఉంటుంది. జఠరాశయం పైభాగమును 'ఫండస్' అనీ, క్రింది భాగమును పైలోరస్ (Pylorus) అని అంటారు. ఈసొఫేగస్ జఠరాశయమును కలిపే చోట ఒక కండరముతో నిర్మింపబడిన ఉంగరంవంటి నిర్మితి ఉన్నది. జఠరాశయం గోడలో నిలువుగా వ్యాపించిన కండరములు, అడ్డంగా వ్యాపించిన కండరములు ఉన్నవి. అడ్డంగా వ్యాపించిన కండరముల ఆధిక్యతవల్ల యీ కండరముల ఉంగరం ఏర్పడుతుంది. ఇటువంటి నిర్మితిని 'స్ఫింక్టరు' (Sphincter) అంటారు. ఈ నిర్మితి హృదయానికి సమీపంగా ఉన్నందున దీనిని కార్డియాక్ స్ఫింక్టరు అంటారు. 'కార్డియం' అంటే హృదయం అని అర్థం. అల్లాగే క్రింది భాగమైన పైలోరస్, డుయోడినము చేరేచోట మరొక స్ఫింక్టరు ఉన్నది. దీనిని పైలోరిక్ 'స్ఫింక్టరు' అంటారు. 'పైలోరస్' అంటే 'ద్వారరక్షకుడు' అని అర్థము. ద్వార రక్షకుడు ప్రవేశించేవారిని పరిశీలించి ఎవరిని లోపలకు పోనివ్వాలో, ఎవరిని పోనివ్వరాదో ఆలోచించి పోనిచ్చినట్లు, అటకాయించినట్లు, ఈ స్ఫింక్టరు జీర్ణమై డుయోడినంలోకి పోదగిన ఆహారాన్ని తను పెద్దదై తెరుచుకుని పోనిస్తుంది. లోపలికి వదలడం మంచిది కాదనో ప్రమాదకరమనో తోచినప్పుడు బిగుసుకొని పోనివ్వదు. ఈ పైలోరస్ పూర్తిగా తెరుచుకున్నప్పుడు ఒక వ్రేలు దూరగలిగినంత పెద్దదిగా ఉంటుంది. ఈవిధంగా జఠరాశయం తల్లక్రిందులుగా వుంచిన, వంపువున్న సొరకాయలాగా ఉంటుంది.

(సశేషం)

# హరివంశం

(15-వ పేజీ తరువాయి)

మగు సూర్యమండలాంతర్గత పురుషున కాశ్రయమైన నేత్రమే యగుచున్నది. ఈ నేత్రము సత్యాత్మక మైనది. ఇది బలరూపమగు ప్రాణమునందుంచబడి యున్నది. కనుకనే ప్రాణము నేత్రేంద్రియము కంటె, బలిష్ఠమైనదానినిగా ఋషులు చెప్పుచున్నారు. ఈవిధముగా మూడు పాదములు గల గాయత్రి పరమాత్మస్వరూపమైన ప్రాణమునందుంచబడియున్నది. ఇట్లుంచబడిన ప్రాణరూపమైన గాయత్రి వాగాదేంద్రియములను కాపాడుచున్నది. వాగాదేంద్రియములను కాపాడుచున్నది గనుకనే గాయత్రి యను పేరు కల్గినది. లోకమునందు ఆచార్యుడు ఎనిమిది సంవత్సరములు గల బాలునికి ఉపనయన సంస్కారములు కలుగజేసి సవితృదేవతాకమైన సావిత్రిని ఉపదేశించుచున్నాడు. ఆ సావిత్రియే ఉపదేశమును పొందిన బాలుని ప్రాణముల రక్షించుటవలన గాయత్రి యగుచున్నది.

"సైషా గాయత్ర్యే తస్మిగ్ం స్తురీయే దర్శతే పదే పరోరజసి ప్రతిష్ఠితా. తద్వై తత్సత్యే ప్రతిష్ఠితం. చక్షుర్వై సత్యం. చక్షుర్హివై సత్యం. తస్మాద్యదిదానీం ద్వౌ వివదమానౌ ఏయాతా మహమదర్శ మహమశ్రౌషమితి, య ఏవ బ్రూయాదహ మదర్శ మితి, తస్మా ఏవ శ్రద్దధ్యామ. తద్వై తత్సత్యం బలే ప్రతిష్ఠితం. ప్రాణో వై బలం. తత్ ప్రాణే ప్రతిష్ఠితం. తస్మా దాహుర్బలగ్ం సత్యాదో గీయ ఇతి. ఏవం ఏషా గాయత్ర్యధ్యాత్మం ప్రాణే ప్రతిష్ఠితా. సాహైషాగయాగ్ం స్తత్రే. ప్రాణావై గయాః. తత్ప్రాణాగ్ం స్తత్రే. తద్యద్గయాగ్ం స్తత్రే తస్మాత్ గాయత్రీనామ. సయా మేవా మూగ్ం సావిత్రీ మన్వాహ, ఏషైవ. సయస్మా అన్వాహ తస్య ప్రాణాగ్ం స్త్రాయతే." ★

---

ఒకడు:–ఒక ఇంట్లో దొంగతనం చేసి డబ్బు తీసికెళ్ళిపోతున్నాడు. ఆ యింటి యజమాని దొంగను చూచి భయపడ్డాడు. అంతలో ఆలోచన తట్టింది. దొంగతో "అవి కోయంబత్తూరు నోట్లు" అన్నాడు.

దొంగ:–ఫర్వాలేదు. నేను సి. ఐ. డి.ని. ఈ నోట్లు పోలీసుల కప్పచెప్తాను లెండి.

ఎం. యం. ఖాన్ (రాజమండ్రి).

---

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రకటనలు
మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి

# "పొదుపు గురించి ఎప్పుడైనా ఆలోచించారా?"

"ఆ...బేంకులో మాత్రంకాదు...బేంకులోనికి వెళ్లడమంటేనే భయం."

"నేషనల్ అండ్ గ్రిండ్‌లేస్ బేంకులోనికి వెళ్లడానికి మీరేమీ భయపడనక్కర్లేదు. అక్కడ అందరూ చాలా మర్యాదగా, సహాయకారిగా, వుంటారు."

"అయితే సరే"

మీకు కావలసిందల్లా రూ. 5/- సేవింగ్సు బేంకు ఖాతా తెరిచేటందుకు, సాలుకు 3% వడ్డీ లభిస్తుంది."

"అయితే నేను ఆలస్యం సహించ లేను"

"డబ్బు కట్టేటందుకు గాని, తీసేటందుకు గాని పది నిమిషాలు పడతాయి. డబ్బు తీసేటందుకు మీకు చెక్కు పుస్తకం కూడా దొరుకుతుంది.

"సరే, అయితే ఎంతవరకు డబ్బు తీయవచ్చు"

"వారానికి రెండు సార్లు, మీ మూలధనంలో నాలుగో వంతుగాని లేక రూ. 1000/- గాని ఏది ఎక్కువ అయితే అది."

"అలాగా – నేషనల్ అండ్ గ్రిండ్‌లేస్ బ్యాంక్"

"అవును! నేషనల్ అండ్ గ్రిండ్‌లేస్ బ్యాంకులో డబ్బు దాచుకోవడం అంటే భద్రతా, ఉజ్వల భవిష్యత్తు అని గుర్తుంచుకోవండి."

ఖాతా తెరిచే ఫారాలకోసం మా బ్రాంచీలలో ఏ ఒక్కదానినైనా సందర్శించండి లేదా వ్రాయండి.



## నేషనల్ అండ్ గ్రిండ్‌లేస్ బ్యాంక్ లి.,

సభ్యుల మితబాధ్యతలతో ఇంగ్లండులో స్థాపించబడింది

మద్రాసు బ్రాంచీలు: 8 నార్త్ బీచ్ రోడ్, 378 నేతాజీ సుభాష్ చంద్ర బోస్ రోడ్, (లాయర్స్ బ్రాంచ్)
6 అర్మీనియన్ స్ట్రీట్, 158 మౌంట్ రోడ్.

# బుచ్చమ్మ రహస్యం

(9-వ పేజీ తరువాయి)

సూర్యం, రవి చెయ్యి నొక్కాడు. రవి చీకట్లో ఆ అమ్మాయివేపే చూస్తూ, గమనించలా. సూర్యం రవిని గట్టిగా గిల్లాడు. రవి, "ఏమిట్రా?" అని సూర్యాన్నడిగాడు. "మాటలు కలిపెయ్. ఎవరో, ఏమిటో విషయం లాగెయ్" అన్నాడు. రవి తలూపాడు.

పానీయాలు పుచ్చుకుని "థాంక్స్" అన్నారు యువతులిద్దరూ.

రవి మెల్లిగా "నో మెన్షన్" అన్నాడు. నాయిక సినిమా చూడ్డంలోనూ, రవి చీకట్లో నాయిక సౌందర్యాన్ని చూడడంలోనూ నిమగ్నులైపోయారు. మధ్య మధ్య నాయిక రెండు మూడు సార్లు రవి వేపు చూసింది. రవికి ఏవో మాటలు మాట్లాడదా మనిపించింది. ఏం మాట్లాడాలో తెలియక తికమక పడ్డాడు. సినిమా అయిపోవచ్చింది. నాయిక మరోకసారి రవివేపు చూసింది. రవి ఆమెవేపు దీనంగా చూశాడు. నాయిక—ప్రియసఖివేపు తిరిగి "రేపు ఇంగ్లీషు పిక్చరు మాటినీకి తప్పకుండా వెళ్దాము" అంది. రవి వినేట్టుగా.

పిక్చరు అంత తొందరగా ముగిసిపోతుందని రవి అనుకోలేదు. ఆఖరి రీలు అయిపోవడం, తన మనో నాయిక తనవేపు ప్రేమభరితచూపులు చూస్తూ వెళ్ళిపోవడం, తను మిత్రబృందంతో బయటికి రావడం, రవికి తెలియకుండానే జరిగాయి. నాయిక కారెక్కి వెళ్ళిపోవడం కూడా చూశాడు. సూర్యం "ఏం బ్రదర్! ఇంక మమ్మల్ని మరిచిపోతావేమిటి?" అని వీపుతట్టాక, రవికి మెదడులో రక్త సంచలనం కలిగింది.

"ఒరేయ్! సూర్యం. నీ మేలు మర్చిపోలేమురా!" అన్నాడు రవి.

"అదేమిట్రా! అసలు 'సినిమా అయిడియా' ఇచ్చింది నేను" అన్నాడు గిరి.

"గిరి! ఈ జన్మలో నీ ఋణం తీర్చుకోలేమురా."

"సరేలే. ఇంతకీ ఏమైనా 'ప్రోగ్రెస్' వుందా?" అనడిగాడు సత్యం. నలుగురు ఫ్రెండ్సూ నడుస్తూ మాట్లాడుకోసాగారు.

"ఏమీలేదురా. నా కసలు ఏం మాట్లాడాలో తోచ లేదురా" అన్నాడు రవి.

"చంపేశావురా. ఇంత శ్రమా బూడిదపోసిన పన్నీరైపోయింది" అన్నాడు గిరి.

"అసలా అమ్మాయి పేరేమిటో, ఎవరి తాలూకో తెలుసుకోలేకపోయావా?"

"లేదురా సూర్యం. నాకు ఆ విషయాలు తోచనే లేదు."

"పోనీ ఆ అమ్మాయి నీతో ఏమన్నా మాట్లాడ లేదూ."

"లేదుకాని, తన స్నేహితురాలితో 'రేపు ఇంగ్లీషు పిక్చరు మాటినీకి తప్పకుండా వెళ్దాము' అందిరా"

"వెరిగుడ్" "కంగ్రాట్స్" అంటూ మిత్రులు రవికి 'షేక్‌హాండ్' ఇవ్వటం మొదలెట్టారు. "నేను ముందే అనుకున్నాను. ఆ అమ్మాయి చాలా తెలివైనదని" అన్నాడు సూర్యం.

రవికి వాళ్ళ మాటలర్థంకాలేదు. "మిత్రా మీ వుద్దేశం ?" అని అడిగాడు.

"ఇంకేముందిరా. 'రేపు ఇంగ్లీషు మాట్నీకి వస్తున్నామూ, నువ్వు కూడా రావోయ్—రాజా!' అని ఆహ్వానించడంరా అది" అన్నాడు గిరి.

రవి ఒక్క నిముషం ఆలోచించాడు. "ఒరేయ్ వెనక్కి పదండి!" అన్నాడు.

"ఎందుకు ?" అన్నారు యస్. బి. యస్. "రేపు మాట్నీకి అడ్వాన్సు బుకింగ్‌వుందేమో కను క్కొని ఇప్పుడే టిక్కెట్లు కొనేద్దాం" అన్నాడు. అందరూ నవ్వారు.

"ఫరవాలేదులే. ముందు రూముకి పద" అన్నారు యస్. బి. యస్.

రూముకి వెళ్ళేటప్పటికి రహమాన్ వీళ్ళకోసం ఎదురుచూస్తున్నాడు. రవి నౌఖరైన జోగులు తెచ్చిన కాఫీ, టిఫినూ ఆరగించి, రవి తాలూకు టిన్నులో సగం సిగరెట్లు వూదేస్తూ, జోగులుతో కబుర్లు చెప్తున్నాడు.

"హల్లో! రహమాన్ నీవు వెళ్ళిన పనేమైంది?"

"అద్భుతంగా ఫెయిల్యింది. అసలా అమ్మాయి దీపూరు కానేకాదు. అసలామె అమ్మాయేకాదు. ఆ మనిషికి ఫోటోయేలేదు" అన్నాడు కోపంగా రహమాన్.

"అదేమిట్రా, అమ్మాయి కాపోవడం ఏమిట్రా"

"కాదురా బాబూ. మనవాడిమీద మచ్చుమందు జల్లడానికి వచ్చిన మంత్రకత్తె! మాయామయి! ఈ పాటికి ఏ భూగృహంలోకో, పాతాళగృహంలోకో వెళ్ళిపోయుంటుంది. మనం వెంటనే ఏ భూతవైద్యున్నయినా పట్టుకొని మనవాణ్ణి మనకు దక్కించుకోవాలి."

"రహమాన్! నువ్వు ఆత్రపడకు. మేం యిప్పుడే సినిమానుంచి వస్తున్నాం. రవిప్రక్కనే ఆ అమ్మాయి కూచుంది. డ్రింక్సుతాగింది. రేపు మాటినీకి వస్తున్నాను కాసుకోమంది. ఇంత జరిగింతరువాత నీ మాటలెట్లానమ్ముతాం?" అన్నాడు సూర్యం.

"అయితే నన్ను వదిలిపెట్టి మీరంతా సినిమాకి వెళ్ళి ఆ అమ్మాయిముందు 'స్మైలై'పోయారన్న మాట. అలాంటప్పుడు నాగోల మీకెందుకు?" అని రహమాన్ కోపంగా వెళ్ళిపోబోయాడు. రవి రహమాన్‌ను పట్టుకొని, "ఒరేయ్! మేం ముందర అనుకోలేదురా. నువ్వెళ్ళిపోయింతరువాత గిరిగాడు సినిమా 'ప్రపోజలు' పెట్టాడు. తీరా హాల్లోకి వెళ్ళేసరికి ఆ అమ్మాయి కనిపించింది. ఇంతే జరిగింది" అన్నాడు. రహమాన్ కాస్త ఆగి "హు!" అన్నాడు. అని జేబులోంచి ఒక ఫోటోతీసి రవికిచ్చాడు. రవి ఫోటో చూశాడు. తను వలచిన అమ్మాయిదే.

మిత్రబృందమంతా ఎగబడి ఆ ఫోటోను చూశారు. "హార్రి! ఎంత నాటకమాడేవురా!" అని రహమాన్‌ని మెచ్చుకున్నారు. ఫోటో వెనకాల "సుజాత, దివాన్‌బహద్దర్ పాపారాయుడుగారి అమ్మాయి, మహారాణీపేట" అని వుండడం చదివారు. రహమాన్‌ని ఆఫోటో ఎలా సంపాయించావో చెప్పమన్నారు.

"మెట్రోన్మిడియోలో మన ఫ్రెండు రామ్మూర్తికి అమ్మాయి గుర్తులన్నీచెప్పి, ఫోటోవుంటే ఇమ్మన్నానురా. ఫోటోలన్నీ గాలించి ఇది తీశాం ఇద్దరమూ, ఈ అమ్మాయి జమిందారు పాపారాయుడి

గారమ్మాయట. మద్రాసులో చదువుతోందిట. సెలవులకు వచ్చిందిట. ఏదో పెళ్ళి సంబంధం విషయంలో మొన్ననే వారింటికిపిలిపించి ఫోటో తీయించారట'' అని ఆగాడు.

''అంతేనా, ఇంకేమైనా లాగావా?'' అన్నాడు గిరి. ''చెప్పరా బాబూ!'' అన్నాడు రవి.

''మరేంలేదురా. ఆయన చాలా చండశాసనుడట. ఇంటినిండా ఆయన వేటలో చంపిన పులుల చర్మాలేట. తన కూతుర్ని ఏ జమిందారుల అబ్బాయికోగాని ఇవ్వడేమోనని అనుమానంట.''

''ఆఁ'' అన్నాడు రవి. మిత్రబృందమంతా ''ఆ! అదేమంత పెద్ద విషయంకాదులే. కాలేజీలో చదువుతున్న అమ్మాయి వాళ్ల నాన్నకు లొంగుతుందా, ఏమిటి? కాని, ఒరేయ్! రవి ఇప్పుడు నీ దృష్టంతా ఆ అమ్మాయికి నీమీద ప్రేమ కలగడం మీద కేంద్రీకరింపజెయ్యి. రేపు ప్రొద్దున్న మళ్ళీ

కలుద్దాం" అని తని దగ్గర సెలవు తీసుకున్నారు.

మర్నాడు ప్రొద్దున్న ఏడు గంటలకి నిద్ర నుంచిలేచి, జోగులు తెచ్చిన కాఫీ, టిఫెన్ తినటం పూర్తిచేసి, సుజాత ఫోటోతీసిచూసి (హృదయానికి హత్తుకొని) గడ్డంగీయడం కార్యక్రమం ఆరంభించాడు రవి. జోగులు రూము శుభ్రం చేస్తున్నాడు.

"ఒరేయ్! జోగులూ, నీకు హీరోయినుగారు తెల్సునా?"

"పేరు విన్నానండి" "సుజాత నెరుగుదువా?" "తెలీదండి" "మరేం తెల్సునురా?"

"తక్కినదంతా తెలుసండి" అన్నాడు జోగులు. రవి జోగులువేపు చూశాడు.

"రాత్రి రహమాన్‌గారు చెప్పారండి, బాబూ! మీసం పూర్తిగా తీసెయ్యకండి. అందమంతాపోతుంది. "జోగులూ! మనం మీసం గురించి మాట్లాడటం లేదు." "చిత్తం"

"అసలు ఈ రోజుల్లో హీరోలకు మీసంలేదు తెలుసా ?"

"తమరికి మీసంవుంటే చాలా అందం ఇస్తుంది బాబూ"

"అని నీ అభిప్రాయం. కాని నా అభిప్రాయం అందుకు వ్యతిరేకం. కాబట్టి నా అభిప్రాయం మన్నించాలి. ఒప్పుకుంటావా?"

"చిత్తంబాబూ. కాని నేను నా అభిప్రాయం మార్చుకోలేను."

"అయితేసరే. రెండు కప్పులు కాఫీ ఫ్లాస్కులో పోయించుకురా!" అన్నాడు రవి కోపంగా. జోగులు, రవి నౌఖరనడంకన్నా, అంతరంగిక కార్యదర్శి అనవచ్చు. జోగులు బాగా చదువుకున్నాడు. ఫిఫ్త్‌ఫారం పాస య్యాడు. చాలా పూళ్ళు తిరిగాడు. రవి తండ్రి దగ్గర నౌఖరుగా చేరాడు తిండికి గతిలేక. అతన్ని సామాన్య నౌఖరుగాచూడక, అందరూ గౌరవంగా చూస్తారు. రవి చదువుకోసం విశాఖపట్నంలో కాపురం పెట్టిన దగ్గర్నుంచి జోగుల్ని అతని దగ్గ వుంచారు. రవి అంటే అతనికి విపరీతమైన ప్రేమ.

జోగులుమీదకోపంకొద్దీ, రవి పూర్తిగా మీసం తీసేశాడు. మిత్రబృందంరాగానే అవాళ్టి కార్యక్రమం చర్చించడం ప్రారంభించారు. అవాళ ఏమైనాసరే రవి సుజాతతో మాట్లాడాలనే తీర్మానం ఆమోదించారు. అంతేకాకుండా అవాళ 'మాటినీ'కి తామంతా అనవసరమనీ, ఒక్క రవిమాత్రం వెళ్తే చాలుననీ నిశ్చయించారు. ఎందుకంటే వీళ్ళంతా వున్నారని ఆమె బిడియపడవచ్చు. పైగా ఆమె కూడా ఒక్కర్తే రావచ్చు. అలాంటప్పుడు రవి కూడా ఒక్కడే వెళ్లడం సమంజసం. తాము సినిమా వదిలిపెట్టే టైముకి వచ్చికలుస్తామని హామీ యిచ్చారు.

రెండుగంటలకే పూర్తిగా ముస్తాబై రవి థియేటరు దగ్గర హాజరయ్యాడు. సుజాత ఎప్పుడు వస్తుందా? అని ఎదురుచూస్తూ, నిమిషమొక యుగంగా గడపసాగాడు. సినిమా ప్రారంభించే టైమయింది. మెల్లిగా టిక్కట్టుకొని మేడమెట్లు ఎక్కుతున్నాడు. సరిగ్గా అదే సమయానికి సుజాత కార్లోంచి దిగవస్తోంది. రవి ఆనందం పట్టలేక పోయాడు. వెంటనే ఆమె కెదురుగుండావెళ్లి "హల్లో

# బుచ్చెమ్మ రహస్యం

సుజాతా. మీకోసం ఇంతసేపటినుంచి ఎదురు చూస్తున్నాను" అన్నాడు. ఆమె నవ్వి, వెనక్కి తిరిగింది. అప్పుడు రవికి సుజాత వెనకాల నల్లగా, లావుగా, పొడుగ్గా వున్న ఒక మీసాలరాయుడు కన్పించాడు. రవి గతుక్కుమన్నాడు. సుజాతతోపాటు వేరొక మగ వ్యక్తి వస్తాడని తను వూహించలేదు. సుజాత, ఆ వ్యక్తితో, "ఈయన నా ఫ్రెండునాన్నా. పేరు రవి. షూటింగంటే చాలా ఇష్టం. వీరు మా నాన్న" అని రవికి పరిచయంచేసి, రవిని క్లిష్టపరిస్థితిలోంచి తప్పించింది. రవికి ప్రాణం లేచివచ్చింది. "నమస్తే" అన్నాడు.

పాపారాయుడుగారికి రవి లక్షణాలేమీ నచ్చలేదు. అసలికి షూటింగంటే ఏమిటో తెలుసున్నట్లు ఆయన కేమీ తోచలేదు. అయినా ఆయన ఏమీ మాట్లాడలేదు. ముగ్గురూ హాలులోకి వెళ్లారు. రవిప్రక్కన పాపారాయుడుగారూ, ఆయన ప్రక్కన సుజాతా కూర్చున్నారు. రవి హ్లానంతా తల్లకిందులైపోయింది. అదృష్టవశాత్తూ సుజాత ముందు కుర్చీలో ఒక పొడుగాటి మనిషి కుర్చున్నాడు. ఆట ప్రారంభమవగానే సుజాత తనకు, ముందుకూర్చీలో కూచున్న వ్యక్తి తల అడ్డంవచ్చి, కన్పించటంలేదంది. పాపారాయుడుగారు తన కుర్చీలో కూతుర్ని కూర్చోమని, తను ఆమె కుర్చీలో కూర్చున్నారు. రవి మొహం వికసించింది. సుజాత తెలివి తేటల్ని మనసులో ఎంతో మెచ్చుకున్నాడు. సుజాతలాంటి అమ్మాయి ఈ ప్రపంచంలో వుండదని నిశ్చయించాడు.

సినిమాలో పాపారాయుడుగారు లీనమైయున్న సమయంచూసి "సుజాతా, నువ్వు ఎంతో మంచి దానివి" అన్నాడు మెల్లిగా రవి. సుజాత అతన్ని మాట్లాడవద్దని సైగ చేసింది చీకట్లోనే. రవికి ఒక్కమాత్రం జవాబుదొరికినట్లనిపించింది.

విశ్రాంతి సమయంలో పాపారాయుడుగారు చుట్ట కాల్చుకోవడానికి బయటికెళ్లారు. రవి ఆమెతో మాట్లాడడానికి తహతహపడుతున్నాడని గ్రహించి సుజాత, "అసలు నే నొక్కర్తెనే వద్దామనుకున్నాను. తీరా బయల్దేరేటప్పటికి మా నాన్న తను కూడా వస్తానన్నారు" అంది.

"ఛాత లేనివేళ మంచిదికాదు" అన్నాడు రవి నిరాశగా.

"అదుగో! మా నాన్న వస్తున్నారు. రేపు బీచిలో కలుద్దాము. సాయంత్రం అయిదు గంటలకు" అని రవితో మెల్లిగాచెప్పి, తండ్రి వచ్చేటప్పటికి ఏమీ ఎరగనిదానిలా కూచుంది. రవి సరేనని తలూపాడు. పాపారాయుడుగారు, రవిని ఏం చేస్తున్నదీ, ఎక్కడ వుంటున్నదీ అడిగారు. ఆయన ఎక్కువ మాట్లాడేమనిషికాదు. ప్రతిక్షణమూ తను జమీందారుననీ, దివాన్‌బహద్దర్‌ననీ జ్ఞాపకం వుంచుకుంటాడు. ఆరోజులు పోయినా, ఆ దర్జామాత్రం పోకూడదని ఆయన మతం. రవి జాగ్రత్తగా సమాధానమిచ్చాడు.

సినిమా అయిపోగానే తండ్రీకూతుళ్లిద్దరూ కారెక్కి వెళ్లిపోయారు. సుజాత రవివేపు మర్చిపో



# తెల్లని దంతములు
# ఆరోగ్యకరమైన చిగుళ్లు
# శుభ్రమైన నోటివాసన







## రెమి టూత్ పేస్టు

రెమి టూత్ పేస్ట్ వాడుటకు నేడే మొదలు పెట్టండి. దాని దట్టమైన నురుగులు, మీ దంతములను బాగా శుభ్రపరచును. దాని సున్నితమైన సువాసన, వాడిన తరువాత చాలసేపు నోటినంటిపెట్టుకొని వుండును. పండ్లపొడిగాకూడా విక్రయింపబడుచున్నది.

రెమి ప్రాడక్ట్సు. ఇండియాలో తయారు

| మలయాలో లభించు ప్రదేశము : | సిలోనులో లభించు ప్రదేశము : |
|---|---|
| మెసర్సు మీనా ట్రేడింగ్ కంపెనీ, 50-ఎ, మార్కెట్ రోడ్, సింగపూరు-1. | ఎ. వి. ఆర్. ఎ. లిమిటెడ్, కొలంబో. RP932 |

రెమి హాస్యనాటకం—ప్రతి శుక్రవారం రేడియో సిలోను 41·72 మీటర్ల మీద సా॥ 6–30 నుండి 6–45 గంటలవరకు వినండి.



## సుఖజీవిత సేవ

భారత "సిద్ధవైద్య మహిమ" మన శైవ సిద్ధుల సాటిలేని కీర్తికి ఒక తార్కాణము.

## "మేల్ మాయిల్ మందు"

ప్రపంచములో ప్రఖ్యాతి గాంచిన మేహ, కుష్ఠరోగనివారిణి

భయంకరమైన మేహ వ్యాధివల్ల కష్టపడువారలకు పునర్జన్మమిచ్చు అద్భుత సంజీవి మేహరోగ నివారిణి మాత్రలు, లేహ్యము.

డా॥ కె. టి. కృష్ణమూర్తి ఆచ్చారి & సన్సు

5/22. మేల్ మాయిల్ P. O.) (N. A. Dt.) S. India.

'ఆంధ్రసచిత్రవారపత్రిక'లో ప్రకటనలు మీవ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి.

# తరచుగా మూత్రవిసర్జన

చక్కెరతో గాని, చక్కెర లేకుండగాని తరచుగా మూత్రము వెలువడుట మిక్కిలి ప్రమాదకరమైన చిహ్నము. శరీరాన్ని గుల్ల చేయడమే కాకుండా ఈవ్యాధి, తనబంధనలో చిక్కినవారిని ఆరోజూ కారోజూ మృత్యువుకు ఆసన్నులనిచేయును. ప్రథమదశలో శారీరక మానసిక శ్రమలకు యిచ్ఛగించకుండుట, నడుములో నొప్పి, చూపుమాంద్యము, తొడల్లో తిమ్మిరి, నరముల బలహీనతతో యీ వ్యాధి పొడచూపును. పై లక్షణములతో కూడిన వ్యాధికి వెంటనే తగిన చికిత్స చేయించకున్నచో, అధికదాహం, ఆకలి, గొంతు నోరు ఎండుట, దురదలు, కాళ్ళలో పగుళ్లు, తూకం తగ్గడం, శరీరమంతా పోట్లు, కీళ్ళ నొప్పులు, కంటిపొరలు, క్షయ, గడ్డలు, రాచపుండ్లు, ఇట్టి భయంకర బాధాకరమైన వ్యాధులు యెన్నో సంభవింపవచ్చును.

"వీనస్ ఛారమ్" మాత్రలు వాడి అనేక వేల మంది తమ బాధలనుండినివారణపొంది మృత్యుకరాళమునుండి రక్షింపబడిరి. "వీనస్ ఛారమ్" శాస్త్రీయ పద్ధతులమీద ప్రాచీన యూనాని వైద్యవిధానం ప్రకారం అమూల్య ఓషధుల శాకపదార్థముల, స్వాభావిక క్షారముల సారముతో తయారైనవి. "అమిత దాహము, మూత్రంలో చక్కెర తగ్గి పలుమారు మూత్రవిసర్జనచేయుఅవసరము 2 లేక 3 రోజులలోనే మీకు చాలాభాగము నివారణయగును. కొద్దిరోజులలోనే మీకు సగానికిపైగా స్వస్థత చేకూరినట్లనిపించును. "వీనస్ ఛారమ్" కొద్ది వ్యయముతో సుఖముగా, తేలికగా సేవించవచ్చును. దీనికి ప్రత్యేకపథ్యము లేదు. నిరాహారముతో నుండే అవసరంలేదు. రోగులు పుష్టికరమైన ఆహారము నిచ్చేందుకై ఇదివరకటి కంటే ఎక్కువరకాల ఆహారపదార్థములు తీసికొనవచ్చును. వివరములుగల ఇంగ్లీషుకరపత్రములు అడిగినవారికి ఉచితముగా పంపబడును. 50 బిళ్ళలఖరీదు రు.6-75న.పై. మాత్రమే. పోస్టేజినిమిత్తం రు. 1-6 న.పై. అదనం. (ఒకేసారి రెండు, అంతకుపైగా సీసాలను తీసికొన్నచో పోస్టేజి ఉచితం.)

(SELLING AGENTS)
Barrys Commercial Corporation
(A. P. W)
27/A, Dhurumtollah Street
CALCUTTA-13.

# బుచ్చమ్మ రహస్యం

వద్దన్నట్లుగా ఒక చూపు చూసింది—కాలేక్కి సుందర. రవి, తప్పకుండా జ్ఞాపకముంచుకుంటా నని కళ్లతో జవాబిచ్చాడు.

రవి వాళ్లని సాగనంపి వెనక్కి తిరిగేసరికి మిత్ర బృందం అతన్ని చుట్టుముట్టేసి, "ఒరేయ్! తాజా వార్తలన్నీ మాకు తొందరగా అందించరా" అని అడిగారు. రవి జరిగిందంతా చెప్పాడు.

"వూఁ! అయితే 'మామ' కూడా రంగంలో ప్రవేశించాడన్నమాట! నిన్ను ఎలా 'ఇంట్రడ్యూస్' చేసింది?" అని అడిగాడు సూర్యం.

"నాపేరు బాగా గుర్తుంచుకోండిరా. నాకు షూటింగంటే చాలా యిష్టం అంది తండ్రితో."

"రైటే. మనందరం పిక్చరు షూటింగ్ త్వరలోనే మొదలుపెడ్దామనుకొంటున్నాంగా!"

"పిక్చరు షూటింగ్‌కాదురా! రైఫిలు షూటింగురా. మామకి వేటంటే చాలా ప్రీతి. అందుకని, మనవాడిని ఆయనకు ప్రీతిపాత్రుడిని చెయ్యడానికి అలా చెప్పింది" అన్నాడు రహమాన్.

"నిజమేరా! చాలా చికాకే వచ్చింది" అన్నాడు రవి.

మిత్రబృందం రవికి షూటింగులో ట్రైనింగ్ ఇప్పించడానికి నిశ్చయించారు. కాబోయే మామగారిని మంచి చేసుకోవాలంటే అది చాలా అవసరమని అభిప్రాయపడ్డారు.

మర్నాడు సాయంకాలం బీచిలో రవీ, సుజాతా కలుసుకున్నారు. ఇద్దరూ సముద్రపుటొడ్డున, దూరముగానడిచి ఏకాంత స్థలంలో కూచున్నారు. సముద్రపు హోరు, తరంగాల జోరు రవి హృదయంలో ప్రేమను పొంగింపజేశాయి.

"సుజాతా నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను. నువ్వులేందే బ్రతకలేను."

"మిస్టర్ రవీ, మిమ్మల్ని చూసినప్పుడే నా మనసు మీ కర్పించేశాను."

"నిజమేనా! నేను చాలా అదృష్టవంతుణ్ని."

"నేను చాలా నిర్భాగ్యురాల్ని."

"ఏం? ఎందుచేతా ?"

"మిమ్మల్ని మనసారా ప్రేమించాను కాని, మా నాన్న నా కప్పుడే ఇంకొక సంబంధం నిశ్చయించేశాడు."

"ఆఁ! మనిష్టపడ్డావా? నా ఆశలన్నీ నీమీదే పెట్టుకున్నాను సుజాతా."

"నా ఇష్టాయిష్టాలతో ఆయనకు నిమిత్తం లేదు. ఆయన కెంతసేపూ జమిందారీ హోదామీదే దృష్టి. జమీలన్నీపోయినా, ఆ అహంభావం పోలేదు. ఒక పెద్ద జమిందారుగారబ్బాయికి నన్నిస్తానని మాట ఇచ్చేశాడు."

"అరె! ఇప్పుడెలా? ఎలాగైనా మన మాసంబంధం తప్పిపోయేట్టు చెయ్యాలి."

"అది చాలా కష్టం. వారికి నా ఫోటో పంపారు. వాళ్లకు నేను నచ్చానట. తొందర్లోనే ముహూర్తాలు పెట్టేద్దామని చూస్తున్నారు."

"నీ కిష్టంలేదని చెప్పలేదా ?"

"నేనూ మా అమ్మా కూడా ఎంతచెప్పినా ఆయన వినలేదు."

—సశేషం]

## న్యూఢిల్లీ లేఖ

(7-వ పేజీ తరువాయి)

మాత్రం ఉండాలి. ఈ ప్రమాణాన్ని అందుకుని కృతకృత్యులైనవారిని ఉద్యోగాలలో నియమించే ముందు, అన్ని ప్రధాన శాఖలలోను వివిధ వర్గాల ప్రజలకు తగిన ప్రాతినిధ్యం కల్పించడానికి కొంతలో కొంత స్వాతంత్ర్యం అవసరం."

"నూతనంగా ఏర్పడుతున్న ఉద్యోగ సదుపాయాలు సమాజంలోని అన్ని వర్గాలవారికి సమానంగా లభ్యం కావడంలేదేమో ననిపిస్తుంది. కొన్ని వర్గాలవారు తమ పలుకుబడిని, అధికారాన్ని వినియోగించి, తమ తమ వర్గాలకు చెందినవారికే కొన్ని ఉద్యోగాలు బహుశః యిస్తూ ఉండవచ్చు. విచారణ జరిపించి, ఇదే యదార్థమని ఋజువు అయితే ఈ లోపాలను సవరించి అందరికి సమానావకాశాలు కల్పించటం అవసరం."

స్వాతంత్ర్యం వచ్చింది లగాయితూ, స్వర్గీయ మౌలానా ఆజాద్ ధర్మమా అని శ్రీ కబీర్‌కు విద్యాశాఖతో సంబంధం ఉంటూ వచ్చింది. అందువల్ల, యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ ఏవిధంగా పరీక్షలు నిర్వహిస్తున్నదీ ఆయనకు తెలిసి ఉంటాలి. కనుక శ్రీ కబీర్ సూచనలను జాగ్రత్తగా పరిశీలించటం అవసరం. 'ఇంటర్వ్యూలో వ్యక్తిగతమైన ఇష్టానిష్టాలకు అవకాశం ఉండకపోదు' అని ఆయన అంటున్నారు. మరోవిధంగా చెప్పాలంటే, యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ సభ్యులు అభ్యర్థులను ఇంటర్వ్యూ చేసే సందర్భంలో వ్యక్తిగతమైన ఇష్టానిష్టాలకు లొంగిపోయే అవకాశం మొత్తంమీద ఉన్నదని అనుకోవలసి వస్తుంది. ఈ కారణంవల్లనే నేమో, రైల్వేల తాలూకు నాలుగు పబ్లిక్ సర్వీస్ కమీషన్లలో మూడింటికి షెడ్యూల్డ్ కులాలకు చెందినవారు అధ్యక్షులుగా ఉన్నారు.

శ్రీ కబీర్ తాము విద్యావేత్తలమని అంటారు. మానవులకు రకరకాల అభిరుచులు ఉంటాయనీ, ఇంజనీర్లుగా తయారవ్వాలని కొంద రనుకుంటే, విజ్ఞాన శాస్త్రవేత్తలుగా తయారవ్వాలని మరి కొందరనుకుంటారనీ, ఇంకా కొందరు విద్యావేత్తలుగా కావాలనుకుంటారనీ ఆయన అంగీకరించక తప్పదు. శ్రీ కబీర్ పథకాన్ని అనుసరించి మన విశ్వవిద్యాలయాలు కమ్యూనిస్టు దేశాలలోవలె నికమూనలో గుమాస్తాల సైన్యాన్ని తయారుచేసి, ప్రభుత్వ, వాణిజ్య రంగాలలో ఉద్యోగాల నిర్వహణకు పంపవలసి వస్తుంది. అభిరుచితో గాని అర్హతలతోగాని నిమిత్తంలేకుండా, ప్రతివర్గం వారికి తగిన ప్రాతినిధ్యం లభించేవిధంగా ఉద్యోగులను ఎన్నుకోవాలి. శ్రీ జగ్‌జీవన్‌రాం మరొక అడుగు ముందుకు వేశారు. ప్రమోషన్లకు కూడా ఆయన కుల ప్రాతిపదిక వర్తింపజేశారు. పండిత నెహ్రూ అధ్యక్షుడుగా ఉన్న మంత్రిమండలి ఆమోదంపొందే ఆయన ఈ పని చేశారు. అంటే ఒకవైపున ప్రమోషన్లలో కుల తత్వాన్ని ప్రవేశపెట్టాలని శ్రీ జగ్జీవన్‌రామ్ సూచనను అంగీకరించిన మంత్రిమండలి సభ్యులే మరొకవైపున కులతత్వం నిర్మూలనకు కంకణం కట్టుకుని, బహిష్కృత తీర్మానాన్ని బలపరిచారన్నమాట. ★

## "పుటుకతోపుటేబుద్ధులు"

అతని పేరు చెల్లప్పన్ మద్రాసు జేబుదొంగలలో పేరు మోసినవాడు. అప్పుడే బస్సు దిగిన ఒకముసలి ప్లీడరుగుమస్తా జేబులోంచి మనీపర్సును కాజేసి చల్లగా అక్కడనుంచి జారుకొన్నాడు. తర్వాత మరొక బస్సుస్టాండ్ వద్ద బస్సు ఎక్కబోయాడు. ఉన్నట్లుండి అతని జేబులోని మనీపర్సుపై ఎవరో చెయ్యివేసినట్లు తోచి వెంటనే వెనుతిరిగాడు. ఒక అందమైన యువతి అతనికళ్ళలోకి నవ్వుతూ చూసింది. ఆమె పేరు నహానాజ్ బీగము కలకత్తాలోని ఒకజేబు దొంగల పట్టుకుచెందిన స్త్రీ.

ఇద్దరి చూపులు కలిశాయి ఒకరినొకరు తెలుసుకొన్నారు. ఇద్దరూ నవ్వుకున్నారు. ఆ పరిచయం సఖ్యం అయింది. వాళ్ళిద్దరూ దంపతులయ్యారు.

తత్ఫలితంగా నహానాజ్ బీగము ఆడపిల్లను ప్రసవించింది కాని, అబిడ్డ ఒక అవలక్షణంతో పుట్టింది. కుడిచెయ్యి గుప్పెట మూసుకుపోయింది. ఆ గుప్పెట విడిపించేందుకు ఆదంపతలిద్దరూ శత విధాల ప్రయత్నించారు. కాని ఫలితంశూన్యం. కొమ్ములు తిరిగిన డాక్టర్లుసైతం పెదవులు విరిచారు. ఉన్నట్టుండి చెల్లప్పన్‌కు ఓ యోచన తట్టింది. ఏకాయెకీన తనచేతికున్న బంగారపువాచీ గొలుసు తీశాడు. ఆబిడ్డ లేతకళ్లకు అగుపించేలా కుడిచేతిగుప్పెటకుఒకఅంగుళము ఎత్తున ఆవాచీని ఇటూ అటూ ఆడించసాగాడు. ఇలా ఒక పావుగంట చేసేసరికి గుప్పెట కొద్దికొద్దిగా వాడుతూ తర్వాత పూర్తిగా వాడింది. ఆవాడిన గుప్పెట్లోంచి మిలమిలా మెరుస్తున్న ఒక ఉంగరం క్రింద పడింది. ఆపిల్లపుడుతూన్న సమయాన పురుడుపోసిన మంత్రసానికుడిచేతి వ్రేలిఉంగరము అది!

* * * *

ఒక ఉద్యోగి (మరొక ఉద్యోగితో): ఏమండీ! గడ్డం అలా పెంచుకున్నారు. ఏమైన విశేషం ఉందా?

రెండవ ఉద్యోగి:-అబ్బే ఏమీ లేదు. నా ట్రాన్స్‌ఫర్ టి. ఎ. బిల్లు డబ్బు రాక సంవత్సన్నరకు పైగా అయింది. అది వచ్చేవరకు గడ్డం చేయించుకో దలచలేదు. అంతే.

కొల్లా వెంకటేశ్వరరావు (గుంటూరు)

దినం ప్రఖ్యాత చిత్రకారులు బాపూ పై శీర్షిక క్రింద కార్టూన్లు వేస్తున్నారు.

# 1-11-61

కవిసమ్రాట్ నోరి నరసింహశాస్త్రిగారి

# చరిత్రాత్మక నవల

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street, Madras-1. Chief Editor : S. Sambhu Prasad.